





# చరిత్ర

## హిందూ దేశ,ఆంధ్రుల,సాహిత్య,తత్వ

# తూలనాత్మక సాహిత్యం





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విషయ సూచిక


| | | |
|---|---|---|
| తెలుగు తమిళములు | ..... | 1 |
| తెలుగు తమిళ సాహిత్యాలు | ..... | 14 |
| తెలుగు తమిళ భక్తి సాహిత్యాలు | ..... | 44 |
| తిరుక్కుఱళ్ – తెలుగు సాహిత్యం | ..... | 57 |
| తెలుగు తమిళనాడులలో శైవం | ..... | 70 |
| పాల్కురికి సోమన - మాణిక్య వాచకర్ | ..... | 81 |
| పెరియ పురాణం - బసవపురాణం | ..... | 90 |
| తమిళాంధ్ర నవ్యకవిత్వములు | ..... | 103 |
| వీరేశలింగం - భారతి | ..... | 116 |
| గరిమెళ్ల భారతిదాసన్ కవులు | ..... | 127 |
| తెలుగు మలయాళములు | ..... | 136 |
| తమిళ మలయాళ రామాయణాలు | ..... | 142 |
| తెలుగు - తమిళ సంస్కృతులు | ..... | 157 |
| తులనాత్మక సాహిత్యం | ..... | 170 |
| అవీ - ఇవీ | ..... | 184 |

# మనవి మాటలు

1955లో నా తమిళ పంచకావ్య కథలు వెలువడింది. మదరాసు విశ్వవిద్యాలయంవారి పి. యు. సి. పరీక్షకు పాఠ్యగ్రంథంగా నిర్ణయించబడిన తొలి తెలుగు పుస్తక మది. తత్ఫలితంగా ప్రాచీన తమిళకావ్య వైభవాన్ని గ్రహించేందుకూ, తులనాత్మక సాహిత్యాధ్యయనం చేసేందుకూ అవకాశం లభించిం దని విద్వల్లోకం భావించింది. 1964, 67 లలో తెలుగులో తమిళసాహిత్యాంశాలు, తెలుగు తమిళ రామాయణాల తులనాత్మక పరిశీలనం అనే సిద్ధాంత వ్యాసాలు ఆంగ్లంలో వ్రాసి మదరాసు విశ్వవిద్యాలయంవారికి సమర్పించాను. నాటి నుంచీ నేటి దాకా తులనాత్మక సాహిత్య సంబంధి రచనలు చేస్తూనే ఉన్నాను. అయినా ప్రాచీన తమిళ కవయిత్రి అవ్వైయారు చెప్పినట్లుగా, 'నేర్చింది గుప్పెడు, నేర్వ వలసింది బోలెడు.' ఈ సత్యోక్తులు స్ఫురణకు వచ్చినప్పుడల్లా, బహు భాషా నిలయ మైన మనదేశంలో తులనాత్మక సాహిత్యాధ్యయన రంగంలో జరగవలసిన కృషి ఎంతైనా ఉన్న దనే అంశం వ్యక్త మవుతుంది.

ఈ నాడు రచయితలూ పండితులూ తులనాత్మక సాహిత్యపరిశీలనం పట్ల శ్రద్ధాసక్తులు ప్రదర్శిస్తున్నారు. అయితే మూలభాష నుంచే చేయబడిన అనువాదాల సంఖ్య అంతంతగా ఉండడం వల్ల, ద్వితీయాకరాలతోనే తృప్తిపడవలసి వస్తున్నది. ఎప్పటికైనా ఈ పరిస్థితిలో మార్పు వస్తుందనే నా నమ్మకం.

నా యితర రచనల్ని ఆదరించినట్లుగానే, ఈ తులనాత్మక వ్యాస సంపుటిని కూడా సోదరాంధ్రులు ఆదరించగలరని విశ్వసిస్తున్నాను. అక్కడక్కడ పునరుక్తులు చోటు చేసుకున్నందుకు విచారిస్తున్నాను.

ఈ పుస్తక ప్రచురణకు ఆర్థిక సాహాయ్యం చేసిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి సవినయంగా కృతజ్ఞత తెలియజేస్తున్నాను.

ఈ వ్యాస సంకలనాన్ని చక్కగా ముద్రించిన జీ. బీ. గ్రాఫిక్స్, వెల్డన్ ప్రెస్ అధిపతులకు కృతజ్ఞుణ్ణి.

— చల్లా రాధాకృష్ణ శర్మ

# 1. తెలుగు తమిళములు

అప్పర్ నామాంతరం గల తిరునావుక్కరసు(శర్) నాయనార్ (వాగీశుడు) శైవసమయాచార్యులలో ప్రముఖుడు. తమిళవేదమనే విఖ్యాతిని గడించిన తేవారం కర్తలు ముగ్గురిలో ఆయన ఒకడు. తేవారం ఎనిమిది వేల భక్తిగీతాల సంకలనం. సంస్కృత ద్రావిడ భాషలలో విద్వాంసుడైన తిరునావుక్కరసు క్రీస్తుశకం 7వ శతాబ్దిలో జీవించాడు. శివుడు సర్వమూ అయినవాడు అనే అర్థంలో ఆయన 'ఆరియన్ కణ్డాయ్, తమిళ(ழ) న్ కణ్డాయ్' అని పేర్కొన్నాడు. అనగా, ఆర్యవేదాలకూ తమిళ వేదాలకూ శివుడు గోచరుడనే అర్థం ఇక్కడ ప్రయుక్తం. శివుని డమరుకం మ్రోగినప్పుడు ఒక వైపు నుండి సంస్కృత శబ్దాలు, మరొక వైపు నుండి తమిళశబ్దాలు ఉత్పన్నమైనట్లు ఒక ఐతిహ్యం. ఉత్తర భాష (వడమొళి) అయిన సంస్కృతాన్ని పాణినికీ, దక్షిణ భాష (తెన్‌మొళి) అయిన తమిళాన్ని అగస్త్యునికీ శివుడు నేర్పినట్లు ఒక పురాణగాధ. సంస్కృత ద్రావిడ భాషల అభివృద్ధికి శివుడు కారణభూతుడైనాడని పిండితార్థం.

సంస్కృత భాషాభిజ్ఞులు తెలుగుని ఆంధ్రం అని వ్యవహరించినట్లుగా, తమిళాన్ని ద్రావిడమని వ్యవహరించారు. అతి ప్రాచీనమైన తమిళ సాహిత్యంలో ద్రావిడశబ్దం ఉపయోగించబడ లేదని తద్భాషా పండితుల అభిప్రాయం; తరువాతి కాలంలోనే అది ప్రచారంలోకి వచ్చినట్లు చెప్పవచ్చు.

తెలుగువారు నేడు తమిళం, అరవం అని ఆ భాషను వ్యవహరించినా ప్రాచీనులు ద్రవిడం, ద్రావిడం అని వ్యవహరించారు. నేటికీ తెలుగునాడులో తీరాంధ్రదేశంలో - పెక్కు చోట్ల దిమిరి ద్రావిడులు, ఆరామ ద్రావిడులు, పేరూరు ద్రావిడులు, కోనసీమ ద్రావిడులు, పుదూరుద్రావిడులు మొదలైన ద్రావిడ బ్రాహ్మణ కుటుంబాల వారు కనిపిస్తారు. వీరి పూర్వులు తమిళ దేశం నుంచి వచ్చినట్లుగా చరిత్రకారుల అభిప్రాయం. వీరి ఆచార వ్యవహారాలకూ తెలుగు బ్రాహ్మణుల ఆచార వ్యవహారాలకూ మధ్య కొంచెం భేదం కనిపిస్తుంది. ఇపుడిపుడు ఈ భేదం అంతగా కనిపించక పోవచ్చు. అయినా శుభాశుభకార్యాలలో నేటికీ ఈ

తేడా కొంతవరకు తెలియవస్తుంది. తమిళభాషనూ తమిళుల్నీ ఉద్దేశించి తొలుత ద్రావిడ శబ్దం ప్రయుక్తమైనట్లు భావించవచ్చు. కాలక్రమాన ద్రావిడ శబ్దం విపులమైన అర్థం సంతరించుకుంది.

పెక్కు భాషలలో వృషాధిపుణ్ణి స్తుతించిన పాల్కురికి సోమనాథుడు ద్రావిడ భాషలో కూడా స్తుతిస్తూ చెప్పిన 'పరమనె యన్నె యాండ వనె ........' పద్యంలో స్పష్టంగా 'ద్రావిడ భాష నుతింతు' అన్నాడు. ద్రవిడ మహీస్థలి యందు - అని ఆయనే తన పండితారాధ్య చరిత్రలో (2-124) ఉపయోగించాడు. ద్రావిడానికి మారుగా ద్రవిళ శబ్దం కూడా వాడబడింది. ద్రవిళ జంగమ పుంగవుండని కాళహస్తి మాహాత్మ్య కర్త (4 - 108, 120) వాడాడు.

పండితారాధ్య చరిత్రలో సోమనాథుడు అరువదేశ మనీ, ద్రావిడ భాష అనీ ఉపయోగించడం గమనించదగింది. దేశాన్ని అరువదేశ మన్నా, భాషను మాత్రం ద్రావిడమని ఆ కవిపుంగవుడు పేర్కొనడం విస్మరించరాని విషయం. ఆయన మాటలనే పరిశీలిద్దాం.

*'అరుదొంద నట్ల యయ్యరువదేశంబు*

*పరుసయు ద్రావిడభాష సొంగముగ (1939, 2వ భాగం, పుటలు 388,9)*

కాగా సోమనాథుని నాటికి అరువదేశం వాడుకలో ఉన్నట్లు భావించడంలో విప్రతిపత్తి లేదు.

దాక్షిణాత్యుల్ని పంచద్రావిడులనీ, ఔత్తరాహుల్ని పంచగౌడులనీ ప్రాచీనకాలంలో వ్యవహరించినట్లు తెలియవస్తున్నది. వింధ్య దక్షిణవాసులు ద్రావిడులు. అబిదాన చింతామణి అనే తమిళ నిఘంటుకర్త (1910) పంచద్రావిడ శబ్దం బ్రాహ్మణులకే పరిమితమని భావించాడు. ఈ పంచ ద్రావిడులలో మహారాష్ట్రులూ ఘూర్జరులూ కూడా ఉన్నారు.

తమిళం తమిళ్ (*ழ*) శబ్దభవం. తెలుగులో (*ழ*) కారం భ్రష్టం కావడం వల్ల, దానికి బదులుగా ళకార డకారాలు వాడబడ్డాయి.

(*ழ*) కారం తమిళమునకు ప్రత్యేకత ఆపాదిస్తున్న అక్షరమని ఆ భాషా విద్వాంసుల అభిప్రాయం.

తెలుగువారు తమిళమునకు పెట్టిన పేరు అరవం. ప్రాచీనాంధ్ర కవులు అఱవ మని కూడా వ్యవహరించారు. అలాగే తమిళుల్ని అరువర్ అని వ్యవహరించినట్లు భావించవచ్చు. అరువర్ అనగా అరువనాటి వారని అర్థం. నేటి దక్షిణార్కాడు జిల్లాలోని ఎక్కువ భాగాన్ని ప్రాచీన తమిళులు అరువానాడని పిలిచేవారు. అప్రశస్తమైన తమిళం (కొడుం తమిళ్) వాడుకలో ఉన్న 12 ప్రాంతాలలో (నాడులలో) ఇదొకటి. కనుక అరువానాడులోని తమిళం అప్రశస్తమని భావించడం సాహసం కాదు. బహుశః అరువనాటి తమిళులకూ తెలుగువారికీ మధ్య రాకపోకలు ఉండివుండవచ్చు. వారిని తెలుగువారు అరువానాటి వారు, అరవలు అని వ్యవహరించడం వల్ల వారి భాషకు అరవమనే పేరు వచ్చి వుండవచ్చు. అరవ మంటే తమిళంలో పాముని అర్థం! చివరికి అరవ మన్న మాట తెలుగు సమాజంలో నిలిచిపోయింది.

11వ శతాబ్దంలో వెలుగు చూసిన కలింగత్తుప్పరణి అనే చారిత్రక కావ్యంలో తత్కర్త కవిచక్రవర్తి జయంగొండార్ 'అరువ ररువ రెనా విరైంజినర్' అన్నాడు. అరువలు అరువలు అంటూ తమిళ సైనికుల్ని చూసి తెలుగు వీరులు పారిపోయినట్లుగా ఇందుకు అర్థం చెప్పవచ్చు. కనుక తెలుగువారు తమిళుల్ని అరవలనే పేరుతో వ్యవహరించారనడం స్పష్టం. కాని అరువ శబ్దం తమిళజాతిని పూర్తిగా సూచించదనీ, అరువనాటి వారికే అది పరిమిత మైనదనీ చెప్పడం భావ్యమేమో!

మొదట్లో తమిళులు కూడా తెలుగువారిని ఆ పేరుతో పిలిచేవారు కాదని చెప్పడం సమంజసం. వడుగర్ అని వ్యవహరించేవారు. అయితే ఈ పేరు కన్నడిగులకు కూడా వర్తిస్తుందని భావించే తమిళ పండితులు కొందరు లేకపోలేదు. కాని సుప్రసిద్ధ పరిశోధక విద్వాంసులు ము. రాఘవయ్యంగారు తమ ఆరాయ్చ్చిత్తొగుది అనే పరిశోధక వ్యాససంకలనంలో నిర్బంధ్వంగా ఇలా పేర్కొన్నారు. 'అది (అనగా కన్నడం) తమిళం తెలుగు భాషల కలయిక వల్ల ఏర్పడిన భాష అని ప్రాచీన తమిళ విద్వాంసుల విశ్వాసం..... ఈ ప్రమాణములను పురస్కరించుకొని చూడగా, తెలుగునకు తమిళమునకు ఉన్నంత ప్రాచీనత కలదని గ్రహించవచ్చు' (తమిళుం తెలుంగుం వ్యాసం, పుటలు 313-39).

తియ్యని భాషలుగా గ్రహించడంలో వింత యేమీ లేదు. కాని యీ ఉభయభాషలు నేర్చిన పాశ్చాత్య విద్వాంసులు తెలుగు భాషా మాధుర్యాన్ని బహుధా ప్రశంసించారు. ద్రావిడ భాషలకు ఎనలేని సేవ చేసిన రాబర్ట్ కాల్డ్వెల్ చెప్పిన యీ మాటలు గమనించదగినవి: 'ద్రావిడ భాషలలో తమిళమునకు తరువాతిదిగా తెలుగు భావించబడినా, మాధుర్య విషయంలో తెలుగుదే అగ్రతాంబూలం.' శ్రీకృష్ణదేవరాయల వంటి బహు భాషాభిజ్ఞులు దేశభాషలలో తెలుగు లెస్స అన్నారు. లెస్స అంటే శ్రేష్ఠమని అర్థం. సుబ్రహ్మణ్య భారతి వంటి సహృదయులైన తమిళ కవులు సుందరాంధ్రమని తెలుగుని కీర్తించారు. కాగా తెలుగు తమిళములు తేనెవంటి భాషలే అయినా, తెలుగు మరింత మధురమైన భాష అనడం సాహస మనిపించుకోదు. సాహిత్య ప్రాచీనత విషయంలో నిస్సంశయంగా తమిళానిదే పై చెయ్యి.

తెలుగు భాషా మాధుర్యానికి కారణం, అది అజంతం కావడమని మన పండితుల అభిప్రాయం. తమిళం అజంతం కాదు; హలంతం. కాని నన్నెచోడుని 'ముమ మార్గకవిత లోకంబున ... ..' పద్యంలోని చాళుక్యరాజు మొదలుగ పలువుర్ పాదంలోని 'పలువుర్'ని శాసనాల లోని రాజుళ్ వంటి రూపాల్ని ఆధారంగా చేసుకుని చూస్తే ఒకప్పుడు తెలుగు కూడా హలంతంగా ఉండేదేమో అనిపిస్తుంది.

తమిళమునకు అక్షరాలు 30; వీటిలో అచ్చులు 12, హల్లులు 18. మహాప్రాణాలు లేవు. తెలుగుకి అక్షరాలు 36. తెలుగులో అదనంగా అక్షరాలు కొన్ని ఉండడం స్థూలదృష్టికి కూడా తెలియవస్తుంది. ఇందుకు కారణం, తెలుగులో సంస్కృత వర్ణాలు చేరడమే. తత్ఫలితంగా సంస్కృత శ్లోకాన్ని తెలుగులో యథాతథంగా లిప్యంతరం చెయ్యవచ్చు. ఆర్య ద్రావిడ సమ్మేళనం తెలుగువారి ఆచార వ్యవహారాలలోనే కాక తెలుగు వర్ణ సమామ్నాయంలోనూ కానవస్తుంది. అనగా, తెలుగు సంస్కృతంలోని ఒత్తక్షరాలను గ్రహించింది; తమిళం లోని హ్రస్వాక్షరములైన ఎ, ఒ లను గ్రహించింది. అయితే తెలుగులోనే కనిపించే దంత్య చజలు అటు సంస్కృతంలోనూ లేవు, ఇటు తమిళంలోనూ లేవు. నేడు లిపిలో దంత్య భేదాన్ని అంతగా పాటించకపోయినా, ఉచ్చారణలో మాత్రం ఈ

భేదాన్ని పాటిస్తున్నాము. దంత్య చజలు తెలుగుకే సొంత మనవచ్చు. తెలుగు లిపి సంప్రదాయంలో ఋ, ఌ ఉన్నాయి; కాని ఉచ్చారణలో లేవు. లిపిలో కూడా వీటిని పాటించని వారు పలువు రున్నారు. తమిళములో ఈ వర్ణములు లేవు. అలాగే శ, ష, స లు కూడా లేవు. కాని ఉచ్చారణలో వీటిని పాటించే వారు కొంద రున్నారు. ఇటీవల తమిళనాడు ప్రభుత్వం జ, ష, స మొదలైన కొన్ని వర్ణాలను పాఠ్యగ్రంథాలలో వాడడాన్ని నిషేధించింది. ఆంగ్లంలో వరదరాజన్ అని వ్రాసినా, పండితులు వరదరాచన్ అని వ్రాసి, వరదరాశన్ అని ఉచ్చరిస్తారు. తెలుగువారి లిపి ఉచ్చారణ ఇంచుమించు ఒకే విధంగా ఉంటుంది. ఇది కొన్ని మాటలకు వర్తించదు. సత్యం, విద్య అని తెలుగు వారు వ్రాసినా, వాటిని సచ్యం, విజ్య అని ఉచ్చరిస్తారు.

తమిళభాషా సాహిత్యాలకు ప్రత్యేకత సమకూర్చిన గ్రంథాలలో ప్రముఖమైనది తొల్కాప్పియం. దీని రచనా కాలం గురించి పండిత లోకంలో అభిప్రాయ భేదాలున్నప్పటికీ, తొల్కాప్పియం మాత్రం బహుప్రాచీనమైన లక్షణ గ్రంథ మనడం నిస్సంశయం. ఇది క్రీ.పూ. 3వ శతాబ్దిలో సంతరించబడింది. ఇలాంటి ప్రాచీన లక్షణ గ్రంథం తెలుగులో లేదు. నన్నయ కృతమని భావించబడుతున్న ఆంధ్రశబ్ద చింతామణి తెలుగుకి లభించిన తొలి లక్షణ గ్రంథం. అయితే యిది సంస్కృత రచన. ఈ వ్యాకరణ సూత్రాల గ్రంథం శబ్దసిద్ధి లోకం వల్ల విదితమవుతుందని చెపుతున్నది. (సిద్ధిర్లోకాద్వృశ్యా). దేశ్యం ప్రవాహసదృశం(ప్రవాహినీ దేశ్యా), కవుల ప్రయోగాలే వ్యాకరణానికి శరణ్యం (ప్రయోగ శరణం వ్యాకరణం) వంటి సూత్రరత్నాలు అహోబల పండితీయంలో అందాలు దిద్దుకున్నాయి. తెలుగులో వెలసిన మొదటి సూత్రాంధ్ర వ్యాకరణం మూలఘటిక కేతన (1200 - 80) పద్యరూపంలో రచించిన ఆంధ్రభాషా భూషణం. ఇది 190 పద్యాల రచన. ఛందోలంకారాది కావ్యలక్షణాలను వివరిస్తూ వ్రాయబడిన తొలి లక్షణగ్రంథం విన్నకోట పెద్దన (15వ శతాబ్ది) రచించిన కావ్యాలంకార చూడామణి. ఇది కూడా పద్యరూపమే. కాగా తెలుగుకి గల వ్యాకరణ దీపం చిన్నదనడం సత్య సన్నిహితం.

తమిళ వ్యాకరణం బహు విస్తృత మయింది. సూత్రపద్ధతిలో వ్రాయ బడిన తొల్కాప్పియంలో 1628 సూత్రా లున్నాయి. తొల్కాప్పియనార్ అన్నది అసలు పేరు కాదు; బిరుదనామం. ఆయన మతం, కాలం - అన్నీ వివాదగ్రస్తములే. క్రీస్తుశకం 5వ శతాబ్దిలో ఆయన జీవించినట్లు పరిశోధకులు భావించగా, క్రీస్తుపూర్వం 5వ శతాబ్ది అని పండితులు భావించారు. పాణినిని అనుసరించి ఆయన రచన సాగించినట్లు తెలియ వస్తున్నది. మరికొన్ని సంస్కృత రచనల ప్రభావమూ ఆయన మీద ఉన్నట్లు వ్యక్త మవుతున్నది. ఈ తమిళ లక్షణ గ్రంథంలో అర్థం అనుసరించి శబ్దాలకు లింగవివక్ష తెలపడం గమనించదగిన అంశం. వ్యవ హారంలో కలిసిపోయిన శబ్దాలను - అవి కొత్తవి అయినా సరే - వాటిని కూడా స్వీకరించవచ్చునని ఆదేశించిన ఆయన ఔదార్యం ప్రశంసార్హం. ఆయన కాలం నాటికే సంస్కృత శబ్దాలు కొన్ని ప్రచారంలో కలసిపోయి నవి. ఆయన సంస్కృత శబ్దాలు గ్రహించినా, ఆయన రచనలో పాణిని ప్రభావం గోచరించినా తొల్కాప్పియం స్వతంత్రమైన లక్షణ గ్రంథమని భావించడం సమంజసం. అది ఏక కర్తృకమా కాదా అనే విషయం లోనూ అభిప్రాయభేదాలు లేకపోలేదు.

తొల్కాప్పియంలో ఎళుత్తు అదికారం (అక్షరములు), సొల్ అదికారం (శబ్దములు), పొరుళ్ అదికారం (కావ్యవస్తువు) అనే మూడు పరిచ్ఛే దాలు ఉన్నాయి. ఒక్కొక్క పరిచ్ఛేదంలోనూ తొమ్మిది అధ్యాయాలు, అనగా మొత్తం 27 అధ్యాయాలు ఉన్నాయి. మొదటి రెండధికారాలు భాషాశాస్త్రానికి సంబంధించినవి. తుది అధికారం కావ్యవస్తువు లేదా సాహిత్యానికి సంబంధించినది. ఈ అధికారం వల్లనే తొల్కాప్పియం ప్రత్యేకత గడించుకుంది. ఇందులో శృంగారం లేక ప్రణయం (అగం), వీరం (పురం), రహస్య ప్రణయం (కళవియల్), సాంసారిక ప్రణయం (కర్పియల్), ఉపమాద్యలంకారాలు (ఉవమై ఇయల్), ఛందస్సు (సెయ్యుళ్ ఇయల్), సాహిత్య సంప్రదాయాలు (మరబియల్) మొద లైన పెక్కు విషయాలు వివరించబడ్డాయి. కేవలం వ్యాకరణ విష యాలే కాక సాహిత్య విషయాలు కూడా ( జాతీయాలు మొదలైనవి) లక్షణగ్రంథంలో వివరించదగిన అంశాలుగా భావించడం ఆయన వివేకా

నికి ప్రబల నిదర్శనం. ఇలాంటి ప్రత్యేకత సంతరించుకున్న లక్షణగ్రంథం ఇతర దక్షిణాది భాషలలో లేక పోవడం ఆ తమిళ లక్షణ గ్రంథానికి గల విశిష్టతను వ్యక్తం చేస్తున్నది.

మయిలై (మదరాసులోని మైలాపూరు) తొల్కాప్పియరని పేరు పెంపులు గడించిన బహుభాషాకోవిదులైన వే.వేంకటరాజులు రెడ్డిగారిని గురించి ఈ సందర్భంలో రెండు ముక్కలు చెప్పడం అవసరం. ఆయన తొల్కాప్పియం శబ్దపరిచ్ఛేధ పరిశోధన గ్రంథం ఒకటి తమిళంలో వ్రాశారు. ఆ గ్రంథానికి పరిశోధక విద్వాంసులు యస్. వైయాపురి పిళ్లైగారు ఉపోద్ఘాతం వ్రాస్తూ యిలాఅన్నారు. 'His extensive knowledge of Telugu, Kannada and Malayalam has enabled him to throw a flood of light on the interpretation of this ancient grammar'. ప్రాచీన తమిళ లక్షణ గ్రంథాన్ని పరిపూర్ణంగా అర్థం చేసుకొనేందుకు తెలుగు మొదలైన తోబుట్టుభాషల పరిజ్ఞానం వాంఛనీయమన్న అభిప్రాయాన్ని వైయాపురి పిళ్లైగారు వ్యక్తం చేశారు. పొరుళది గారమును తిమ్మావజ్ఝల కోదండరామయ్య గారు తెలుగు చేశారు.

శబ్ద సిద్ధిని లోకంవల్ల తెలుసుకోవచ్చునని నుడివిన నన్నయభట్టు వలె, తొల్కాప్పియనారు కూడ లోకజ్ఞుడు. ఆయన సూత్రాలు అందుకు ప్రబల సాక్ష్యాలు. ఎళుత్తు అదికారంలో 'కడిసొల్ ఇల్లై క్కాలత్తుప్పడినే' (452వ సూత్రం) అనే ఒక సూత్రం ఉన్నది. ఆయా కాలాలలో ప్రచారంలోకి వచ్చేమాటలను స్వీకరించ వచ్చునని దీని కర్థం. శిష్టుల వ్యవహారంలోనూ వాడుకలోనూ రచనలలోనూ కనిపించే మాటలు పరిహరించరానివి. కడిసొల్ అనగా పరిహరించరాని శబ్దములు. కనుక తొల్కాప్పియనారు శిష్టవ్యవహారానికి ప్రాధాన్యమిచ్చాడు. ఈ సూత్రాన్ని ఆధారంగా చేసుకుని నన్నూల్ లక్షణ గ్రంథకర్త 'పళైయన కళిదలుం పుదియన పుగుదలుం, వళువల కాల వగైయినానే' అనే సూత్రాన్ని రూపొందించాడు. కాలాన్ని బట్టి పాతవాటిని పరిహరించడమో కొత్తవాటిని స్వీకరించడమో దోషం కాదని యీ సూత్రానికి అర్థం చెప్పవచ్చు. వళువల అనగా దోషం కాదని అర్థం. నూల్ అంటే లక్షణ గ్రంథం. కనుక నన్నూల్ అనగా ప్రశస్త లక్షణగ్రంథమని అర్థం.

తొల్కాప్పియం నుంచి మరొక సూత్రం. ఇది పొరుళదికారం నుంచి గ్రహించబడింది. (189వ సూత్రం).

' కామం శాన్ఱ కడై క్కోట్కా లై
యేమం శాన్ఱ మక్కళొడు తువన్ఱి
అఱం పురి చుఱ్ఱమొడు కిళవనుం కిళత్తియుం
సిఱన్దదు పయిఱ్ఱల్ ఇరన్దదన్ పయనే '

ఇక్కడ కిళవన్ కిళత్తి అంటే భార్యా భర్తలని అర్థం; అంతే కాని వృద్ధుడు వృద్ధురాలని అర్థం కాదు.

భార్యా భర్తలు ధర్మబద్ధులైన బంధువులతోను, సంతానం తోను జీవితం గడిపి, ఆ తర్వాత కామమును తమ మనస్సులనుండి తొలగించుకుని గతమునకు ఫలమైన మోక్షంలో మనస్సు లగ్నం చెయ్యవలెను. ఈ సూత్రంలో జీవిత లక్ష్యం వివరించబడింది.

మాటల అర్థాలు ఎలా ఆయా కాలాలలో మారుతాయో గ్రహించేందుకు కిళవన్, కిళత్తి మంచి ఉదాహరణలు. ఈనాడు కిళవన్ అంటే వాడుకలో ఉన్న అర్థం వృద్ధుడు. కిళత్తి అంటే వృద్ధురాలు. ఇప్పుడు కిళత్తికి బదులుగా కిళవి వాడుకలో ఉన్నది. తెలుగులో కూడా ఇలా మాటల పాత అర్థాలు మరుగున పడి, కొత్త అర్థాలు ప్రచారంలోకి రావడం పరిపాటే. జ్వరం అనేమాట వాడుకలోకి వచ్చిన తర్వాత, వేంకి అనే మాట తెరమరుగుకి జారుకున్నది. కాని దక్షిణాంధ్రుల వ్యవహారంలో వేగిగా ఇది నేటికీ నిలిచి వున్నది.

తెలుగు తమిళ లాక్షణికులు తమ భాషా శబ్దాలను నాలుగు విధాలుగా వర్గీకరించడం పేర్కొనదగిన అంశం. అయితే ఆ వర్గీకరణంలో భేదం కనిపిస్తున్నది.

సంస్కృత ప్రాకృత తుల్యమైన భాష తత్సమమనీ (విద్యా - విద్య, గౌః -గోవు), సంస్కృత ప్రాకృతభవమైన భాష తత్భవమనీ (ఆకాశ: ఆకాశము, పృథివీ - పుఢవీ -పుడమి), త్రిలింగ దేశ వ్యవహార సిద్ధమైన భాష దేశ్యమనీ, లక్షణ విరుద్ధమైన భాష గ్రామ్యమనీ మన లాక్షణికులు పేర్కొన్నారు. తెలుగు సంస్కృత ప్రాకృతభవ మని ప్రాచీనులు భావిం

కనలేము కనలేము
తామరలు పూసిన తటాకము లారా
అమాయకులైన మా సోదరు లానాడు
మీకోసం కనుమూసిన విషయం
నుడువదరమా నేడు!
శ్రమజీవుల కష్టానికి, విశ్వమా
సాక్షివి నీవే గదా!
ఆకలి తీరితే ప్రాణం పోవుననే
శ్రీమంతుల నీతి సరేనా?
భయం తొలగి విజృంభిస్తారింక
యాచించరు శ్రామికు లింక
సొంత బలమున్నవారు మనెదరింక
ఈ మాటకు తిరిగు లేదింక!

సంఘంలో కానవచ్చిన అసమానతలు చూసి వ్యథా భరితుడైన గరిమెళ్ల సాంఘిక న్యాయం లోపించిన సమాజాన్ని ఘాటుగా విమర్శించడంలో ఆశ్చర్య మేమీ లేదు. ఆయన పేదవాడు కనుక, పేదవారి కష్టాలు ఆయనకి బాగా తెలుసు. ఆ రంపపు కోతను అనుభవించిన వాడు కావడం వల్ల మొగమోటమి లేకుండా -

పెద్దలకు లాభాలు బ్యాంకుల్ల నిండా
పేదలకు దుఃఖాలు హృదయాల నిండా

అనగలిగాడు ధైర్యంగా. అంతే కాదు -

భాగ్యవంతుల వైభవములంటె నాకు
బాధించు వ్రణమని బాగా తెలియండి-

అని కూడా పేర్కొన్నాడు.

భాగ్యవంతుల్ని చూసి ఆయన అసూయతో అనలేదు; కడుపుమండి అన్నాడు. ఆ కాలపు ఏకవీ యింత ఘాటుగా చెప్పలేదేమో! తాను దర్శించిన అన్యాయ కాలాన్ని ఆయన అభివర్ణించిన తీరు మరీ మరీ పరిశీలించదగింది.

'మాన్యాలు భోగాలు మనుజులందరి కబ్బ

దృక్పథంలో దిశైచ్చొల్, వడచొల్ భిన్నములు.

సంస్కృత శబ్దాలైన వడచొల్‌కళుని తత్సమ తద్భవాలుగా విభంగ డించవచ్చు. కమలం వంటివి తత్సమాలైతే, ఔడదం (ఔషధం) వంటివి తద్భవాలు. కేవలం సంస్కృత శబ్దాలకే వడచొల్ పరిమితం కాదనీ, ఉత్తరాది భాషల మాటలన్నీ వడచొల్ అవుతాయని కొందరి అభిప్రాయం. ప్రాచీన తమిళ కావ్యాలలో సంస్కృత ప్రాకృత శబ్దాలు కొన్ని కనిపించడం గమనించదగింది. కాని తెలుగు వలె, తమిళం తత్సమ తద్భవాలను అధిక సంఖ్యలో స్వీకరించలేదనడం సత్యమనక తప్పదు.

సంస్కృత శబ్దాలను తమిళులు యథాతథంగా స్వీకరించక తమ భాషకు అనుగుణంగా అనువదించుకున్నారు. అనగా, సంస్కృత శబ్దాలను స్వీకరించేటప్పుడు సంస్కృత ధ్వనులను పరిహరించి వాటికి తమిళ ధ్వనులు కల్పించారు. పురనానూరులో ఒకచోట త్రయాగ్నిని ముత్తీగా అనువదించి వాడడం జరిగింది. ఆ కృతిలోనే చతుర్వేదము లను నాన్‌మఱైగా మలచుకోవడం జరిగింది. త్రిలోచనుడు ముక్కణ్ అయినాడు. తెలుగువారు కూడా ఇటువంటి అనువాద విధానాన్ని అవ లంబించక పోలేదు. త్రిలోచనుణ్ణి ముక్కంటి అని వ్యవహరించారు. పురనానూరులో నిత్య శబ్దం నిచ్చ మయింది (నిచ్చముం ఒళుక్కం....) తెలుగువారు కూడా నిత్యను నిచ్చలుగా వ్యవహరించారు.

సంస్కృత శబ్దజాలం తెలుగులో ఎంతగా ప్రవేశించినా, తెలుగులో శుద్ధ ద్రావిడ శబ్దాలు కొన్ని నిలిచిపోయాయి. వాటిలో ఒకటి ఆవు అనే మాట. నిరక్షరాస్యులే కాక అక్షరాస్యులైన తెలుగువారు కూడా ఆవుని ఆవనే అంటారు. కాని గోవని కాని పశువని కాని అనరు. మొన్న మొన్నటి దాకా తమిళులు 'పశు' అని వాడేవారు ఆవుకి. నేడు కూడా 'పశు' శబ్దం ప్రచారంలో ఉన్నా, ఇపుడిపుడు 'ఆ' శబ్దాన్ని అధికంగా వాడుతున్నారు. ఆవిన్‌పాల్ ( అవుపాలు) నేడు బాగా ప్రచారంలోకి వచ్చింది. మలయాళంలో పశువనే మాటనే ఎక్కు వగా వాడుతారు. కన్నడంలో ఆకళ అని అంటారు.

అలాగే మరొక మాట వాన అనే అర్థం కల వాన్ శబ్దం. తిరుక్కు రళులో వాన్ సిరప్పు అని ప్రయుక్తం. వర్ష ప్రశంస అని అర్థం. వానను

తమిళులు మళై అనీ కన్నడిగులు మళె అనీ వ్యవహరిస్తారు. ఆకాశం మాత్రం తమిళంలో వానంగానే నిలిచిపోయింది. కన్నడంలోనూ ఆకాశ అంటారు. తెలుగులో వాన, వాసకాళ్ళు (వర్షధారలు) మొదలైనవి ప్రసిద్ధాలు; కాని ఆకాశమనే అర్థంలో వానమును వాడరు. ఇంకొక మాట. వచించు అనడానికి మారుగా తెలుగువారు చెప్పు అనే మాటను ఉపయోగిస్తారు. తమిళంలో చెప్పు అన్నది వ్యవహార భ్రష్టమయింది. సొల్లు అనడం వారికి పరిపాటి. కాని గ్రాంధిక తమిళంలో అవన్ చెప్పినాన్ అంటే తెలుగులోవలె అతడు చెప్పినాడనే అర్థం. చిత్ర మేమిటంటే, శ్రీలంక తమిళులు చెప్పు అన్నప్పుడు తాలవ్య చకారం ఉపయోగిస్తారు. తెలుగులో వలె, తమిళంలోను గ్రాంధిక వ్యావహారిక భాషల మధ్య భేదం కనిపిస్తుంది. ఈ భేదం నేడు చాలా వరకు తగ్గుముఖం పట్టినా, తమిళ పండితులలో పలువురు గ్రాంధికవాదులే. కొందరు రాజకీయ వాదులలో కూడా ఈ గ్రాంధిక భాషాప్రియత్వం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. తద్భిన్నులు తెలుగువారు. చివరికి విశ్వవిద్యాలయాలకు సమర్పించబడే సిద్ధాంత వ్యాసాలు కూడా వ్యావహారికంలో ఉండవచ్చు.

ఇక లిపిని గురించి రెండు మాటలు.

రెండువేల సంవత్సరాలకు పూర్వం వాడుకలో ఉన్న బ్రాహ్మీలిపియే మనదేశంలోని వివిధ భాషాలిపులకు మూలమని విద్వల్లోకం విశ్వసిస్తున్న విషయం. తెలుగు లిపి కూడా తద్భిన్నం కాదు. కాని కొందరు తమిళ పండితులు దీన్ని అంగీకరించరు. తొల్కాప్పియంలోనే తమిళ వర్ణములకు సంబంధించిన ప్రశంస ఉండడం వల్ల, తమిళం ప్రత్యేక లిపి రూపమును సంతరించుకుందని వారి అభిప్రాయం. వట్ట లిపి (వట్టెళుత్తు) అన్నది ప్రాచీన తమిళ లిపి అనీ, అదే నేటి తమిళ లిపి రూపానికి మూలమనీ వారి నమ్మకం. ప్రాచీన తమిళదేశపు శాసనాలు బ్రాహ్మీ లిపిలోనూ వట్టలిపిలోనూ ఉండడం గమనించదగిన విషయం. వట్టెళుత్తు అంటే గుండ్రని అక్షరాలని అర్థం.

తమిళ లాక్షణికులు తమ వాఙ్మయాన్ని ఇయల్, ఇశై, నాటకం అని విభజించారు. ఈ విభాగాన్ని ముత్తమిళ్ అని వ్యవహరిస్తారు. గద్యపద్యాత్మకమైన తమిళం ఇయుత్రమిళ్. అనగా సాహిత్యమునకు

సంబంధించిన తమిళమన్న మాట. లాక్షణికమైన భాష. ఇశైత్తమిళ మనగా సంగీతమునకు ప్రయుక్తమైన భాష అని అర్థం. నాటకాలలో ఉపయోగించబడే తమిళం నాటకత్తమిళమవుతుంది. తరువాతి కాలంలో కొందరు చెం(సెం)దమిళ్, కొడుం తమిళ్ అని విభజించారు. సాహిత్య భాష చెందమిళ మయితే, నిత్య వ్యవహారంలోని భాష కొడుం తమిళం.

ఇలాంటి విభజన తెలుగులో కనిపించదు. సంస్కృత ప్రాకృత తుల్య మైన భాషను తత్సమమనీ, సంస్కృత ప్రాకృతభవమైన భాష తద్భవ మనీ, త్రిలింగదేశ వ్యవహారసిద్ధమైన భాష దేశ్యమనీ, లక్షణ విరుద్ధమైన భాష గ్రామ్యమనీ మన లాక్షణికులు తెలుగుని విశ్లేషించారు.

# 2. తెలుగు తమిళ సాహిత్యాలు

ఈనాడు ఇరవైనాలుగు ద్రావిడ భాషలు వ్యవహృత మవుతున్నట్లు 1971 జనాభా లెక్కలవల్ల స్పష్టమవుతున్నది. వీటిలో తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం మొదలైనవి ప్రముఖమైనవి. ఈ నాలుగు భాష లకూ స్వతంత్ర సాహిత్యమూ లిపీ ఉన్నాయి. క్రీస్తుకు పూర్వం 11వ శతాబ్దిలో తెలుగు తమిళములు విడిపోయినట్లు పరిశోధకులు భావిస్తు న్నారు. ఆ తర్వాత కాలక్రమేణ కన్నడ మలయాళాలు విడిపోయినవి. కాగా, మూల ద్రావిడం నుంచి ప్రప్రథమంగా విడిపోయిన భాష తెలుగు అని పేర్కొనవచ్చు.

తెలుగు ద్రావిడభాషా కుటుంబానికి చెందినది కావడం వల్ల, భాషా పరంగా తెలుగు తమిళముల మధ్య సన్నిహిత సంబంధం నెలకొనడంలో ఆశ్చర్యం లేదు. చారిత్రకంగా, సాంస్కృతికంగా కూడా ఈ చుట్టరికం బలపడింది. ఈ భాషా వ్యవహర్తల మధ్య ఆశ్చర్యం గొలిపేలా ఆదాన ప్రదానాలు జరగడానికి ఈ వివిధ కారణాలు ఎంతగానో సహకరిం చాయి. నిజానికి ఏ భాష అయినా సరే, ఇచ్చి పుచ్చుకుని 'ఇంతింతై వటుడింతయై' అన్నట్లుగా పెరిగి పెద్దదవుతుంది.

భాషా విషయకంగా నెలకొన్న దగ్గరి చుట్టరికంవల్ల, తెలుగులోని దేశ్యములలో ముక్కాలు మువ్వీసం తమిళం నుంచి వచ్చినవే అని కొందరు భావించవచ్చు. అంజు (భయపడు), నాయి (కుక్క), కిట్టు (సమీపించు) మొదలైనవి నేడు వాడుక తెలుగులో వినిపించవు. కాని తెలుగు కావ్యాలలో కనిపించే ఈ మాటలు నేటికీ తమిళంలో సజీవంగా ఉన్నాయి. ఈ కారణం పురస్కరించుకుని ఈ మాటలు తమిళం నుంచి వచ్చి తెలుగులో కలిసిపోయినట్లుగా కొందరు భావించవచ్చు. అలా అయితే, నేటికీ తెలుగువారి నాలుకల మీద నిలిచిపోయిన వాన (వాన్), ఆవు (ఆ), చాల (సాల, మిక్కిలి), చెప్పు (మాట చెప్పు) మొదలైన తేట తెలుగు మాటలు తమిళుల వ్యవహారంలో లేవు. వానను తమిళులు మళై అని వ్యవహరిస్తారు. ఆవుని పశు అంటారు. ఇపుడిపుడు ఆవుని తమిళులు వాడుక చేస్తున్నారు. ఈ వివిధ శబ్దాలు

నేడు వాడుక తమిళంలో భ్రష్టములైనా, ప్రాచీన కావ్యాలలో మాత్రం కనిపిస్తూనే వున్నాయి. అందువల్ల, కావ్యాలలో కనిపిస్తూ వ్యవహారంలో భ్రష్టములైపోయిన మాటల్ని ఉమ్మడిసొత్తుగా (మూలద్రావిడ రూపాలుగా) భావించడం సమంజసం. ఏది ఆదానపదం? అని నిర్ధారించడం అనుకున్నంత సులభం కాదనడం సముచితం.

అయితే కొన్ని మాటల విషయంలో ఖచ్చితంగా ఇవి ఆదాన పదాలే అనవచ్చు. ఈక్రింది తమిళ శబ్దాలు తెలుగు కావ్యాలలో ఎలా కలిసి పోయినవో పరికించండి.

అంగయ కన్య
అంగయ కన్యాంబ మీనాక్షి (తమిళం. అంగయర్ కణ్ణి - అందమైన చేప కనులు కలది)
అంగయ కణ్ణెమ్మ

అరువత్తురు ముప్వురు : అరవై ముగ్గురు (త. అరువత్తు మూవర్)

తిరునీరు : విభూతి (త. తిరునీర్)

ఉణ్ణాముల : పార్వతి (త. ఉణ్ణాములై - అపీత కుచాంబ)

అలమేల్మంగ
అలమేల్మంగ తాయి: పద్మావతి (త.అలర్మేల్ మంగై)
అలమేలు మంగ
అలర్మేలు మంగ

చూడి కుడుత: ఆముక్తమాల్యద, ఆండాళ్
చూడి కుడుతనాచారి: (త. చూడి కొడుత్త నాచ్చియార్. నాచియార్ తెలుగులో నాచారి నాంచారిగా మార్పు చెందింది.)
కోయిల: గుడి (త. కోయిల్; కోవిల్)
కోవెల

తిరుబోనము : పవిత్రమైన అన్నము (తమిళ శబ్దమైన తిరు (శ్రీ)ని నేటికీ తెలుగు వైష్ణవులు తరచుగా ఉపయోగిస్తారు. తిరుమణి;

తిరుచూర్ణం, తిరుకాపు మొదలైన ఎన్నో శబ్దాలను ఉదాహరించవచ్చు.

తిరుకొలను : పుష్కరిణి (త. తిరుక్కుళం)

తిరువడి

తిరువడి ఘళు : హనుమంతుడు, శ్రీపాదములు.

వేష్టువ : ధోవతి (త. వేష్టి)

తిరువారాధన : స్వామి వారిని పూజించుట, (తిరువయోధ్య, తిరువరంగం వంటి ప్రయోగాలు తమిళ వైష్ణవ సాహిత్యంలో కొల్లలు. మతప్రభావం వల్ల తిరుశబ్దం తెలుగులో కలిసిమెలసి పోయిందనడం నిర్వివాదం)

పిత్తడి : ఇత్తడి (త. పిత్తళై) దక్షిణాది తెలుగువారి వ్యవహారంలో మోసం, వంచన అనే మాటలకు పర్యాయపదాలుగా పితలాటం, పితలాటకం అని వినవస్తాయి. తమిళులు పిత్తలాట్టం అని వ్యవహరిస్తారు. ఈ మాటకు ఇత్తడికి బంగారపు రంగువేసి చేసే మోసం అని అర్థం (పిత్తళై + హాటకం)

నడునడ
నడుంగు : భయంతో వణుకు (త. నడునడుంగు)

తన్నీరు : నీళ్ళు (త. తణ్ణీర్)

తెలుగు తమిళ శబ్దాలు గ్రహించినట్లుగానే, తమిళం కూడా తెలుగు మాటలు కొన్నిటిని తనలో లీనం చేసుకుంది. చివరికి వ్యావహారిక తమిళంలోనూ తెలుగు చోటు చేసుకుంది. మదరాసు విశ్వవిద్యాలయంవారు ప్రకటించిన తమిళ బృహన్నిఘంటువులో (Tamil Lexicon) తెలుగు నుంచి 488 మాటలు తమిళంలో ప్రవేశించినట్లుగా తెలువబడింది. కాని అవి 450 తెలుగు మాటలని ఒక పరిశోధకుని అభిప్రాయం. ఏ యితర ద్రావిడ భాష నుంచి కూడా తమిళం ఇన్ని మాటలు స్వీకరించకపోవడం పేర్కొనదగిన అంశం.

తమిళ కావ్యాలలో తెలుగు మాటలకు స్థానం కల్పించిన మహా కవులలో తొలుత కంబ కవిచక్రవర్తి సంభావ్యుడు. ఆయన క్రీస్తుశకం 9వ శతాబ్దికి చెందినవాడని కొందరూ, 11వ శతాబ్దికి చెందినవాడని మరి

కొందరూ భావిస్తున్నారు. ఆయన తమ్మి, అక్కలు మొదలైన తెలుగు మాటలు ఉపయోగించాడు. తిరుప్పుగళ్, విరలి విడుతూదు మొదలైన కృతులలో కూడా తెలుగు మాటలు కనిపిస్తున్నాయి.

ఇక నేటికీ తమిళులు తమ నిత్య వ్యవహారంలో ఉపయోగించే కొన్ని తెలుగు మాటల్ని పరిశీలిద్దాము.

సంగతి

కొంజం (కొంచెం) - కొంజమా నంజమా

కోమట్టి (కోమటి)

కోసరం (కోసం)

నయ్‌నా (నాయన - నాయుడు కులస్థుల్ని నయ్‌నా అని సంబోధిస్తారు)

సిన్న (చిన్న)

ఉప్పాసం (ఉబ్బసం)

సోమారి (సోమరి)

మాదిరి

సొగసు (సొగసు)

తప్పు తంటా

బొమ్మలాట్టం (బొమ్మలాట)

ఎచ్చరిక (ఎచ్చరిక్కై)

తెలుగు ద్రావిడ భాష అయినా, తెలుగు సాహిత్యం సంస్కృత సాహిత్యం అడుగుజాడలలో పయనించి సుసంపన్నమైన విషయం పండితులకు తెలిసిందే. అనగా, భాషాపరంగా తెలుగు తమిళమునకూ సాహిత్యపరంగా సంస్కృతానికీ సన్నిహితమయిందని చెప్పవచ్చు. అయినప్పటికీ, సాహిత్యపరంగా కూడా తెలుగు తమిళములు ఇచ్చిపుచ్చుకోవడం జరిగింది.

నన్నయ, నన్నెచోడుడు మొదలైన ప్రాచీనాంధ్ర కవుల రచనలలో కొన్ని తమిళ సాహిత్య సంప్రదాయాలు కానవస్తాయి. ప్రాచీన పాండ్య భూపతుల కాలంలో సంగం అనబడే పండిత పరిషత్తులు ఉండేవి. అటువంటి పరిషత్తులు చాళుక్య నృపుల కాలంలో తెలుగు నాడులో వెలుగు చూసి ఉండవచ్చు. వాటిని ఆదికవి నన్నయ సత్సభలని ప్రశంసించాడు. (శ్రీమదాంధ్ర మహాభారతం - ఆదిపర్వం, ప్రథమాశ్వాసం

24వ పద్యం)

తెలుగువారు సాధారణంగా చెప్పుకునే గణపతి జన్మ వృత్తాంతానికి భిన్నమైన వృత్తాంతాన్ని నన్నెచోడుడు తన కుమారసంభవంలో తెలియజేశాడు. మత్తగజాల జలక్రీడను తిలకించి కామవివశులైన శివపార్వతులు గజరూపం ధరించారనీ, వాళ్ళకు ప్రభవించినవాడే గజాననుడనీ శైవుల పారాయణ గ్రంథమైన తేవారంలో అభివర్ణించబడింది. ఈ వృత్తాంతాన్ని నిశ్శంక కొమ్మన కూడా స్వీకరించాడు. తమిళ శివభక్తులైన అరవై ముగ్గురు నాయన్మారుల కథల్ని తెలుగు వారికి తొలిసారిగా పరిచయం చేసినవాడు పాల్కురికి సోమనాథుడు. అలాగే ప్రముఖ తమిళ విద్వాంసుడైన నక్కీరుని కథను తెలుగు వారికి తెలియజేసినవాడు మహాకవి ధూర్జటి.

దక్షిణ భారతంలో క్రీస్తుశకం 5-9 శతాబ్దుల మధ్యకాలంలో హిందూ మత పునరుద్ధరణ జరిగింది. తత్ఫలితంగా భక్తుద్యమం ప్రచారంలోకి వచ్చింది. ఆ మహోద్యమం ధైర్యంగా కుల నిరసన చేసింది. కులం కంటే గుణమే ప్రధానమనే విషయాన్ని ఉద్బోధించింది. ఏ కులస్థుడైనా సరే అతను కనుక భక్తుడైతే, అతను పూజనీయుడనే ఉదాత్త భావం సంఘంలో నెలకొన్నది. ఆ భక్తులలో వివిధ వర్ణాల వారూ ఉన్నారు. అంత్య కులజులూ ఉన్నారు. తిరునావుక్కరశర్ కాలంలో జీవించిన అప్పూది అడిగళ్ అనే బ్రాహ్మణుడు తిరునావుక్కరసు పేరునే మంత్రంగా భావించి ఆ నామాన్ని సదా ఉచ్చరిస్తూ వుండేవాడు. తన సంతానానికి కూడా ఆ పేరే పెట్టుకున్నాడు. తిరునావుక్కరశర్ బ్రాహ్మణేతరుడే (వేళాళర్) అయినా, ఆయన్ని దైవంగా భావించి బ్రాహ్మణుడైన అప్పూది కొలిచాడు. కులభేదాలు విస్మరించారనడానికి ఇది నిదర్శనం. అంతేకాదు. ఈ ఉద్యమ ఫలితంగా తమిళ భక్తులకూ తెలుగు భక్తులకూ నడుమ సన్నిహిత సంబంధం నెలకొన్నది. తమిళ శివభక్తులు తెలుగునాడులోని ప్రసిద్ధ శైవక్షేత్రాలు సందర్శించి తమ భాషలో రసగుళికల వంటి గీతాలు వెలయించారు. భక్తుల కథలు ప్రీతిపాత్రము లైనాయి, ఆదర్శము లైనాయి. ఇందుకు నిదర్శనంగా ఈక్రింది పద్యాన్ని ఉదాహరించవచ్చు.

అరయగ పిన్ననాడు సిరి
యాళుడనై, యెల్లభాయ మందు సుం
దరుడను నంబినై, పదను
దప్పిన గుండయ గారి చందమై
ధర చరియింప గల్గిన త
ధాస్తు, వృధా పరిపాక దు
ష్కర జననం బిదేమిటికి
కాలువనే శివదేవ ధీమణీ!

ఈ పద్యంలో ఉదాహృతులైన సిరియాళుడు, సుందరమూర్తి, గుండయ్య ( తిరునీలకంఠ నాయనారు) మొదలైనవారు మహా భక్తులుగా పేరు పెంపులు గడించారు. ఈ తమిళ భక్తులు తెలుగు శతక కవికి ఆరాధ్యులైనారు. కులం, ప్రాంతం, భాష - మొదలైన వాటికి అతీతంగా ఆనాటి భక్తుద్యమం సాగిందనడం సత్య సన్నిహితం. శివ భక్తులకు సంబంధించినంతవరకూ ఈ ఉద్యమం జాతీయ సమైక్యాన్ని సాధించిందనవచ్చు.

శైవ సమయాచార్యులలో ఒకడైన సుందరమూర్తి నాయనారు 8వ శతాబ్దిలో జీవించాడు. ఆయన శ్రీశైలం సందర్శించి, ఆ పర్వత రామణీయకానికి ముగ్ధుడై ఒక దశకం (పదిగం) వెలయించాడు. తద్వారా ఆయన భగవన్నుతి చేసినట్లు భావించబడుతున్నది. ఆయన చేసిన శ్రీశైలవర్ణన ఇలా సాగింది.

కలసి తిరిగి, మేసి, సెలయూటలో త్రాగి,
దురద పోవ చెట్ల నొరసి, తరువు
జేరి నిద్రవోవు జింకలు నెమళుల
కాలవాలమైన శైల మిద్ది !

కొండ చరియలందు దండిగా పెరిగిన
కానల తిరిగి, ఒకదాని నొకటి
పిలుచుకొని ముదమున కలియు గజములకు
ఆలవాలమైన శైల మిద్ది !

'పొలము కాయుచున్న పొలతి నే నుండగా
పడుచు చిలుక తినగ వచ్చె' నంచు
విసిరివేసె రాయి. బెదిరిన చిలుకల
కాలవాలమైన శైల మిద్ది !

పొలమున బడి తినెడు చిలుకల తరుమంగ
చెంత నున్న మణిని చెలి విసెరెను.
పై కెగురుచు పోయి పాడెడు చిలుకల
కాలవాలమైన శైల మిద్ది !

తల్లి చుట్టు తిరుగు పిల్ల యేనుగులకు
అప్పుట మగు తేనె నాకులందు
పోసి అందజేయు బోయ సంఘమునకు
ఆలవాలమైన శైల మిద్ది !

వేరొక కరితోడ విహరింప పాడియే?
అన్న కుపిత గజము ననునయించె
ఆడయేన్గు. మదగజమ్ముల గుంపుల
కాలవాలమైన శైల మిద్ది !

'అపుడు తరుమలేదు, ఇపుడు తరుమకున్న
కోపగింతురు నను కులము వా' ర
టంచు చిలుకల నదలించు జవ్వనులకు
ఆలవాలమైన శైల మిద్ది !

త్రిపురదహను నెవరు తెలియంగ జాలరు
జుంటి తేనెల తెగ జుర్రుకొనుచు
కడు ముదమున తిరుగు గజ సమూహమునకు
ఆలవాలమైన శైల మిద్ది !

త్రవ్వగ, వెలువడిన రత్నాలు చూచి సం
భ్రమము చెందు అడవిపందులు మొద
లైన జంతుతతికి, అందాల తోటల
కాలవాలమైన శైల మిద్ది !

సెలికే, సజ్జనాళి కెరవైన తిరునావ
లూరు సుందరుడను. నే రచించి
నట్టి యీ దశకము నందలి భావమ్ము
తెలిసికొనగ మంచి కలుగుగాదె !

శివ పారమ్యాన్ని తమిళసాహిత్య సంప్రదాయాలను యథోచితంగా తెలియజేస్తూ ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యం సంతరించాడు. తమిళ శబ్దాలను వాడడమే కాక భక్తుడూ కవీ అయిన నక్కీరుని కథను రమ్యాతి రమ్యంగా ఆయన తెలియజేశాడు. నక్కీరు డనడానికి బదులు నత్కీరుడని వ్యవహరించాడు. తిరువణ్ణామలై ఆలయంలో వేంచేసివున్న అపీత కుచాంబను తమిళులు భక్తి పూర్వకంగా వ్యవహరించే విధంగా ఉణ్ణాముల అని వ్యవహరించాడు. తెలుగు వారి దృష్టిలో దారేషణ, ధనేషణ, పుత్రేషణ మొదలైనవి ఈషణత్రయం. ఇవి పరిహరించదగినవి. తమిళుల దృష్టిలో మణ్ణాసై (పుడమి మీది ఆశ), పొన్నాసై (బంగారం మీది ఆశ), పెణ్ణాసై (పడతి మీది ఆశ) ఈషణత్రయం. తమిళుల యీసంప్రదాయాన్నే వివరించి ధూర్జటి కథా కథనంలో ఔచిత్యం పాటించాడు. తమిళంలోని కాళహస్తి మాహాత్మ్యం సంప్రతించి ధూర్జటి కావ్య నిర్మాణం చేసి ఉండవచ్చునని నా అభిప్రాయం. కథాగౌరవాన్ని ఇనుమడింపజేస్తున్న యీ క్రింది పద్యం సంభావ్యం.

'ఉణ్ణాముల జగదంబిక
నణ్ణామల విశ్వనాథు నారాధించెన్
మణ్ణాసయు బొన్నాసయు
బెణ్ణాసయు లేనివారి పెన్నిధు లగుటన్'

ఇందులోని ఉణ్ణాముల, అణ్ణామల, మణ్ణాస, పొన్నాస, పెణ్ణాస శబ్దాలు తమిళ శబ్దాలే. తెలుగు నుడికారం అనుసరించి ధూర్జటి తమిళంలోని ఐకారాంత శబ్దాలను అకారాంతములుగా ప్రయోగించడం గమనించదగింది. ఆవిధంగా ఆ భక్తకవి తెలుగు, తమిళ సంప్రదాయాలను పాటించాడు. కనుకనే ముళై ముల అయింది. మలై మలగా మారింది.

కొన్ని తెలుగు మాటలను ఉపయోగించడమే కాక, ఉత్తమ కవిత

గోదావరి నది ప్రవాహంలా ఉండాలని కంబకవి ఆశించాడు. ఆ మహా కవి ఓరుగల్లు పరిపాలించిన మొదటి ప్రతాపరుద్రుని ఆస్థానం సందర్శించి ఆ కాకతి నృపునిపై ఒక పద్యం చెప్పినట్లు ప్రతీతి. ఇలా తెలుగువారంటే కంబకవికి ఆదరభావం ఏర్పడినా, ఆయన రచించిన రామాయణం తెలుగు విద్వత్కవుల్ని ప్రభావితుల్ని చేసినట్లు కనిపించదు. కాని తెలుగు జానపద కవులు ఒకటి రెండు కథా ఘట్టాలలో తమిళ కవిని అనుసరించినట్లు కనిపిస్తున్నది.

వాల్మీకాన్ని అనుసరించినా, తెలుగు విద్వత్కవుల వలె కంబడు కూడా కొన్ని అవాల్మీకాంశాలు తెలియజేశాడు. వాటిలో ఒకటి సీతాప హరణ వృత్తాంతం. వాల్మీకంలోని రావణుడు తన చేతులతో సీతను అపహరించుకుని లంకకు వెడలిపోగా, కంబ రామాయణంలోని రావణుడు పూర్వశాపం స్ఫురణకు వచ్చి సీత నివసిస్తున్న పర్ణశాలనే పెకలించి దాన్ని తన రథంలో ఉంచుకుని లంకకు ప్రయాణ మయ్యాడు. ఈ సందర్భంలో వాల్మీకిని తెలుగు విద్వత్కవులు అనుసరించగా, తెలుగు జానపదకవులు మాత్రం తమిళ కవిని అనుసరించారు. ఇది జానపదుల విశ్వాసమో యేమో!

సంక్షేమ రామాయణకర్త సీతాపహరణాన్ని ఇలా అభివర్ణించాడు.

'భూమిపై నున్నట్టి భూపుత్రి జూచి
గడ్డ పెల్లాగించి రథముపై బెట్టి
వగదీరెనని తలచి గగనమున కెగిరి.'

లంకా సారధి గేయం ఈ విషయాన్ని అభివర్ణించిన తీరు పరికించండి:

'అమరు లందరు బెదర అవుడు
శూలము నాటి ఆ భూమి పెల్లగించెన్
గడ్డతో నెత్తుకొని గగనంబు
కెనసియు ఘన రథము మీద నునిచియు...... '

పతివ్రతా తిలకమైన సీతను రావణుడు తన చేతులతో తాకకుండా అపహరించాడన్న అంశం జానపదకవుల కల్పనమో కంబకవి కల్పనమో చెప్పలేము. కాని ఒక్క విషయం మాత్రం స్పష్టం. ఈ అవాల్మీ

కాంశం ఏ భాషలోనూ పండిత కవుల రామాయణాలలో లేకపోవడం వల్లనూ, కవిచక్రవర్తి బిరుదాంకితుడైన ఒక్క కంబమహాకవి రామాయణంలో మాత్రమే ఉండడం వల్లనూ, కథాగౌరవాన్ని ఆనాటి ప్రజల విశ్వాసాన్నీ మన్నించి ఆ మహాకవి యీ అంశాన్ని గ్రంథస్థం చేసినట్లు భావించటంలో విప్రతిపత్తి లేదు.

వైష్ణవ భక్తకవులైన ఆళ్వార్లు కూడ కుల నిరసన కావించిన వారే. ఆళ్వారులలో నిమ్నజాతికి చెందినవారు ఉన్నారు. వారు వెలయించిన భక్తిగీతాలు నేటికీ వైష్ణవ సంప్రదాయజ్ఞులకు శిరోధార్యాలే. ఆళ్వారుల ప్రభావం అన్నమాచార్యాది మహనీయులపై కనిపించడంలో వింత యేమీ లేదు. ఆళ్వారుల భక్తిగీతాలలో పలుచోట్ల త్రివిక్రముని ప్రశంస కనిపిస్తుంది.అన్నమాచార్యుల సంకీర్తనలలో సైతం త్రివిక్రముని ప్రశంస కానవస్తుంది.

పన్నిద్దరాళ్వారులలో ఒకరు ఆండాళ్. తెలుగువారికి ఆ భక్తకవయిత్రి గోదాదేవిగా సుపరిచితురాలు. ఆమె తిరుప్పావైలో 'ఓంగి ఉలగళన్ద ఉత్తమన్ పేర్ పాడి' అనీ, 'అన్ఱివ్వులగ మళన్దాయ్ అడి పోట్రి' అని త్రివిక్రముణ్ణి భక్తిపూర్వకంగా ప్రశంసించింది. అలాగే నమ్మాళ్వారు ప్రభృతులు కూడా త్రివిక్రమ ప్రశంస చేశారు. తమ గీతాలలో బ్రహ్మ కడిగిన పాదము అనే ఎత్తుగడ కలిగిన ప్రసిద్ధ సంకీర్తనలో అన్నమాచార్యులు 'చెలగి వసుధ గొలిచిన నీ పాదము' అని పేర్కొన్నాడు. ఓంగి ఉలగళన్దకు చక్కని తెలుగుసేత చెలగి వసుధ గొలిచిన అన్నది. ఈరెండు పాదాలలోను ఎత్తుగడ ఒకేవిధంగా ఉండడం గమనించదగిన అంశం.

వైష్ణవ కవుల దృష్టిలో విష్ణు సహస్ర నామావళికి గల ప్రాధాన్యం ఇంతా అంతా కాదు. ఆయిరనామం సొల్లి మంగళం పాడుదామని పెరియాళ్వారు (విష్ణుచిత్తుడు) పేర్కొనగా, వేనామాల వెన్నుండా వినుతించ నెంతవాడ అని పేర్కొన్నాడు అన్నమయ్య.

తెలుగులో వైష్ణవ వాఙ్మయాన్ని పరిపుష్టం చేసిన ఖ్యాతి తాళ్ళపాకం కవులకు చెందుతుంది. పరమయోగి విలాసం వంటి రసవద్రచన చేసి పన్నిద్దరాళ్వారుల భక్తి ప్రపత్తుల్ని, నాథముని యామునా చార్యుడు

మొదలైన మహనీయుల వృత్తాంతాలను తెలుగువారికి చిన్నన్న నామాంతరంకల తాళ్లపాక తిరువేంగళనాథుడు తెలియజేశాడు. 'పనుపడ ద్రవిడ ప్రబంధంబు జూచి తెనుగున రచియింపు' మని వేంకటేశ్వరుడు తనను ఆజ్ఞాపించినట్లుగా ఆయన కావ్యావతారికలో పేర్కొన్నాడు. ద్రవిడ ప్రబంధమంటే ద్రావిడ వేద విఖ్యాతిని ఆర్జించిన నాలాయిర దివ్యప్రబంధం. నాలాయిర ప్రబంధం వైష్ణవులకు, తెలుగువారైనా సరే తమిళులైనా సరే, పారాయణ గ్రంథం. స్వామివారి ఆజ్ఞానుసారం చిన్నన్న ఈ గ్రంథం సంప్రదించాడు. కొన్ని భాగాలనైతే మధుర మోహనంగా తెలిగించాడు కూడా. ఆ మహాకవి ద్రావిడవేదాన్ని పూర్తిగా తెనిగించి ఉంటే ఎంత బాగుండేది! అనిపిస్తుంది, పరమయోగి విలాసం పఠించేకొద్దీ.

ఆళ్వారులలో రెండవవాడైన భూతత్తాళ్వారు రచించిన యీ సుప్రసిద్ధ గీత ఆపాతమధురం.

'అన్బే తగళియా, ఆర్వమే నెయ్యాగ
ఇన్బురుగు సిన్తైయిడు తిరియా నన్బురిగి
జ్ఞానచ్చుడర్ విళక్కేట్రినేన్ నారణర్కు
జ్ఞానత్తమిళ్ పురిన్దనాన్.'

చిన్నన్న చేసిన చెన్నైన తెలుగుసేత యిలా సాగింది.

'................ ప్రేమ
వంతియ, మితిలేని భక్తియే చమురు,
నానంద భరిత హృదబ్జంబె వత్తి
గా నొనరించి, వికాసమై యాత్మ
దిరమొందు జ్ఞానంబు దీపంబు జేసి
వెరిమె నారాయణార్పితము గావించె!

తొండరడిప్పొడి ఆళ్వారు (భక్తాంఘ్రిరేణువు) వెలయించిన ప్రాబోధకీ స్తుతిలో (తిరుప్పళ్లి ఎళుచ్చి) ప్రతి పాశురం చివరా 'అరంగత్తమ్మా! పళ్లి ఎళుందరుళాయే' - అని ఉంటుంది. రంగనాథా! నిదుర లేచి కరుణ జూడుమా అని దీన్ని అనువదించవచ్చు. నిజానికి అది మామూలు నిద్ర కాదు, యోగనిద్ర. ఆ భావాన్ని చిన్నన్న తెలియజేసిన తీరు హృద్యం.

'పాలించి కరుణ జొప్పడ యోగనిద్ర
జాలించి శ్రీరంగశాయి! మేల్కనవె!'

మూలగతమైన సౌందర్యాన్ని ఆస్వాదించేందుకు తోడ్పడే రసానువాదం వెలయించిన చిన్నన్న ధన్యుడు! ఈ కోవకు చెందిన ఉత్తమానువాదాల వల్లనే రెండు భాషలు వ్యవహరించే వారి మధ్య సుహృద్భావపూర్వకమైన అనుబంధం ఏర్పడుతుంది.

తెలుగు తమిళ సాహిత్యాల మధ్యగల సంబంధాన్ని దృఢతరం చేసిన ప్రతిభాగరీయుస్కుడు శ్రీ కృష్ణదేవరాయలు. విశిష్టాద్వైత సిద్ధాంతాల వైశిష్ట్యాన్ని తెలుగువారికి ఆముక్తమాల్యద ద్వారా తెలియజేసిన కవిరాజు ఆయన. తాను తొలుత పూలమాల ధరించి పిమ్మట దానిని స్వామికి సమర్పించిన ఆండాళ్ (గోదాదేవి) దివ్యకథను తెలుగువారికి తొలిసారిగా తెలియజేశాడు, ఈ ప్రౌఢకావ్యం ద్వారా. ఆండాళ్ పన్నిద్దరాళ్వారులలో ఒకరైనప్పటికీ, తమిళంలో కవయిత్రి అయినప్పటికీ ఆమె కథను చిత్రించే కావ్యం ఆరోజుల్లో తమిళంలో వెలువడలేదు. ఈ విశిష్ట గౌరవం రాయల వారివల్ల తెలుగుభాషకు లభించింది. అంతేకాదు. రాయలు జన్మతః కన్నడిగుడని కొందరు చరిత్రకారుల అభిప్రాయం. ఆ కన్నడ రాయుడు తెలుగుభాషలో తమిళ కవయిత్రి రమణీయ కథను చిత్రించి భావ సమైక్యానికి బంగారు బాట వేశాడు. ఆముక్తమాల్యదలో నాలాయిర దివ్యప్రబంధ ప్రశంస తరుచుగా కనిపిస్తుంది. తెలుగుని ఆదరించినంతగా రాయలవారు ఇతర భాషలను ఆదరించలేదనవచ్చు.

ఆండాళ్ కథ ఎంతగా అలరించిందో, తెలుగువారిని అంత కంటె ఎక్కువగా ఆకర్షించిన కమనీయ కథ విప్రనారాయణుని వృత్తాంతం. సారంగు తమ్మయ్య, చెదలవాడ మల్లయ్య ప్రభృతులు కావ్య యక్షగానాది వివిధ ప్రక్రియలలో విప్రనారాయణుని కథను సహృదయ రంజకంగా రచించారు. తత్ఫలితంగా నేటికీ ఆ ఆళ్వారుని తెలుగువారు స్మరిస్తూనే వున్నారు. సంప్రదాయజ్ఞులైన తెలుగువారు తెలుగులిపిలో తమిళ నాలాయిర దివ్యప్రబంధాన్ని ఈనాటికీ భక్తి ప్రపత్తులతో పఠించడం గమనించదగిన అంశం.

ఇక తమిళ సాహిత్యంలో చోటు చేసుకున్న తెలుగు రచనలు పరిశీ

లిద్దాము.

చోళరాజులు పరిపాలించిన రోజుల్లో తమిళులు తెలుగు దేశానికి రాకపోకలు సాగించారు. భక్త్యుద్యమం వల్ల తమిళ భక్తులు తెలుగుదేశంలోని ఆలయాలు సందర్శించారు. ఈ కారణాలవల్ల తమిళ కుటుంబాలు తెలుగునాడులో స్థిరనివాసాలు ఏర్పరచుకున్నాయి. నేటికీ తెలుగుదేశంలో వివిధ ప్రాంతాలలో ద్రావిడ బ్రాహ్మణులు ఎంద రెందరో కనిపిస్తారు. ఆరామ ద్రావిడులు, కోనసీమ ద్రావిడులు, పుదూరు ద్రావిడులు మొదలైనవారు ఈ ద్రావిడ బ్రాహ్మణ కుటుంబాలకు చెందినవారు. ఈ ద్రావిడ బ్రాహ్మణులలో పలువురు తెలుగు భాషా సాహిత్యాలకు ఎనలేని సేవ చేశారు, చేస్తున్నారు. ఈనాడు వారు తెలుగువారుగానే పరిగణించబడుతున్నారు.

అలాగే, విజయనగర సార్వభౌముల కాలంలో, ముఖ్యంగా శ్రీ కృష్ణదేవరాయల వారి కాలంలో, భిన్న కులాలవారు భిన్న వృత్తులవారు తెలుగుదేశం నుంచి తరలివెళ్ళి తమిళనాడులో వివిధ ప్రాంతాలలో స్థిరనివాసాలు ఏర్పరచుకున్నారు. వారిలో పండితులు, కవులు, గాయనీ గాయకులు, సేనాపతులు, నట్టువరాండ్రు - ఎందరో ఉన్నారు. వారి సంతతి వారే యీనాటి దక్షిణాంధ్రులు. మధుర, తంజావూరు, పుదుక్కోట (కొత్తకోట), రామనాథపురం, తిరునెల్వేలి మొదలైన ప్రాంతాలలో కర్షక కుటుంబాలకు చెందిన నాయుళ్లు రెడ్లు ఎందరో తరతరాలుగా నివసిస్తున్నారు. అలాగే తెలుగు బ్రాహ్మణులూ ఎంద రెందరో కనిపిస్తారు. అనగా వీరు క్రీస్తుశకం 15,16,17 శతాబ్దులలో తమిళనాడుకు వచ్చిన తెలుగు వీరయోధుల సంతతివారన్నమాట! కనుకనే నేటి తమిళనాడులో తమిళమునకు తర్వాత తెలుగు మాట్లాడే వారిదే పైచేయి.

తొలుత విజయనగర సమ్రాట్టుల సామంతులుగాను ఆ తర్వాత స్వతంత్రులుగాను తెలుగు నాయక రాజులు మధుర, తంజావూరు మొదలైన ప్రాంతాలలో దొరతనం సాగించారు. వారి కాలంలో తెలుగు కవితకు తమిళనాడులో పెక్కుచోట్ల పెళ్ళి పందిళ్లు వెలిశాయి. తెలుగు పాలకుల భాష కావడంతో, తమిళులు కూడా పలువురు తెలుగుభాష నేర్చుకున్నారు. అలా తెలుగు నేర్చిన వారిలో కొందరు రచనలు

చేసి తెలుగు సాహిత్యంలో స్థానం సంపాదించుకున్నారు. సుబ్బరామ దీక్షితులు, టి.యస్.మురుగేశం పిళ్లై, ఆర్కాటు త్యాగరాజ మొదలి ప్రభృతులు ఈకోవకు చెందినవారే. తెలుగులో కీర్తనలు వెలయించిన తమిళ వాగ్గేయకారులు ఎందరో ఉన్నారు. నాయకరాజులకు తర్వాత తంజావూరు నేలిన మహారాష్ట్రులుకూడా తెలుగుభాషాభ్యసనం చెయ్యడమే కాక తెలుగులో రచనలు వెలయించడం తెలుగు పండితుల్ని పోషించడం మొదలైన అంశాలు గమనించదగినవి. ఈ వివిధ విషయాలు పరిశీలిస్తే, ఆనాటి తెలుగువారు తమిళనాడులో సాధించిన సాంస్కృతిక విజయం మహత్తరమయిందని వ్యక్త మవుతుంది.

తమిళంలో 11వ శతాబ్దిలో యాప్పరుంగలక్కారిగై అనే ప్రశస్త ఛందో గ్రంథం వెలుగులోకి వచ్చింది. ఇది జైనకవి కర్తృకం. దీనికి గుణసాగరుడు అనే జైన రచయిత ఒక వ్యాఖ్యానం వ్రాశాడు. యాప్ప రుంగలం వెలువడక పూర్వమే తెలుగు కన్నడ భాషలలో వడుగుచ్ఛందం (ఆంధ్రచ్ఛందం), గుణకాంకియం అనే ఛందోగ్రంథాలు వెలువడినట్లు గుణ సాగరుడు పేర్కొన్నాడు. వాంచియార్ అనే జైనుడు వడుగుచ్ఛందం వ్రాసినట్లు విజ్ఞులు భావిస్తున్నారు. కాగా తమిళ యాప్పరుంగలం కర్త ఈ తెలుగు ఛందో గ్రంథం సంప్రదించి వుండవచ్చునని భావిం చడంలో తప్పు లేదు. కాని తెలుగులో వెలువడిన జైనవాఙ్మయం ప్రస్తుతం అలభ్యం కనుక, ఈ విషయమై ఇదమిత్థమని చెప్పలేము.

తమిళంలో బసవ పురాణం 14వ శతాబ్దిలో వెలువడింది. పద్య కృతి అయిన దీనికి పాల్కురికి సోమనాథుని బసవపురాణం మాతృక. కన్నడ బసవ పురాణానికి కూడ తెలుగు బసవ పురాణమే మాతృకగా భావించబడుతున్నది.

రామరాజ భూషణుని రసవత్కావ్యమైన వసుచరిత్రకు తమిళంలో అదే పేరున ఒక కమనీయ కావ్యం వెలిసింది. తమిళ వసుచరిత్రం 16వ శతాబ్ది చివరి భాగంలో గాని 17వ శతాబ్ది ప్రథమభాగంలో గాని వెలిసినట్లు చెప్పవచ్చు. దీనికర్త తొండై మాన్దురై అంబలత్తాడుం అయ్యన్. నమశ్శివాయ దేవుడు, బాలయ్య దేవుడు అనే యిద్దరు మిత్రులు తెలుగు వసుచరిత్రను వివరించగా, తాను వారి సహాయంతో తమిళంలో

ఆ కావ్యం వెలయించినట్లు అంబలత్తాడుం అయ్యన్ పేర్కొన్నాడు. తెలుగు కావ్యంలోని కమనీయ శ్లేషను తమిళంలోకి తీసుకురావడానికి తమిళ కవి యధాశక్తిని ప్రయత్నించాడు కాని తీసుకురావడం సులభం కాదు. వెలగపూడి కృష్ణయామాత్యుడు వ్రాసిన భానుమద్విజయం, పరమానందయతి రచించిన వేదాంత వార్తికం మొదలైనవి తమిళం చేయబడిన తెలుగు కృతులలో పేర్కొనదగినవి.

సంగీత సాహిత్య మర్మజ్ఞుడైన సుబ్బరామదీక్షితులు కవిత్రయం వారి (నన్నయ, తిక్కన, ఎర్రనలు) మహా భారతాన్ని తమిళం చేసి అచ్చు వేశాడు. ఈ ద్రవిడానువాదం తిరునెల్వేలి జిల్లాలోని ఎట్టయాపుర సంస్థానాధీశులూ, హూణాంధ్ర ద్రవిడ భాషావిశారదులూ అయిన జగదీశ్వరరామ కుమార ఎట్టప్ప మహారాజుగారి ప్రోత్సాహంవల్ల వెలువడింది. ఆ మహారాజే ప్రచురణకర్త కూడా! కాని యీ మహాభారతానువాదాన్ని ఇంతవరకు చూడలేకపోయాను.

ఆరోజుల్లో ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్ర ప్రసిద్ధ గ్రంథం. దాన్ని పణయూరు వెంకు ముదలియారు తమిళం చేశారు.

తెలుగు శతకాలు కూడా తమిళ పాఠకుల్ని ఆకర్షించాయి. ముఖ్యంగా సుమతి, వేమన శతకాలు తమిళనాడులో ప్రచారం గడించాయి. సీతారామ ప్రసాద్ (1892), పుదువై నారాయణ దాసర్ (1903) ప్రభృతులు వేమన పద్యాలు కొన్నిటిని తమిళం చేశారు తెలుగు పద్యాలకు తమిళ లిప్యంతరం సమకూర్చారు. అలాగే 1904లో ఎళుమూర్ సమరపురి ముదలియారు సుమతి శతకాన్ని తమిళం చేశారు. తమిళ లిపిలో తెలుగుపద్యాన్ని మొదట ఉదాహరించి, తర్వాత తమిళ వచనంలో అనువాదం ఇవ్వబడింది. ప్రస్తుతం ఈ అనువాదాలు అలభ్యాలు. కనుక కొత్త తమిళ సేతలు వెలువడవలసిన అవసరం ఉన్నది.

తెలుగువారినీ తమిళుల్నీ సాంస్కృతికంగా సన్నిహితం చేసిన వారిలో ప్రముఖులు తెనాలి రామలింగకవి, త్యాగరాజు, వేమన ప్రభృతులు. తెలుగులో రామలింగడు ప్రౌఢకవిగా పరిగణించబడుతున్నా, ఆ మహాకవి తమిళులకు వికటకవిగా సుపరిచితుడు. ఆయన పేరున వ్యవహృత మవుతున్న హాస్యకథలు నేటికీ ప్రచారంలో ఉన్నవి. ఇక త్యాగరాజు కీర్తనలు

తమిళనాడులో ఎంత ప్రచారం గడించుకున్నవో చెప్ప నవసరం లేదు. త్యాగరాజ కీర్తనలను ఇటీవల సంగీత శాస్త్రజ్ఞులైన టి.యస్.పార్థసారధి చక్కని తమిళంలో అనువదించారు. శ్యామశాస్త్రి, పట్నం సుబ్రహ్మణ్య అయ్యరు, తిరువత్తూరు త్యాగరాజయ్యరు మొదలైన తమిళ వాగ్గేయకారులు ఎందరో తెలుగులో చక్కని కీర్తనలు వెలయించారు. తెలుగుభాషా ప్రభావం వారిపై ఎంత కలదో ఈ విషయంవల్ల విదిత మవుతుంది.

తమిళ సభలలో తెలుగు కీర్తనలు పాడడం వాంఛనీయం కాదని కొందరు పేర్కొన్నా,తమిళ గాయనీ గాయకులు నేటికీ తెలుగుపాటలు పాడడం గమనించదగింది. సౌరాష్ట్రుడైన వేంకటరమణ భాగవతులు త్యాగరాజుకి ప్రథమ శిష్యుడై - తెలుగులో వాగ్గేయకారుడుగా కీర్తి గడించాడు. త్యాగరాజు కృతుల్ని సంరక్షించినవారిలో ఆయన ప్రభాత స్మరణీయుడు!

మన ప్రాచీనాంధ్ర కవులు సంస్కృత సాహిత్యంలోని అనర్ఘ రత్నాల అందచందాలను తెలుగువారికి చక్కగా తెలియజేసిన విషయం సాహితీ పరులకు తెలిసిందే. ఆ తెలుగు రచనల ద్వారా సంస్కృతం అభ్యసించ కపోయినా తెలుగువారు ఆయా సంస్కృత గ్రంధాలవైశిష్ట్యాన్ని గ్రహించగలుగుతున్నారు. కాని మన ప్రాచీనులు యధానువాదాలు చెయ్యలేదు. సంస్కృతంలోని రామాయణం భారతాదుల్ని అనుసరించి తెలుగులో రచనలు వెలయించారు. తమకు బాగా నచ్చిన భాగాలనో, శ్లోకాలనో వారు యధోచితంగా తెలుగు చేశారు. అందువల్ల 'మాటకు మాట' అన్నది ప్రాచీనుల అభిమతం కాదనవచ్చు. అయితే ఆధునికులు యధానువాదాలను ఆదరిస్తున్నారు. కనుక ఈనాడు యధానువాదాలు పరశ్శతంగా వెలువడుతున్నాయి. పైగా ప్రముఖ సాహిత్య సంస్థలైన కేంద్ర సాహిత్య అకాడమీ, నేషనల్ బుక్‌ట్రస్ట్ మొదలైనవి ఈ అనువాదాలకు చాలా ప్రాధాన్యం ఇస్తున్నాయి. ఇలా సాహిత్య సంస్థలే కాక కొందరు రచయితలు కూడా ఈ అనువాద కార్యక్రమంలో చురుకుగా పాల్గొంటున్నారు.

కనుపర్తి వేంకటరామవిద్యానంద నాథులు, కొత్తపల్లి సూర్యారావు, గరిమెళ్ల సత్యనారాయణ, పూతలపట్టు శ్రీరాములురెడ్డి, చల్లా రాధాకృష్ణశర్మ, దూతలూరి జగన్నాధం, సాధన వీరాస్వామి నాయుడు

ప్రభృతులు సుప్రసిద్ధ తమిళగ్రంధాలను యధాశక్తిని తెలుగు చేశారు. ఈ అనువాదకుల కృషివల్ల, తెలుగువారు తమ భాషలోనే తిరుక్కురళ్, సిలప్పదికారం, మణిమేకలై, కంబ రామాయణం, సుబ్రహ్మణ్య భారతి కవితలు, భారతి వ్యాసాలు, ఆధునికుల నవలలు కథానికలు మొదలైన వాటిని చదివి ఆనందించడానికి చక్కని అవకాశం ఏర్పడింది. ఈ సందర్భంలో పూాతలపట్టువారి కృషిని గురించి ప్రత్యేకించి చెప్పడం సమంజసం. ఆయన ప్రాచీన తమిళ కావ్యాలైన సిలప్పదికారం (అందియ కత), మణిమేఖల, కంబ రామాయణం మొదలైన వాటిని చక్కగా తెనిగించారు. సుబ్రహ్మణ్య భారతి, భారతిదాసన్ కవితలను చల్లా రాధాకృష్ణశర్మ తెలుగుచేశాడు. అలాగే ఆధునిక రచయితలైన ము.వరదరాజన్ గారి మణివిళక్కు (మట్టిదీపం), అఖిలన్‌గారి చిత్తిరప్పావై, పెణ్ (స్త్రీ), నీలపద్మనాభన్ గారి పళ్లికొండపురం (అనంతశయనం), 'కల్కి' రా. కృష్ణమూర్తిగారి పార్తిపన్ కనవు (పార్థివ స్వప్నము) మొదలైన ప్రసిద్ధ నవలలు తెలుగు చేయబడ్డాయి. బాలల కవిగా లబ్ధప్రతిష్ఠుడైన అళ వళ్లియప్ప వ్రాసిన కవితలు, మణిక్కు మణి (చిట్టికి చిరుగంట - నవల) మొదలైన వాటకి కూడా తెలుగుసేతలు వెలిశాయి.

శ్రీయుతులు చింతా దీక్షితులు, మునిమాణిక్యం నరసింహారావు మొదలైన ప్రసిద్ధ రచయితల కథలను తమిళంలోకి పరివర్తించిన శ్రీమతి యన్.కె. సీతాదేవి కళాపూర్ణోదయ కథను 'రత్నమాల' అనే పేరుతో తమిళులకు పరిచయం చేశారు. అడవి బాపిరాజుగారి నారాయణరావుని (నవల) కూడా ఆమె తమిళం చేశారు. శ్రీ పి.వి. సుబ్రహ్మణ్యం విశ్వనాథ సత్యనారాయణగారి ఏకవీరను (నవల) తమిళం చేశారు. ఆయనే రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి అల్పజీవిని కూడా అనువదించారు. విశ్వనాథవారి వేయిపడగలులోని కథను ఈ గ్రంథకర్త ఆయిరం తలై నాగం అనే నవలిక ద్వారా తమిళులకు తెలియజేశాడు. ముప్పాళ రంగనాయుకమ్మగారి పేకమేడలు (కాగిత మాళిగై) తమిళంలోకి అనూదితమయింది. రాజపాళయం వాస్తవ్యు లయిన ముదునూరి జగన్నాథరాజు గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కమును నాటకంగానే తమిళం

చేశారు. యస్.వి.యస్.గా తమిళులకు చిరపరిచితు లైన యస్.వెంకట సుబ్రహ్మణ్యంగారు ప్రసిద్ధ వైద్యులైన సి.సత్యనారాయణ గారి జీవితమ ధురిమను 'వాళ్విన్ యిన్బం' అనే పేరుతో తమిళం చేశారు. ఇంకా పి.వి. రాజమన్నారు, కొడవటిగంటి కుటుంబరావు, పాలగుమ్మి పద్మ రాజు ప్రభృతులు రచనలు తమిళంలోకి పరివర్తితములైనాయి. శివగంగ వాస్తవ్యులైన రుద్రతులసీదాస్ (ఇళంభారతి) తెలుగు కథలను అనువదించి అడుత్తవీడు (ప్రక్కయిల్లు) అనే పుస్తకం ప్రచురించారు. ఆయనే సి.నారాయణరెడ్డి, చల్లా రాధాకృష్ణశర్మల కవితలను తమిళం చేశారు. ఇంకా మరికొన్ని రచనళు అనూదితము లయినాయి.

తెలుగు కవితలో ఒక నూతనోద్యమాన్ని ప్రారంభించి సంచలనం కలిగించిన దిగంబర కవుల కొన్ని కవితలు కూడా తమిళంలోకి వచ్చాయి. ఆ కవుల ప్రభావం కొందరు తమిళ యువకవుల మీద కనిపిస్తుంది. ఇది సంభావించదగిన అంశం.

ఈ అనువాద కార్యక్రమాన్ని సాహిత్య అకాడెమీ, నేషనల్ బుక్ ట్రస్ట్ వంటి సంస్థలు సమాదరిస్తున్నట్లుగానే, మదరాసులోని దక్షిణ భాషా పుస్తక సంస్థవారు కూడా మొదట్లో బాగా ప్రోత్సహించారు. ఈ సంస్థ ఆధ్వర్యవంలో తెలుగునుంచి తమిళంలోకి, తమిళం నుంచి తెలుగు లోకి ఎన్నో రచనలు - ముఖ్యంగా పిల్లల పుస్తకాలు - వచ్చాయి. తెలుగు రచయితల ప్రసిద్ధ నాటికలు, కథానికలు మొదలైన వాటినీ, అల్లరి గోపి అద్భుత యాత్ర, విజ్ఞానలోకం, ఆరోగ్యరక్ష మొదలైన ఎన్నో పుస్తకాలను తమిళంలోకి పరివర్తింపజేశారు. ఈ వివిధ అనువాద రచనల వల్ల తెలుగువారూ తమిళులూ సాహిత్య వైజ్ఞానిక రంగాలలో మరింత సన్నిహితులవుతారని భావించవచ్చు.

ఉపసంహారంగా ఒకటి రెండు మాటలు.

తెలుగు తమిళములు ఒకే భాషా కుటుంబానికి చెందినవి కావడం వల్ల, ఈ రెండు భాషల మధ్య భాషా పరంగా సన్నిహిత సంబంధం ఏర్పడడంలో వింత లేదు. పైపెచ్చు ఇది స్వాభావికం కూడా. అందు వల్ల తెలుగుమాటలు కొన్ని తమిళంలోనూ, తమిళ శబ్దాలు తెలుగులోను చోటు చేసుకోవడంలో ఆశ్చర్యమేమీ లేదు. కాని మూలద్రావిడం నుంచి

విడివడిన భాషలలో తెలుగు మొదటిది కావడం వల్లనూ, కాలక్రమాన ప్రాకృత సంస్కృతాలతో సంబంధం పెంచుకోవడం వల్లనూ తెలుగు సాహిత్యం చాలవరకు సంస్కృత సాహిత్యం అడుగుజాడలలోనే నడిచింది. అందువల్ల, తమిళ కావ్యాలు తెలుగులోకి గాని, తెలుగు కావ్యాలు తమిళంలోకి గాని ఎక్కువగా పరివర్తితం కాలేదు. ప్రాచీనాంధ్ర కవులు గాని తమిళ కవులుగాని ఈ విషయంలో అంతగా శ్రద్ధ వహించలేదనీ, కృషి చెయ్యలేదనీ చెప్పడం సత్య సన్నిహితం.

ఆధునిక కాలంలో ఈ అనువాద కార్యక్రమంలో చెప్పుకోదగిన మార్పు కానవస్తున్నది. సుబ్రహ్మణ్య భారతి వంటి విశాల హృదయులైన తమిళ పండితులూ కవులూ తెలుగు భాషను ప్రశంసించారు. జాతీయోద్యమం మూడు పువ్వులూ ఆరు కాయలూగా ఉన్న రోజుల్లో చాలామంది తెలుగువారు తమిళదేశపు కారాగృహాలలో ఉన్నప్పుడు తమిళ భాషా సాహిత్యాధ్యయనం చెయ్యడమే కాక గరిమెళ్ల సత్యనారాయణ వంటి జాతీయకవి తమిళ సాహిత్యాకాశంలో ధ్రువతారగా వెలుగొందుతున్న తిరుక్కురళ్ ని తెలుగుచేశాడు.

నాయకరాజులు తమిళనాడుని పరిపాలించిన ఆ నాళ్లలో తమిళులు చాలామంది తెలుగు భాషా సాహిత్యాలపట్ల శ్రద్ధాసక్తులు ప్రదర్శించారు. తెలుగుకి రాజభాషా గౌరవం లభించింది. ముఖ్యంగా తమిళ వాగ్గేయకారులు పలువురు తెలుగులో కీర్తనలు వెలయించారు. తెలుగు సంగీతానికి అనుగుణమైన భాష అనే ఒక బావం వ్యాప్తిలోకి వచ్చింది. తమిళులకు త్యాగరాజు కీర్తనలు ప్రీతిపాత్రము లయినాయి. భారతి చెప్పిన యీ మాటలు పరికించదగినవి. "నేను పుట్టినప్పటి నుంచీ నేటిదాకా చూస్తూనే వున్నాను. కచేరీ మొదలవుతుంది. గాయకుడు 'వాతాపిగణపతిం' అని ప్రారంభిస్తాడు. 'రామ నీ సమాన మెవరు', 'మరియాద కాదురా', 'వరము లొసగి........' అయ్యయ్యో! ఒకే మోస్తరు. తమిళులవి యినుప చెవులు. అందువల్లనే ఏడెనిమిది పాటలనే ఏళ్ల తరబడిగా మాటిమాటికి వినగలుగుతున్నారు. తోలు చెవులున్న దేశాలలో ఈ బాధను భరించరు". భారతి ద్వేషించింది తెలుగు కృతుల్ని కాదు. నవ్యత కావాలన్నాడు; పాట కచేరీలలో కొత్త కొత్త కీర్తనలూ తమిళకీర్తనలూ

వినిపించాలని ఆయన ఆశించాడు.

తెలుగునుంచి తమిళంలోకి, తమిళం నుంచి తెలుగులోకి యథానువాదాలు కొన్ని వెలువడినా, తెలుగువారికీ తమిళులకీ నడుమగల చారిత్రక సాంస్కృతిక రాజకీయ అనుబంధాన్ని పురస్కరించుకొని చూస్తే, ఈ అనువాదాల సంఖ్య అత్యల్ప మనక తప్పదు. పైగా హిందీ, బెంగాలీ మొదలైన భాషలనుంచి వస్తున్న అనువాదాల సంఖ్యతో పోల్చి చూసినప్పుడు, తెలుగునుంచి తమిళంలోకి వెళ్లిన పుస్తకాలుగాని, అలాగే తమిళం నుంచి తెలుగులోకి వచ్చిన రచనలు గాని చాలా తక్కువ అని నిస్సంశయంగా పేర్కొనవచ్చు.

ఈ పరిస్థితిలో మార్పు రావాలి. తెలుగువారు తమిళ భాషా సాహిత్యాలను, తమిళులు తెలుగు భాషా సాహిత్యాలను చక్కగా అధ్యయనం చేసి, మూలభాషనుంచి అనువదించే శక్తి సామర్థ్యాలు గడించాలి. అనుసంధాన భాషనుంచి అనువదించ వచ్చుగాని, అది కార్బను ప్రతికి ప్రతిగా ఉంటుంది. మూలంలోని అందచందాలను హృద్గతం చేసుకోడానికి ఉత్తమానువాదం ఎంతైనా తోడ్పడుతుంది. మూల విధేయమూ పఠన యోగ్యమూ అయిన అనువాదం ఉత్తమానువాద మవుతుంది. తెలుగు తమిళములు ఒక కోవకు చెందిన భాషలు కావడం వల్లనూ, వాక్య నిర్మాణం మొదలైన వివిధాంశాలలో ఆరెండు భాషలకు దగ్గరి చుట్టరికం ఉండడం వల్లనూ, సాంస్కృతికంగా కూడా చుట్టరికం ఉన్నందువల్లనూ ఈ రెండు భాషలకు సంబంధించిన ఉత్తమానువాదాలు ఎక్కువగా వెలువడగలవని పేర్కొనడం సమంజసం. భావసమైక్యం తద్వారా జాతీయ సమైక్యం ఏర్పడడానికి ఉత్తమానువాదం ఎంతైనా ఉపకరిస్తుందనడం అతిశయోక్తి కాదు.

యథానువాదాలపట్ల, అనువాదకుల పట్ల పాఠకులకు ఆదరభావం నానాటికి పెరుగుతున్నది. ప్రముఖ సాహిత్య సంస్థలతోపాటు పత్రికలు కూడా యథానువాదాలను ప్రోత్సహిస్తున్నాయి. ఇది శుభ సూచకం!

## 2

తెలుగు తమిళములు తోబుట్టుభాషలే అయినా, ప్రాచీనములే అయినా

తెలుగు సాహిత్యానికి తమిళ సాహిత్యానికున్నంత ప్రాచీనత లేదనడం నిర్వివాద విషయం. ఇందుకు కారణం తెలుసుకోవడం అవసరం; అభిలషణీయం కూడా.

తమిళ సాహిత్యానికి శ్రీకారం చుట్టినది సంగ సాహిత్యం. సంగ సాహిత్యమూ తొల్కాప్పియం లక్షణగ్రంథమూ తమిళభాషా సాహిత్యాలకు సంబంధించిన ప్రాచీన సాక్ష్యాధారాలు. తెలుగుకి ఇటువంటి ప్రాచీన సాక్ష్యాధారాలు లభించలేదు.

సంగసాహిత్యం సంకలనగ్రంథ సముచ్చయం; ఎట్టుత్తొగై అనే ఎనిమిది సంకలనాలు, పత్తుప్పాట్టు అనే సంకలన గ్రంథం - ఈ తొమ్మిది గ్రంథాలకు ఏర్పడిన సమష్టినామం సంగసాహిత్యం. ఇందులో రెండు ప్రాచీన తమిళ సంప్రదాయాలు ప్రధానంగా కానవస్తాయి. అవి అగం (ప్రణయం), పురం (వీరం). అగం కవితలు ముక్కాలు మువ్వీసం కల్పనగాను, పురం కవితలు కథనాత్మకములుగాను గోచరిస్తాయి. ఇవి పదకవితలనీ, ముక్తకము లనీ పేర్కొనవచ్చు. కొన్ని కవితలు మూడు మొదలుకొని అయిదు పాదాల వరకూ ఉంటాయి; కొన్ని తొమ్మిది మొదలుకొని పన్నెండు వరకూ ఉంటాయి. ఈ సంకలన కృతులలో నాలుగువందల ప్రణయ కవితల సమాహారమైన అగనానూరు, నాలుగు వందల వీరకవితల సమాహారమైన పురనానూరు ప్రసిద్ధమైనవి. సంగసాహిత్యంలోనివి చాలావరకు ప్రణయ కవితలే అయినా, పరిపాడల్ కృతిలో కొన్ని భక్తి ప్రధానములుగా ఉన్నాయి. వీటి సంఖ్య తక్కువని చెప్పడం సముచితం. కాగా సంగకవుల దృష్టి మతసంబంధరహిత మనడం నిజానికి దగ్గరగా ఉంటుంది. సంగకవులు ప్రకృతి వర్ణన ప్రియులుగా కానవచ్చినా, వారు ప్రకృతి రామణీయకాన్ని కళ్లకు కట్టేలా వర్ణించిన ప్రకృతి కవులు మాత్రం కారు. కొన్ని కవితలు శబ్దచిత్రాలుగా గోచరిస్తాయి. మొత్తంమీద, సంగసాహిత్యం ఆనాటి తమిళ సంఘానికి దర్పణ ప్రాయమై ఉన్నదనడం సత్యసన్నిహితం. సంగసాహిత్యం ప్రచారంలోకి రాకముందు జానపదగీతాలు ప్రచారంలో ఉండి ఉండాలనీ, అవే సంగకవులకు మార్గదర్శకములైనాయని విజ్ఞులు భావిస్తున్నారు.

తమిళంలో వలె, తెలుగులోనూ జానపద గీతాలు కోకొల్లలుగా

ఉన్నాయి. పాల్కురికి సోమనాథు డంతటి ఉద్దండ కవి పండితారాధ్య చరిత్రలో తెలుగువారి పాత పాట లెన్నిటినో పేర్కొన్నాడు.

పదములు తుమ్మెద పదముల్ ప్రభాత
పదములు శంకర పదముల్ నివాళి
పదములు వాలేశు పదములు గొబ్బి
పదములు వెన్నెల పదముల సంజ
వర్ణన మరి గుణవర్ణన పదము
పాడుచు నాడుచు పరమహర్షమున -

ఇలా ఆయన ఎన్నో ఉదాహరించాడు. ఈ పాటలనే లాక్షణికులు పదములనీ, ప్రబంధములనీ, ఏలలనీ వ్యవహరించారు. సామాన్యార్థంలో పదములన్నా ప్రబంధములన్నా ఏలలన్నా పాటలే. ఊగునప్పటి యేల ఊయేలగా, జోగునప్పటి యేల జోలగా మారివుండవచ్చునని పండిత ప్రభాకరులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు భావించారు. పాల్కురికి సోమన ఎన్నో పదాలు పేర్కొన్నా, అవి నామమాత్రాలు కావడం మన దురదృష్టం! ద్విపదలు, రగడలు, తరువోజలు మొదలైనవి మాత్రం పాటలు కావా? కనుక తెలుగు సాహిత్యంలోనూ పాత పాటలు పరశ్శతంగా ఉండేవి. అవి కనుక వెలుగు చూసి వుంటే తెలుగు సాహిత్య చరిత్ర మరో విధంగా ఉండేదని గట్టిగా చెప్పవచ్చు.

తెలుగులో పాటలెన్నో కాలగర్భంలో కలిసినట్లుగా, జైన బౌద్ధులు సృష్టించిన తెలుగు సాహిత్యం కూడా భ్రష్టమైపోయింది. జైన బౌద్ధులు పండితాధీనమైన సంస్కృతాన్నికాక పామరులు వ్యవహరించే దేశ భాషల్ని ఆదరించారు. వారు వెలయించిన కృతులు తమిళంలో నేటికీ సజీవంగా ఉన్నాయి. కన్నడంలోనూ ప్రచారంలో ఉన్నాయి. తమిళ కన్నడములను ఆదరించిన జైన బౌద్ధకవులు తెలుగు పట్ల సవతి తల్లి ప్రేమను చూపి వుండరు. అలాంటి అవసరం వారికి లేదు. బౌద్ధావశేషము లనదగిన స్తూపముల శిథిలాకృతులు నేటికీ తెలుగు నాడులో గోచరిస్తాయి. మన దురదృష్టం కొద్దీ నేడు లంజదిబ్బలుగా వ్యవహృతము లవుతున్న ఆ స్తూపములు కమనీయ కళాఖండాలై ఉండవచ్చు. అలనాటి తెలుగు వారి శిల్ప వైదుష్యాన్ని తెలియ జేస్తున్న ప్రబల సాక్ష్యాలివి! కాని బౌద్ధాంధ్రుల

సాహిత్య సంపద మాత్రం నష్టమైపోయింది.

తమిళంలో యాప్పరుంగల క్కారికై అనే ప్రాచీన ఛందో గ్రంథం ఒకటి ఉన్నది. దీని కర్త అమృతసాగరుడనే ఒక జైనుడు. గుణసాగరుడనే మరో జైనుడు దానికి వ్యాఖ్యానం వెలయించాడు. యాప్పరుంగల క్కారికై వాంచియార్ వ్రాసిన వడుగుచ్ఛందం అనుసరించి సంతరించబడినట్లు గుణసాగరుని రచన వల్ల తెలియ వస్తున్నది. వడుగుచ్ఛందం ఆంధ్రఛ్ఛందో గ్రంథం కావచ్చు. అలాగే వాంచియార్ రేచన కావచ్చు. కొన్ని తమిళ ప్రతులలో వాంచియార్‌కి మారుగా అపరంజియార్ అనే పేరు కనిపిస్తున్నట్లు ము.రాఘవయ్యంగారు పేర్కొన్నారు. లక్ష్య గ్రంథాలు వెలసిన తర్వాతనే లక్షణ గ్రంథాలు వెలుగు చూడడం పరిపాటి కనుక, జైన కవులు సంతరించిన తెలుగు గ్రంథాలు కొన్ని ఉండవచ్చు. ఇది అత్యూహ అనిపించుకోదు! అదికాక క్రీస్తుశకం తొలి శతాబ్దులలో] తమిళంలో వెలసిన గ్రంథాలు చాలావరకు జైన బౌద్ధకర్తృకములని చెప్పవచ్చు. తమిళ వేదమని ప్రశస్తిగన్న తిరుక్కురళ్ వంటి నీత్యుద్బోధక గ్రంథం రచించిన తిరువళ్లువర్ జైన మతావలంబకుడనే వాదం ఒకటి లేకపోలేదు. తెలుగు సాహిత్యానికి తమిళ సాహిత్యాని కున్నంత ప్రాచీనత లేకపోవడానికి పై విషయాదికాన్ని కారణంగా పేర్కొనడం సముచితం.

తమిళ సాహిత్య చరిత్ర ముక్తక రచనలతో ప్రారంభమైనదనీ సంగ కాలంలో కావ్యరచన జరగలేదనీ అనుకున్నాము. క్రీస్తుశకం తొలి శతాబ్దులంలో జంటకావ్యాలుగా ప్రసిద్ధి కెక్కిన సిలప్పదికారం మణిమేక(ఖ)లైలు వెలుగు చూడగలిగాయి. సిలప్పదికారం (మంజీర మహిమ) ఇళంగో అడిగళ్ అనే జైన కవి కృతమైతే, మణిమేకలై సీత్తలై శాత్తనార్ అనే ధాన్య వర్తకుని రచన. ఆనాటి బౌద్ధసంఘం ఈ కావ్యంలో సజీవంగా చిత్రించబడింధి. సిలప్పదికారం ఒక వణిక్ప్రముఖుని కుమార్తె అయిన కణ్ణకి కథ అయితే, మణిమేకలై కణ్ణకి భర్త అయిన కోవలుని వలపు నేస్తం మాధవి కుమార్తె. కణ్ణకి సతీదేవిగా చిరకీర్తి గడించింది. వేశ్యాగృహంలో ప్రభవించినా వైభవాలు వాంఛించక శ్రావికగా కాలం గడిపి, బౌద్ధ ధర్మ నిర్వహణకే జీవితాన్ని అంకితం చేసుకున్న ఎలబ్రాయపు ముద్దుగుమ్మ మణిమేఖల. ఇలా ఈ కావ్యనాయిక లిద్దరూ

తమిళ సాహిత్యంలో శాశ్వత స్థానం సంపాదించారు. వీరి కథలు తమిళనాడుకి సంబంధించినవి. స్వతంత్ర కథలు. సంస్కృత మాతృకలు లేనివి. ఈ కావ్యద్వయాన్ని కొనియాడుతూ, కట్టమంచి రామలింగా రెడ్డి గారు పలికిన పలుకులు పరిశీలనార్హాలు. 'సిలప్పదికారం మణిమేకలై వంటి కావ్యాలు గల తమిళమును చూసి తెలుగు వాడినైన నేను అసూయ చెందుతున్నాను. తెలుగు సాహిత్యంలో వీటికి తుల్యమైనవి నాకు కనిపించ లేదు. అనువాదంలో కూడా ఇవి ముగ్ధుల్ని చేస్తున్నాయి. మరి, మూలంలో ఇంకా ఎలా ఉంటాయో?' కాని తరువాతి కాలంలో వెలువడిన తమిళ కావ్యాలు తమ విశిష్టతను కోల్పోయినాయి.

తెలుగు ద్రావిడ భాషయే అయినా, తెలుగు సాహిత్యం మాత్రం సంస్కృత సాహిత్యానికి ప్రతిబింబంగా రూపొందింది. స్వతంత్ర కావ్యాలు తెలుగులో చాలా తక్కువ; అనగా దేశిరచనలు తక్కువ. తెలుగులో తొలిసారిగా మార్గ, దేశి ప్రభేదాలను గురించి ముచ్చటించినవాడు నన్నెచోడుడు. శివకవులు దేశీయములైన గాధలు స్వీకరించినా దేశికవులుగా పేరు గడించినా, వారి రచనలు కూడా కొంతవరకు సంస్కృత భూయిష్ఠంగానే తయారయినాయి. అసలు తెలుగు కావ్యాలపట్ల ప్రాచీనులలో కొందరికి ఆదరాభిమానాలు కొంచెం తక్కువే అన్నా సాహసం కాదు.

ఆరూఢ గద్య పద్యాది సంస్కృత భూయిష్ఠ రచన సర్వ సామాన్యం కాదనీ, 'తెలుగు మాట లనంగ వలదు వేదముల కొలదియ కాజూడు' డనీ పాల్కురికి సోమన పేర్కొన్నాడు. గీర్వాణభాషాకృతుల కెన్ని మంచితనాలు కలవో, తెలుగు సత్కావ్యమూ అంతకంటే ఎక్కువగా వర్తిల్లుతున్నదనీ విన్నకోట పెద్దన స్పష్టం చేశాడు. అందరినీ మెప్పించే రీతిగా నేను రచన చేస్తానని పోతన వ్యక్తపరిచాడు. సంస్కృతం దేవభాష అయినా, రసికుడైనవాడు తన సిగలో తులసినే పెట్టుకుంటాడా జాజులే తురుముకుంటాడా అని నుదురుపాటి వెంకన్న ప్రశ్నించాడు. ఇలా తెలుగు సంస్కృతాల మధ్య వ్యర్ధ సంఘర్షణ తలెత్తడం శోచనీయం! గత శతాబ్దిలో తమిళ పండితులు కొందరు శుద్ధ ద్రావిడోద్యమం లేవదీసి, తమిళ సాహిత్యం స్వతంత్రమైనదని తెలియజేశారు. ఇతర ద్రావిడభాషల వలె,

తమిళం సంస్కృత సాహిత్య సహాయాన్ని అంతగా అభిలషించకుండ వర్ధిల్లిన మాట వాస్తవమే. అయినా అతి ప్రాచీనులైన తొల్కాప్పి యనార్ తిరువళ్ళువర్ ప్రభృతులు భాషాభిజ్ఞులు తిరుక్కురళు మీద సంస్కృత సాహిత్య ప్రభావం కొద్దిగానైనా కనిపిస్తుంది. జైన కవులు సంస్కృత విద్వాంసులు. రామాయణ భారతాలు, తత్త్వగ్రంథాలు, పురాణాలు మొదలైనవాటిమీద సంస్కృత సాహిత్య ప్రభావం గోచరిస్తుంది. ఈ అంశాలు త్రోసిరాజనడం అనుచితం.

తెలుగు కావ్యాలలో సాధారణంగా రాజులుగాని బ్రాహ్మణులు గాని నాయకులై ఉంటారు. కాని ప్రాచీన తమిళ కావ్యాలలో బ్రాహ్మణేత రులే నాయకులు. సిలప్పదికారములోని నాయికా నాయకులైన కణ్ణకీ కోవలులు ధనికులైన వైశ్యులు. ఈ కావ్యాలనుంచి ఆనాటి తమిళుల తిండితీర్థాలు, ఆచారవ్యవహారాలు, యుద్ధ విధానాలు మొదలైన వాటిని గ్రహించవచ్చు. అనగా, ప్రాచీన తమిళసాహిత్యం తమిళుల సాంఘిక చరిత్రరచనకు తోడ్పడుతున్నదని పేర్కొనవచ్చు.

తెలుగు కావ్యాలు చాలావరకు కథా ప్రధానంగా, ఆలంకారికంగా సాగడంవల్ల వాటిలోంచి తెలియవచ్చే సాంఘిక విషయాలు అత్యల్పంగా ఉంటాయి. స్వతంత్రంగా కాక ఏదో ఒక మాతృకను అనుసరించి రచన చేసేటప్పుడు, ఇలాంటి యిబ్బంది కవికి కలగక తప్పదు. అయినా లోకజ్ఞులైన నన్నయాదులు యథానువాదాలు చెయ్యక కొంతవరకు తమ స్వాతంత్ర్యాన్ని నిలుపుకున్నారు. ఔచిత్యం పాటించీ అనౌచిత్యం పరిహరించీ, ఒక్కొక్క చోట మూలాతిక్రమణం చేసి మూలాన్ని సంక్షేపించి తమ స్వతంత్రతను కొద్దిగానైనా ప్రదర్శించారు. సంస్కృత కావ్యాలకు, ఆ మాటకువస్తే ఏ కావ్యానికైనా, యథానువాదం చెయ్యాలన్న అభిలాష ఆధునిక మన్నా సాహసం కాదు. నన్నయ తన రచన ధర్మతత్త్వజ్ఞులకు ధర్మశాస్త్రంగానూ, అధ్యాత్మ విదులకు వేదాంతంగానూ, నీతి విచక్షణులకు నీతిశాస్త్రంగానూ, కవులకు మహాకావ్యంగానూ, లాక్షణికులకు సర్వలక్ష్య సంగ్రహంగానూ, ఐతిహాసికులకు ఇతిహాసంగానూ, పౌరాణికులకు పురాణ సముచ్చయంగానూ గోచరిస్తుందని పేర్కొన్నాడు. ఇలాంటి ఒక విశిష్ట రచన తెలుగు సాహిత్యానికి ఆదికావ్యం కావడం విస్మరించరాని

విషయం. పైగా తెలుగుకవులు ఉభయ భాషా కావ్యరచనాభిశోభితులు. కవి బహుభాషాభిజ్ఞుడైనప్పుడు, ఆయా భాషాసాహిత్యాల విషయాలను తన భాషవారికి తెలియజేయాలన్న ఉదారాశయం అతనికి కలగడం సహజం!

తెలుగు కావ్యాలవలె తమిళ కావ్యాలు కూడా దైవస్తుతితోనే ప్రారంభ మవుతున్నాయి. దైవస్తుతికి తర్వాత తమిళకవులు వర్షప్రశంస చేశారు. ఇది తెలుగు కావ్యాలలో కనిపించదు. తిరుక్కురళులో దేవతా స్తుతికి పిమ్మట వానను గురించి పది కురుళులు చెప్పబడ్డాయి. మణిమేకలై కావ్యం ఇంద్రోత్సవంతో ప్రారంభ మవుతుంది. ఇంద్రుడు వర్షాధిపతి అని మన విశ్వాసం. సిలప్పదికారంలో వర్ష ప్రశంస చేయబడింది. కంబ కవి కూడా తన రామాయణంలో నదీ ప్రశంస నెరపివున్నాడు. నదీ వర్ణనంతోనే కందపురాణం మొదలవుతుంది. వర్షప్రశంసకు పిమ్మట తమిళకవులు దేశం, పట్టణం మొదలైనవాటిని వర్ణించారు. తెలుగు కావ్యాలలో - ప్రబంధాలలో - దేవతాస్తుతికి పిదప పురవర్ణనం, చాతు ర్వర్ణ్య ప్రశంస మొదలైనవి ఉంటాయి. తెలుగు కావ్యాలలో కానవచ్చే కుకవినింద తమిళ కావ్యాలలో కనిపించదు.

పూర్వ తమిళ సాహిత్యంలో వెలసిన గ్రంధాలలో నీతిప్రధానములే ఎక్కువగా కనిపిస్తాయి. ఆ నీత్యుద్బోధక గ్రంధాలకు తలమానికం తిరు క్కురళ్. నీతిగ్రంధాలతో పాటు పెక్కు వైద్య జ్యోతిష గ్రంధాలు కూడా కనిపిస్తాయి. తమిళకవులు ధర్మార్థకామములకు ఇచ్చినంత ప్రాధాన్యం మోక్షానికి ఇచ్చినట్లు కనిపించదు. ధర్మార్థ కామములు కనుక సక్రమంగా నిర్వర్తించబడితే, మోక్షం సులభంగా లభిస్తుందని వారు విశ్వసించి వుండ వచ్చు. మన తెలుగు సాహిత్యంలో కూడా నీత్యుద్బోధక రచనలు చాలా వెలువడ్డాయి. శతక వాఙ్మయం చాలావరకు నీతి ప్రధానమనే నిస్సందేహంగా చెప్పవచ్చు. తెలుగులో వెలువడినన్ని శతకాలు తమిళంలో వెలువడలేదు; వందలకొద్ది శతకాలు వెలువడినాయి. కాని అతి ప్రాచీనకా లంలోనే వెలువడిన కురళ్ వంటి నీత్యుద్బోధక గ్రంధం తెలుగులో లేదని చెప్పవచ్చు. ఏ మత ప్రశంస కాని, ఏ దైవ ప్రశంసకాని కురళులో కనిపించదు. ఇదే ఆ గ్రంధ ప్రత్యేకత.

భారత రామాయణాలకు తర్వాత తెలుగులో పేర్కొనదగిన గ్రంథం ప్రబంధం. ప్రబంధం తెలుగువారి స్వతంత్ర కావ్యం. తెలుగు కవికి కొత్తగా ఊహించగం తెలియదన్న అపప్రథను పోగొట్టిన దీ ప్రబంధం. అయితే ప్రబంధ కథలు ఒకే మూసలో పోసినట్లుగా గోచరిస్తాయి. ప్రబంధ కల్పనలలో కానవచ్చే వైవిధ్యం కథలలో మృగ్యం. తమిళంలో కంబ రామాయణంలో మహా కావ్యలక్షణాలు చాలావరకు పాటించబడ్డాయి. కాని అటువంటి రచనలు బహుళంగా లేవనడం నిజం. యక్షగాన రచనలు కూడా తమిళంలో బహుళంగా లేవని చెప్పడం సమంజసం. తెలుగులో ఎన్నో! నేటికీ తంజావూరు ప్రాంతంలో తెలుగు యక్షగానాలు ప్రచారంలో ఉండడం గమనించదగింది. నరసింహ జయంతినాడు మేలట్టూరు భాగవతులు ప్రహ్లాదవిజయాన్ని తెలుగులోనే ప్రదర్శించడం హర్షించదగిన అంశం. తెలుగు యక్షగానం అనుసరించి తమిళ యక్షగానాలు వ్రాయబడినట్లు వళ్లాల రాజన్ ఇశైనాటకం యక్షగానం ప్రచురించిన ఎ.యస్.కె. దుర్గగారు పేర్కొన్నారు. తమిళకవులు పదరచనలు (కురళ్ రెండు పాదాలు గలది) వాడినట్లుగా, కన్నడ కవులు త్రిపద షట్పదాది రచనలు చేసినట్లుగా, తెలుగు కవులు - అనగా దేశికవులు - ఎక్కువగా ద్విపదలో రచన సాగించారు. సంగీత సాహిత్య సమ్మేళనమైన ఉదాహరణ ప్రక్రియ తెలుగు సాహిత్య విశిష్టతను తెలియజేస్తున్నది. తమిళం, కన్నడం మొదలైన భాషలలోనూ లేకపోవడం, నేటికీ తెలుగులో సజీవంగా ఉండడం ఈ ప్రక్రియకు తెలుగులో గల వైశిష్ట్యాన్ని వ్యక్తం చేస్తున్నది.

తమిళ కావ్యాలలోని నాయికా నాయకులు బ్రాహ్మణేతరులైనట్లే, ప్రాచీన తమిళకవులలో కూడా బ్రాహ్మణేతరులు పలువురు గోచరిస్తారు. తరువాతి కాలంలో బ్రాహ్మణకవులు చాలామంది కనిపిస్తారు. వ్యాఖ్యానగ్రంథాలు వెలయించిన వారిలో అధిక సంఖ్యాకులు బ్రాహ్మణులే. వెనుకబడిన వారుగా గణించబడుతున్న కొన్ని జాతులవారు కూడా తమిళంలో కావ్యరచన చేసినట్లు తెలియవస్తున్నది. ఆదిద్రావిడులలో పురోహితవృత్తి చేసే వళ్లువుల జాతికి చెందినవాడనీ, నేతవృత్తి నాధారంగా జీవించినవాడనీ తిరువళ్లువరు గురించి చెపుతారు. ఆయన

కులకాలాదికం వివాదగ్రస్త విషయాలే. ఆనాళ్లలోనే తమిళంలో కవయిత్రులు కూడా ఉన్నట్లు భావించవచ్చు.తెలుగులో కవయిత్రుల సంఖ్య అల్పమని చెప్ప నవసరం లేదు.

మధ్య యుగంలో (క్రీ.శ.700-1300) తమిళంలో కలంబగం (ఛందో భేదం కల 100 పద్యాల గ్రంథం), తిరుప్పళ్లి ఎళుచ్చి (మేలుకొలుపు), కోవై (కావ్యభేదం), పరణి (యుద్ధ సంబంధి రచన), ఉలా (దేవుని ఊరేగింపు), తూదు (రాయబారం) మొదలైన లఘు కావ్యాలు వెలువడ్డాయి. ప్రస్తుతం వీటి ప్రచారం తగ్గినట్లే. తమిళంలో 96 ప్రబంధ భేదాలు ఉదాహరించబడినవి. ఇతర సాహిత్య ప్రక్రియలతో పోల్చి చూసినప్పుడు, అసలు కవిత పూర్వపు టౌన్నత్యం కోల్పోయిందేమో అనిపిస్తుంది. సుబ్రహ్మణ్య భారతి, భారతిదాసన్ కవులకు తర్వాత పేర్కొనదగిన తమిళకవులను వేళ్లమీద లెక్కపెట్టవచ్చు.

ఈ సందర్భంగా తెలుగువారి కవితాప్రియత్వాన్ని కొనియాడడం సముచితం. భారతీయ జ్ఞానపీఠం వారి బహుమతి గ్రహీత లిద్దరూ కవులు కావడం, కేంద్ర సాహిత్య అకాడెమీ వారి 30 మంది బహుమతి గ్రహీతలలో 13మంది కవులు కావడం తెలుగువారి కవితాభిరుచిని స్పష్టం చేస్తున్న అంశాలు. నిజానికి ప్రశస్త వచన రచయితల కంటే తెలుగులో ఉత్తమ కవులే ఎక్కువగా కనిపిస్తారన్నా అతిశయోక్తి కాదు. అయితే కవితలు వెలయించేవారందరూ ఉత్తమ కవులేనా అని కొందరు ప్రశ్నించవచ్చు. నేడు కవితకు ప్రచారం తగ్గవచ్చు, కవితా సంకలనాల అమ్మకమూ అంతంతగా ఉండవచ్చు, అయినా కవితపట్ల (అది పద్య రచన అయినా సరే వచనకవిత అయినా సరే) తెలుగు రచయితలకూ పాఠకులకూ గల ఆదరభావం నిరుపమానం.

తమిళ లాక్షణికులు తమ వాఙ్మయాన్ని ఇయల్, ఇశై, నాటకం అని ముత్తెరగుల (ముత్తమిళుగా) విభజించినా, నాటకములలో ప్రయుక్తమయ్యే భాష విలక్షణమై ఉండాలనీ దానికి నాటక తమిళమనే వ్యవహార నామం ఉన్నట్లు తెలియవస్తున్నా, ప్రాచీన నాటక సాహిత్యం లభ్యం కాలేదు. సిలప్పదికారమునకు నాటక కాప్పియం (కావ్యం), ఇయల్ ఇశై నాటక పొరుళ్ తొడర్ నిలై సెయ్యుళ్ అనే నామాంతరాలున్నాయి.

పర్వత ప్రాంతాలలో రాసక్రీడ వంటి నృత్య విశేషం వ్యాప్తిలో ఉండేదనీ తెలియవస్తున్నది. ఇంతకుమించి తమిళ నాటక వాఙ్మయానికి సంబంధించిన వివరాలు ఉపలబ్ధం కాలేదు.

తెలుగునాడులో కూడా నాటకాలు వ్యాప్తిలో ఉండేవి. శ్రీశైలం మీద శివరాత్రి వేడుకల్ని తెలియజేస్తూ పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో పేర్కొన్న అంశాలు అమూల్యమైనవి.

'ప్రమ థ పురాతన పటు చరిత్రములు
గ్రమ మొంద బహునాటకము లాడువారు
ఆదట గంధర్వ యక్షవిద్యాధ
రాద్యులై పాడెడు నాడెడు వారు
వెండియు భవు బహు విధ చరిత్రము ల
ఖండిత గతి నాటకంబు లాడుచును'

ఇలా నాటక ప్రదర్శనలు జరిగేవి కనుక వాటికి అనుగుణమైన నాటక రచనలూ ఉండేవని నిస్సంశయంగా చెప్పవచ్చు. అవి దేశి మార్గానికి చెందిన యక్షగానములు కావచ్చు; లేదా భిన్నములూ కావచ్చు.

సోమనాథుని కాలంలో చిరుతొండనంబి కథను నాటకంగా ప్రదర్శించేవారని స్పష్టంగా పేర్కొనవచ్చు. బసవపురాణంలో ఆయన అంటాడు గదా:

'..... ..... ......
అటుగాక సాంగ భాషాంగ క్రియాంగ
పటు నాటకంబుల నటియించువారు'

కనుక ఆనాళ్లలోనే నాటకం తెలుగునాడులో ప్రచుర ప్రచారంలో ఉండేదనీ, ప్రాచీనమైన నాటక సాహిత్యమూ ప్రచారంలో ఉండేదనీ భావించడంలో విప్రతిపత్తి లేదు. ఈ సందర్భంగా, ప్రాచీన తమిళ కృతులలో కానవచ్చే తెలుగు నాట్యం గురించి ప్రస్తావించడం సమంజసం.

సిలప్పదికారం కావ్యంలో అరంగేట్రుగాదై (రంగాధిరోహణ గాథ) అనే కథాభాగంలో తెలుగునాట్యానికి సంబంధించిన ప్రశంస కానవస్తున్నదని తత్కావ్య వ్యాఖ్యాతలు పేర్కొనడం గమనించదగింది. మెయ్ కూత్తు

అని ఆ కావ్యంలో ఉన్నదే కాని స్పష్టంగా వడుగుక్కూత్తు (తెలుగు నాట్యం) అని లేదు.

కడ సంగకాలంలో వర్ధిల్లిన అరివనార్ తన పంచమరబు అనే గ్రంథంలో నృత్యం గురించి ఇలా అన్నాడు: 'నృత్తమావదు దేసి, వడుగు, సింగళ మెన్నుం మూవగైక్కూత్తుం ఎనక్కొళ్గ.'

నాట్యం దేసి, వడుగు, సింహళము-అని త్రివిధమని పై సూత్రానికి అర్థం. నిలబడి ఆడే ఆటకు దేసి అనీ, కదులుతూ ఆడే ఆటకు వడుగు అనీ, నడుస్తూ ఆడే ఆటకు సింహళమనీ అరివనార్ అర్థం చెప్పాడు. 150వ సూత్రంలో వడుగుని ఆయన వన్మై క్కూత్తు అని అభివర్ణించాడు; అనగా తాండవమని అర్థం.

12వ శతాబ్దిలో జీవించిన అడియార్కు నల్లార్ అనే పండితుడు తన వ్యాఖ్యాన గ్రంథంలో మెయ్క్కూత్తావదు దేసి, వడుగు, సింగళంఎన మూవగైప్పడు (80వ పుట) అని పేర్కొన్నాడు.

జీవక చింతామణి అనే ప్రశస్త కావ్యానికి వ్యాఖ్యానం వెలయించిన నచ్చినార్కినియర్ (15వ శతాబ్ది) 672వ పద్యానికి అర్థం తెలుపుతూ పై నాట్య భేదాలు తెలియజేశాడు.

సిలప్పది కారమునకు ప్రశస్త వ్యాఖ్యానం వెలయించిన ఆధునికులలో ప్రముఖుడు పండిత న. ము. వేంకటస్వామి నాట్టార్. మార్గం వడుగుం ఎనినుం ఒక్కుం - అని ఆయన సెలవిచ్చాడు. తమిళమునకు సంబంధించినంతవరకు మార్గమూ వడుగూ ఒక్కటే - అని యీ వాక్యానికి అర్థం. అనగా, మార్గమూ వడుగూ దేశి నాట్య విశేషాలు కావనీ, ఇక్కడ దేశి అన్నమాట తమిళనాడుకి చెందిన నాట్యమనీ గ్రహించాలి. అందువల్ల మార్గవడుగులు తమిళదేశానికి చెందినవి కావు. వడుగు అంటే తెలుగనే అర్థం ప్రయుక్తం.

క్రీస్తుశకం రెండవ శతాబ్దినాటికే మార్గకు భిన్నమూ తమిళుల కూత్తుకి భిన్నమూ అయిన తెలుగునాట్య విశేషం ప్రచారంలో ఉండేదని పై చర్చవల్ల తెలుస్తున్నది. అయితే ఆ తెలుగు నాట్యం పేరేమిటో వ్యాఖ్యాతలు చెప్పలేదు. ప్రాచీన తమిళకృతుల్ని పర్యాప్తంగా పరిశీలిస్తే ఇలాంటి విశేషాలు మరికొన్ని బయల్పడవచ్చు. కాగా తెలుగువారు ప్రాచీన తమిళ సాహిత్యాన్ని పరిశీలించడం అవసరం.

# 3. తెలుగు తమిళ భక్తి సాహిత్యాలు

దక్షిణ భారతదేశపు సాంస్కృతిక చరిత్రలో క్రీస్తుశకం 5 నుంచి 9 శతాబ్దులు చాలా ముఖ్యమైనవి. అంతవరకూ ప్రబలంగా ఉండిన జైనబౌద్ధమతాలు తెరమరుగున చేరడంతో, అతి ప్రాచీనమైన హిందూమతంలోని అంతర్భాగాలైన శైవ వైష్ణవాలు బలం పుంజుకోసాగాయి. అందుకు భక్త్యుద్యమం బహుథా ఉపకరించింది. భక్తిప్రధానమైన ఈ ఉద్యమం కులవిభేదాలను నిరసించింది. జైన మతానుయాయులు పలువురు హిందువులయ్యారు. అప్పర్ అనే ప్రసిద్ధ నామాంతరం గల తిరునావుక్కరశర్ తొలుత జైనుడు. ఆయన ప్రముఖ శివభక్తుడు కావడమే కాకుండా, పల్లవభూపతి మొదటి మహేంద్రవర్మను శైవమతస్థునిగా చేశాడు.

కర్మజ్ఞానాలు సాధించని ఘనవిజయాన్ని భక్తివాదం సాధించింది. కర్మ జ్ఞానాలు పండితలోకానికి పరిమితం కాగా, భక్తివాదం సార్వజనీన మయింది. విభిన్న భాషలవారినీ వివిధ ప్రాంతములవారినీ అది ఏకం చెయ్యగలిగింది. తమిళభక్తులు తెలుగునాడులోని శైవక్షేత్రాలు సందర్శించారు. తెలుగువారికి తమిళులైన నాయన్మారులూ (శివభక్తులు), ఆళ్వారులూ (విష్ణుభక్తులు) ఆరాధ్యు లయ్యారు. ఈవిధంగా జాతీయసమైక్యానికి భక్తివాదం దారి చూపింది.

అలాగే భక్తివాదం మానవతాదృష్టిని పెంపొందింపజేసింది. ఇది అతి ముఖ్యమైన విషయం. కులం ముఖ్యం కాదనీ గుణం ముఖ్యమనీ భక్తకవులు ప్రబోధించారు. కుల విచక్షణ పాటించకుండా, ఏ కులానికి చెందినా సరే అతడు కనుక భక్తుడైతే అతడు పూజనీయుడనే భావం ప్రజలలో ఏర్పడింది. మడివాలు మాచయ్య, కుమ్మరి గుండయ్య, హరిజనులైన తిరుప్పాణాళ్వారు, నందనారు ప్రభృతులు సర్వవర్ణముల వారికీ ప్రీతి పాత్రులయ్యారు. బ్రాహ్మణేతరుడైన నమ్మాళ్వారుకి వైష్ణవ సంఘంలో ఎనలేని పేరు పెంపులు లభించాయి. ఆయన అసలు పేరు మారన్. కాని శఠగోపుడనీ, పరాంకుశుడనీ, నమ్మాళ్వారనీ ప్రథిత యశస్కుడయ్యాడు. ఆయన్ని ఋషిగా ప్రస్తుతిస్తారు; మన (నం) ఆళ్వారుగా కీర్తిస్తారు. ఆయన ప్రసాదించిన తిరువాయ్‌మొళి ద్రవిడోపని

షత్తుగా ప్రసిద్ధి వహించింది. ఈ విషయాదికం పరిశీలిస్తే, ఆ నాళ్ళలో భక్తులకూ భక్తకవులకీ సంఘంలో ఎంత ఆదరభావం ఉండేదో సువిదిత మవుతుంది. అయితే ఆ మానవతా దృష్టి సాంఘిక న్యాయాన్ని పురస్కరించుకుని ఏర్పడినది కాదు. అందువల్ల అది భక్తులవరకే పరిమితమై పోయింది. ఆ భక్తులలో కూడా శైవులు శివ భక్తుల్నీ, వైష్ణవులు విష్ణుభక్తుల్నీ ఆరాధించసాగారు. ఏది ఎలా ఉన్నా, మానవతాదృష్టి అనే విశాల దృక్పథం మనలో నెలకొనడానికి ఈభక్తివాదం దారి తీసిందనడం నిర్వివాదం.

ఈ భక్తివాదం వల్ల భగవదారాధన కంటె భగవద్భక్తుల సేవే ఫల ప్రదమనే భావం కూడా నెలకొన్నది. భగవంతుణ్ణి తమిళంలో ఇరైవన్ అంటారు. ఆ ఇరైవన్ తొండర్‌నాదన్ (భక్తుల నాయకుడు) అని వ్యవహారం. ప్రాచీన కవయిత్రి అవ్వైయార్ భక్తుల మహిమను కొనియాడుతూ ఇలా పేర్కొన్నారు.

"....... ....... .........
ఉమైయవళ్ ఇరైవనుళ్ అడక్కం
ఇరైవనో తొండరుళ్ అడక్కం
తొండర్ తం పెరుమైసొల్ ఒణ్ణాదే ..... "

పార్వతి పరమేశ్వరునిలో లీనమై యున్నది
పరమేశ్వరుడో భక్తులలో లీనమై యున్నాడు.

భక్తుని మహిమను వర్ణింపదరమా? - అని పై పాదాలకు అర్థం.

భక్తుడు కనక లేకుంటే పంచనదీశ్వరుడికి తోడు లేదని తిరునావుక్కరశర్ పేర్కొన్నాడు. కనుకనే భగవద్భక్తులకు ప్రాధాన్యం ఏర్పడింది. తెలుగు కవులైతే ఈ భావాన్ని మరింత స్పష్టం చేశారు.

పలు తీర్థంబుల గ్రుంకుకంటె మహిలో భక్తాంఘ్రిపానీయముల్
తల మీదన్ జికిలించుకోదగును ...... ' అనీ

'తీర్థము లందెల్లను దివ్యతీర్థ మన సద్భక్తుండు' అనీ

యథావాక్కుల అన్నమయ్య అంటే, భద్రాచల రామదాసు ఈ క్రిందివిధంగా పేర్కొన్నాడు;

'హరిదాసుకు పూజ లాచరించిన జాలు
హరిని పూజసేతుననే యహ మదేటికె.'

భక్తివాదం, మానవతాదృష్టి ప్రబలమయ్యే కొద్దీ భక్తకవులు ముక్త కంఠంతో కులనిరసన కావించారు. భక్త్యుద్యమంవల్ల ఏర్పడిన మరో సత్ఫలిత మిది. భగవంతునికి కులగోత్రాలు లేనప్పుడు, భక్తులకు మాత్రం కులగోత్రాలు నిర్ణయించడం ఎలా సమంజస మవుతుంది? అని సహేతుకంగా పాల్కురికి సోమనాథుడు ప్రశ్నించాడు. ఈక్రింది పాదాలు అందుకు సాక్ష్యం.

బ్రహ్మశిరోహరు ప్రమథైకవంశ్యు
బ్రహ్మవంశ్యుడని భావించె దెట్లు?
జాతిగోత్రాతీతు సద్గురు జాతు
జాతిగోత్ర క్రియాశ్రయు జేసె దెట్లు?
అకులస్థుడైయున్న యా భవుని భక్తు
నికి ఏ కులంబని నిర్ణయించెదవు?"

క్రీస్తుశకం 9, 10 శతాబ్దుల మధ్య నివసించినట్లు చెప్పబడుతున్న ప్రముఖ భక్తకవి మాణిక్యవాచకర్ కూడా కుల భేదం నిరసించాడు. సోమనాథునివలె, ఆయన కూడా తన తలిదండ్రుల పేర్లు తెలుపలేదు. అంత భక్తిభావం వారిలో నెలకొన్నది!

భక్తకవులు చాలామంది చదువుల నిరర్థకతను ఉద్ఘాటించారు. గ్రంథ పఠనంవల్ల కలిగే జ్ఞానం లాభదాయకం కాదనీ, అది భగవద్దర్శనానికి తోడ్పడదనీ వారు నిష్కర్షగా పేర్కొన్నారు.

అతి ప్రాచీనుడూ తమిళ వేదకర్త అయిన తిరువళ్ళువర్,
"చదివిన ఫలమేమి సర్వజ్ఞు పుణ్య
పదముల భక్తితో ప్రణుతింప కున్న?!"

అని సూటిగా ప్రశ్నించాడు.

గ్రంథ విజ్ఞానంతో స్వర్గం చేరవచ్చునా? పత్తి నిచ్చెనతో పైకి వెళ్ళగలమా? అని ప్రశ్నించాడు తాయుమానవర్ అనే మరో భక్త కవి. వాచక జ్ఞానత్తాల్ వరుమో సుకం? (పుస్తక జ్ఞానంవల్ల లభిస్తుందా

సుఖం) అని కూడా ప్రశ్నించాడు.

చదువులు నిరర్థకము లంటూ, భగవత్పాద సంసేవాసక్తివల్లనే జంతువులు కూడా ముక్తి పొందగలిగాయని శ్రీ కాళహస్తీశ్వర శతక కర్త ఘంటాపథంగా పేర్కొన్నాడు. జ్ఞానం లేని జంతువులే భక్తిభావం ప్రదర్శించి ఈశ్వర సాక్షాత్కారం పొందినప్పుడు, జ్ఞాన విశిష్టుడైన మానవుడికి ముక్తి కరతలామలకం అనే భావాన్ని పరమ రమణీయంగా తెలియజేశాడు ధూర్జటి మహాకవి.

భక్తకవుల రచనలలో కులనిరసనతోపాటు రాజనిరసన కూడా ప్రముఖంగా కానవస్తుంది. పోతన త్యాగరాజాది మహనీయులు రాజాశ్రయాన్ని నిరసించిన విషయం తెలుగువారికి సుపరిచితమే. మనుజేశ్వరాధములని పోతన రాజుల్ని తెగడగా, నమ్మాళ్వారు భగవంతు డొక్కడే యీలోకంలో నిజమైన శ్రీమంతుడని పేర్కొన్నాడు.

'కవులారా! రండు
కష్టపడి జీవించుడు
మీ చెమటతో మీ అన్నము తినుడు.
ఏల కీర్తించెదరు ఆ శ్రీమంతుని?
నిజముగా ఈలోకములో
ఎవరు శ్రీమంతుడు?
ఎవ్వరూ లేరు.
మీ యిష్టదైవమును కీర్తించుడు.
మీ గీతికలన్నీ
అరుణ కిరీటధారి ఆ శ్రీనాథుని చేరును.'

రాజుల భోగభాగ్యాలు అశాశ్వతములనీ, వారిని సేవించడం నిరర్థకమనీ నమ్మాళ్వారు తన గీతాలలో పేర్కొన్నాడు. ఆయన ఒకచోట అంటాడుగదా: 'భగవంతుడు సమ్రాట్టు; శాశ్వతమూ నిరుపమానమూ అయిన అతని దండం ఏడు లోకాలమీద ఆధిపత్యం నెరపుతున్నది. అతని అధికారం అనంతం; తరగనిది.'

మానవ శరీరంలోని వివిధావయవములు భగవత్సేవకు ఉద్దిష్టములైన

వని భక్తకవులు ఘోషించారు. అప్పుడే మానవజన్మ సార్థకం కాగలదని వారు హృదయ స్ఫూర్తిగా భావించారు. అతి ప్రాచీనమైన సిలప్పదికారం కావ్యంలో (మంజీర మహిమ) విష్ణుమూర్తిని కీర్తించిన తీరుని పరికిస్తే యీ విషయం చక్కగా బోధపడుతుంది.

'..... ..... ......
కణ్ణోమైత్తుక్కాణ్బార్ తం కణ్ణెన్న కణ్ణే
తిరుమాల్ సీర్ కేళాద చెవి యెన్న చెవియే
నారాయణా వెన్న నావెన్న నావే - '

సకల భువనముల దాల్చిన ఆ పద్మనాభుని
దర్శించని కండ్లు కండ్లే
వెన్నుని మహిమ వినని చెవులు చెవులే
నారాయణా అనని నాలుక నాలుకే .......

ఈ భావాన్ని నమ్మాళ్వారు ఇంకా కొంచెం విపులీకరించాడు, తన తిరువాయ్మొళిలో.

'*నీలవర్ణుడా! కిరీటధారీ!*
నా మనస్సు
నీయందే లగ్నమైయున్నది.
భువనత్రయము సేవించు
నీ పాదములయందే యున్నది.
నిన్నే ఆశ్రయించి యున్నవి
నా మాటలు.
నీవు నివసింపగా
నా హృదయ పట్టణ మున్నది.
దేవ దేవా!
నిన్నే తడవుచున్నవి నా చేతులు.
సంతత దర్శనభాగ్యము కోసము
క్షణమైనా విరామము లేక
తహతహలాడుచున్నవి నా కనులు.
నీ వాహనపు రెక్కల సవ్వడి వినగా

రిక్కపొడుచుకొన్నవి నా చెవులు
నీ నామ మాధుర్యము
నిండి యున్నది నా చెవుల.....'

ఈ సందర్భమున పోతన మహాకవి ప్రసిద్ధ పద్యాలను స్ఫురణకు తెచ్చుకోవడం సమంజసమూ సముచితమూను.

'కంజాక్షునకు గాని కాయంబు కాయమే
పవనగుంభిత చర్మభస్త్రిగాక
వైకుంఠు బొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమఢమ ధ్వనితోడి ఢక్కగాక........'

'కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము ..... '

భక్తకవులు విశాలహృదయు లనడంలో సందేహం లేదు. వారి దృష్టిలో అందరూ బంధువులే.

'తల్లి పార్వతియును తండ్రి శివుండు,
నెల్లభక్తులు తన హితబంధుజనులు'

అన్నాడు పాల్కురికి సోమనాధుడు. శత్రువైనా సరే, అతడు కనక లింగ సహితుడై ఉంటే మిత్రునివలె చూడుము - అని ఆయన మరోచోట పేర్కొన్నాడు.

సీతమ్మ మాయమ్మ, శ్రీరాముడు మాదు తండ్రి - అనే కీర్తనలో భక్త వాగ్గేయకారుడు త్యాగరాజు, 'భరతాదులు సోదరులు మాకు, ధర నిజ భాగవతాగ్రేసరు లెవరో వారెల్లను వర త్యాగరాజునికి పరమబాంధవులు' అని పేర్కొన్నాడు. నిజభాగవతాగ్రేసరులు పరమభాంధవులట త్యాగరాజుకి! పరమ రమణీయంగా సెలవిచ్చాడు ఆ భాగవతాగ్రేసరుడు.

వైష్ణవులు కూడా ఇలాగే భావించారు. ఒక తిరునామంలో ఇలా పేర్కొనబడింది.

'తల్లి మాకు శ్రీయిందిరా కన్నతండ్రి గావలెను శ్రియఃపతి
ఎల్ల భాగవతులు ఇంపైన బంధువులు
కల్లగాదు మాఇల్లు పరమపదము'

భక్తుల మహిమను కొనియాడడం అవశ్యమనీ, భక్తిమార్గం సర్వోత్కృష్టమనీ భక్తకవులు ప్రబోధించారు. భగవంతుడు భక్తపరాధీనుడని మన తరతరాల విశ్వాసం. శివుని ప్రతిబింబమూర్తియై భక్తుడు మానవాకృతిలో సంచరిస్తాడని పాల్కురికి సోమనాథుడు భావించాడు. ఆవు ననుసరించి ముందుకి సాగే కోడెవలె, భగవంతుడు భక్తుని అనుసరిస్తూ ఉంటాడని పోతన భగవంతునికీ భక్తుడికీ మధ్య గల సంబంధాన్ని మధుర మోహనంగా అభివ్యక్తం చేశాడు. ఒకరిమీద మరొకరు ఆధారపడి ఉన్నారనే అంశం సుస్పష్టం. వేమన అయితే, 'భక్తి గలుగువాడె పరమాత్మ తానయా' అని భక్తి విశిష్టతను స్పష్టం చేశాడు.

నరనారాయణుల నడుమగల సంబంధాన్ని, అవతార తత్త్వాన్ని పురస్కరించుకుని, నమ్మాళ్వారు ఇలా తెలియజేశాడు.

'నరుడై ప్రభవించిన ఆ దేవుడు
గైకొనెను దుఃఖపు బ్రతుకు;
దుఃఖమునుండి మనల గొంపోవును
ఆతని దివ్యధామమునకు.'

స్వర్లోకవాసుడైన శ్రీమన్నారాయణుడు మానవరూపం దాల్చి మన మధ్య దుఃఖమయ జీవితం గడపడానికి కారణం, దివినుండి భువికి దిగిరావడానికి కారణం - దుఃఖంలోంచి మనల్ని దివ్యధామానికి తీసుకు వెళ్ళడానికే అనే తాత్త్వికభావనను నమ్మాళ్వారు చక్కగా వ్యక్తంచేశాడు. భగవంతుడు మానవపక్షపాతి అనే భావం ఇందులో సూచించబడింది.

భక్తిమార్గం సర్వోత్కృష్టమని భావించబడినా, జ్ఞానమార్గాన్ని కూడా కొందరు ప్రశంసించారు. ఇలా ప్రశంసించినవారు పండితవర్గానికి చెందినవారని చెప్పవచ్చు. జ్ఞానసంపదగాని మోక్షంబు లేదు - అని శ్రీనాథుడు భీమఖండంలో వ్యక్తం చేశాడు. జ్ఞాన మంటే వేదవేదాంగ విజ్ఞాన మని మన పెద్దల అభిప్రాయం. జ్ఞానం ధర్మానికి అధిష్ఠానమనీ, దానిద్వారా

మానవుడు మోక్షపదం చూడగలుగుతున్నాడన్నది తిక్కన అభిప్రాయం.

భూతత్తాళ్వారు మొదలైన ప్రముఖ తమిళ భక్తకవులు జ్ఞానమార్గం ప్రబోధించారు. నాయన్మారులలో ప్రసిద్ధుడైన అప్పర్ యిలా అన్నాడు.

"నిప్పు కొయ్య లోన, నేయి క్షీరము నందు
మరుగు పడిన మాడ్కి - మనసు లోన
వెలుగు చున్నవాడు తులలేని జ్యోతియై;
త్రచ్చవలెను జ్ఞానరజ్జు చుట్టి
ప్రేమ మంథము; కనిపించు ఈశు డపుడు"

జ్ఞానరజ్జువుని చుట్టి, ప్రేమ (భక్తి) కవ్వముతో కనక చిలికినట్లయితే ఈశ్వర సాక్షాత్కారం తథ్యమని ఆయన అన్నాడు.

కర్మజ్ఞానాలను నిరసించకపోయినా, భాగవతం భక్తి మార్గానికే ప్రాధాన్యమిచ్చినట్లు విద్వల్లోకం అంగీకరించిన విషయం.అందులోనూ సహజకవి పోతనామాత్యుని చేతిలో తెలుగు భాగవతం భక్తిరసపు ముద్దగా రూపు దాల్చింది. ప్రతి కథా ఘట్టంలోనూ ఆ భక్తకవి భక్తి మహిమను వేనోళ్ళ కొనియాడాడు. కామం, భయం, వైరం, బాంధవం, ప్రేమ, భక్తి - ఏ విధంగానైనా హరిని చెందవచ్చునని పోతన పేర్కొన్నాడు. అయితే మనస్సు హరిపరాయత్తం కావాలి.

తమిళ భక్తకవులు చాలామంది భగవంతుణ్ణి ప్రేమ స్వరూపునిగా అభివర్ణించారు. మధువనీ, ఇక్షురస మనీ, నా జ్యోతి, నా జీవితమా - అనీ భగవంతుణ్ణి సంబోధించారు. 19వ శతాబ్ది వాడయిన జ్యోతి రామలింగస్వామి అనే ప్రముఖ భక్త కవి తన తిరు అరుట్పాలో ఒక పద్యంలో ఇలా అన్నాడు.

"ప్రేమ అనెడు పిడికిట ఇముడు పర్వతమా
ప్రేమ అనెడు గుడిసెను చొచ్చు మహీపతీ
ప్రేమ అనెడు వలలో చిక్కు పరబ్రహ్మమా
ప్రేమ అనెడు కరతల మందలి అమృతమా
ప్రేమ అనెడు ఘటమున అణగిపోవు అంబుధీ
ప్రేమ అనెడు జీవ విజ్ఞానమా

ప్రేమ అనెడు అణువున అణగిన మహాజ్యోతి
ప్రేమ స్వరూపుడా! శివుడా!"

కనుకనే భగవద్భక్తులు కూడా పరమ ప్రేమ (పెరుం కాదల్ ఉడై యార్) కలిగిన మహనీయులు; వారి మనస్సులు ద్రవించే స్వభావం కలవి.

కాగా తెలుగు తమిళ భక్త కవులు మనస్సుని ఈశ్వరాయత్తం చేయాలని కోరారు. అలా మనస్సుని ఈశ్వరుని యందు సతతమూ నిలుపగలిగినప్పుడే (భక్తిభావంతో సదా సంచరించినప్పుడే), ఈశ్వర సాక్షాత్కారం కలుగుతుంది.

"మనసు విషయ నట విటుల కొసంగితె
మా రాముని కృప గల్గునొ మనసా ...... "

"మనసు స్వాధీనమైన యా ఘనునకు
మరి మంత్ర తంత్రము లేల ..... "

అని రామభక్తాగ్రేసరుడు త్యాగయ్య పేర్కొనగా,

"మనసు నిలుపకున్న మరి ముక్తి లేదయా" అని పుణ్యపురుషుడు వేమన ప్రభృతులు ఆత్మశుద్ధికి గల ప్రాధాన్యాన్ని విశదీకరించారు.

తెలుగు తమిళములలో వెలసిన భక్తి సాహిత్యం అపారం. అమృత తుల్యమైన ఆ సాహిత్యాన్ని అలవోకగా పరిశీలించినా, మనస్సు ఆనంద తాండవం చేస్తుంది!

ఇక అన్నమాచార్యులపై ఆళ్వారుల ప్రభావాన్ని రేఖామాత్రంగా పరిశీలిద్దాము.

ఆంధ్ర వైష్ణవుల మతభాష తమిళం అన్నంతగా తెలుగు తమిళ భాషలు వ్యవహరించేవారి మధ్య చుట్టరికం ఏర్పడింది. నిజానికి వైష్ణవుల పరిభాష తిరుశబ్దం చుట్టూ పరిభ్రమిస్తూ వుంటుంది. కాగా పన్నిద్దరాళ్వారులు వెలయించిన పాశురాల సంకలనమూ ద్రావిడ వేదమూ అయిన నాలాయిర దివ్యప్రబంధం వైష్ణవ లోకానికి పరమ పవిత్రమైన పారాయణగ్రంథం కావడంలో ఆశ్చర్యం అణుమాత్రమైనా లేదు. అందులోనూ

వేంకటేశ్వరస్వామివారి భక్తాగ్రేసరుడైన అన్నమయ్య ఆ భక్తకవులు వెలయించిన పాశురాల మాధుర్యానికి లోను కావడంలోనూ ఆశ్చర్యం లేదు. అలా అని 32 వేల సంకీర్తనలు ప్రసాదించిన ఆ పదకవితా పితామహుడి ప్రతిభాసంపత్తిని ప్రశంసించకుండా వుండనూ లేము.

ఆళ్వారుల గీతాలలో సర్వసాధారణంగా కనిపించే శరణాగతి మహత్త్వం, నాయికా నాయకభావం మొదలైనవి అన్నమయ్య సంకీర్తనలలోనూ ప్రముఖంగా చోటు చేసుకున్నాయి. పాశురాలలో నరసింహస్తుతి, వామ నావతార ప్రశస్తి, శకటాసుర భంజనం, కంస వధ, గోవర్ధనోద్ధారణం మొదలైన వాటి ప్రసక్తి తరచుగా కనిపిస్తుంది. అన్నమాచార్యులు కూడా ఈ వివిధ అంశాలను స్పృశించినట్లు నిస్సంశయంగా పేర్కొనవచ్చు. నిజానికి తెలుగులో విశిష్టాద్వైత సిద్ధాంతాలను ప్రతిపాదిస్తూ విశిష్ట రచన చేసిన ప్రతిభాసంపన్నుడు అన్నమయ్య.

శఠకోపనామాంతరం కలిగిన నమ్మాళ్వారుని అయిదవ ఆళ్వారుగా పేర్కొన్నా, వైష్ణవలోకం ఆయన్ని కులపతిగా సర్వప్రథముడిగా సంస్మరి స్తున్నది. ఆయన శరీరమనీ, మిగిలిన ఆళ్వారులు వివిధావయవములనీ విశ్వసిస్తున్నారు కూడా. మన ఆళ్వారుగా వ్యవహృతులైన నంఆళ్వారు ద్రావిడ వేదకర్త కాగా, ఆ వేదసారాన్ని అమృత తుల్యమూ గానానుకూ లమూ అయిన దివ్యరచనగా తెలుగువారికి అందించాడు అన్నమయ్య. ఈ భక్తకవులిద్దరి మధ్య మరికొన్ని సాదృశ్యాలు కూడా లేకపోలేదు. వైశాఖ మాసంలో విశాఖా నక్షత్రంలోనే ప్రభవించిన నమ్మాళ్వారు 16వ యేట ప్రజ్ఞాపూర్ణులై దివ్యప్రబంధ రచన చెయ్యగా, అన్నమయ్య కూడా వైశాఖ మాసంలో విశాఖా నక్షత్రంలోనే జన్మించి 16వ యేట దైవ సాక్షాత్కారం పొంది సంకీర్తన రచన సాగించాడు. వేదాంత దేశికుల సంప్రదాయ ప్రవర్తకులూ అహోబల మఠప్రతిష్ఠాపనాచార్యులూ అయిన ఆదవణ్ శఠకోప మునీశ్వరుల వద్ద విశిష్టాద్వైత రహస్యాలు గ్రహిం చాడు. ఈ విషయాదికం అన్నమయ్య నమ్మాళ్వారు అవతారమేమో అని భావించడానికి దోహదం చేస్తున్నది. అయితే నమ్మాళ్వారు 35 యేళ్ల అల్పాయుష్కుడు; అన్నమయ్య దాదాపు అశీతివత్సరజీవి! నమ్మా ళ్వారువలె అన్నమయ్య కూడా నరస్తుతి వైముఖ్యమునూ భగవన్నుతి

ప్రాశస్త్యమునూ తెలియజేశాడు. యోగ వైరాగ్య శృంగార మార్గాలలో ఆళ్వారులూ అన్నమాచార్యులు గీతాలు ఆలసించినా వారిది ప్రధానంగా భక్త్యావేశం. అందువల్ల వాటిని వింటున్నప్పుడూ చదువుతున్నప్పుడూ మనస్సుకి ఏదో అవ్యక్తమైన సంతోషం కలుగుతుంది.

ఆండాళ్ నామాంతరం కల గోదాదేవి తిరుప్పావైలో 'ఓంగి ఉలగ ళన్ద ఉత్తమన్ పేర్పాడి' అనీ 'అన్ఱివ్వులగ మళన్దాయ్ అడిపోట్రి' అనీ త్రివిక్రముణ్ణి బహుధా ప్రశంసిస్తుంది. అలాగే నమ్మాళ్వార్ తన తిరు వాయ్ మొళి లో 'అన్ఱుజాలం అళ్దపిరాన్పరన్' అని పేర్కొన్నాడు. బ్రహ్మకడిగిన పాదము – అనే సంకీర్తనలో అన్నమాచార్యులు 'చెలగి వసుధ గొలిచిన నీ పాదము, బలి తలమోపిన పాదము' అని ఆళ్వా రుల భావాన్ని వ్యక్తీకరించాడు. 'ఓంగి ఉలగళన్ద' అనే మాటల్ని 'చెలగి వసుధ గొలిచిన' - అని అన్నమయ్య యధాతధంగా అనువదించాడు. ఎత్తుగడ ఒకేవిధంగా వుండడం గమనించదగిన అంశం. బ్రహ్మ కడిగిన పాదం పాటలోని 'కామిని పాపము గడిగిన పాదము', 'పాము తల నిడిన పాదము' మొదలైన చరణాలు చతువుతూవుంటే, ఒక తమిళ వైష్ణవకవి స్వామిపాదాల మహత్వాన్ని ప్రశంసిస్తూ చెప్పిన యీ పద్యం స్ఫురణకు వస్తుంది.

తేడియ అగలిగై శాపం తీర్ద త్తాళ్, నీడియ ఉలగెలాం అళన్ద నీణ్డ తాళ్
ఓడియ శకడిఅ ఉదైత్తు ప్పాంబిన్ మేల్, ఆడియుం శివన్దతాళ్ ఎన్నై
ఆణ్డ తాళ్.

'చెలగి శకటాసురుని జేరి డొల్చితివి' - అని అన్నమయ్య ఒకచోట శకటాసుర భంజనాన్ని ప్రస్తావించాడు.

నమ్మాళ్వారు తన తిరువాయ్మొళి లో ఒకచోట 'కున్ఱుమేన్ది క్కులిర్ మళైకాత్తవన్ ' అని గోవర్ధనోద్ధరణ వృత్తాంతం తెలియజేశాడు. 'కంజన్ వయిట్రిల్ నెరుప్పెన్న నిన్ఱ నెడుమాలే' అని కంసవధను గోదాదేవి ప్రస్తావించింది. సుప్రసిద్ధమైన అన్నమయ్య జోలపాటలో ఈరెండు విషయాలూ చోటు చేసుకున్నాయి. 'గోవర్ధనం బెల్ల గొడుగుగా బట్టి కావరమ్మున నున్న కంసు బడగొట్టి' అని ఆయన పేర్కొన్నాడు.

నారాయణ నామ ప్రభావాన్ని ఆళ్వారులు తమ పాశురాలలో స్పష్టం చేశారు. పెరియ తిరుమొళిలో తిరుమంగై ఆళ్వారు యిలా అన్నాడు.

'కులం తరుం శెల్వం తన్దిడుం, అడియార్ పడు తుయరాయిన ఎల్లాం నిలన్ తరుం సెయ్యుం....

సెల్ గతిక్కు ఉయ్యుమారెణ్ణి నట్రుణై యాగప్పట్రినేన్ అడియేన్, నారాయణా ఎన్నుం నామం'

ఈ పాశురభావాన్ని అన్నమయ్య తెలియజేసినతీరు మనస్సుకి హత్తుకునేలా ఉంది.

'ఆకటివేళల నలపైన వేళలను,
తేకువ హరినామమే దిక్కు మరి లేదు
కొరమాలి ఉన్నవేళ కులము చెడిన వేళ,
చెరవడి వొరులచే జిక్కిన వేళ
వొరపైన హరినామ మొక్కటే గతిగాక,
వేంకటేశు నామమే విడిపించ గతిగాక'

సెల్ గతిక్కు వుయ్యుమారెణ్ణి అన్న పదబంధాన్ని విడిపించ గతి గాక అని అనువదించడం సరసంగా సహృదయరంజకంగా ఉంది.

ఎవరు నిజమైన వైష్ణవులు? అనే అంశం గురించి ఆళ్వారులూ అన్నమయ్యా ఇంచుమించు ఒకే విధమైన అభిప్రాయం తెలియజేశారు. 'వైట్టణవన్ ఎన్నుం వన్మై కండాయే' అని పెరియాళ్వారు పేర్కొనగా, 'పరగిన సత్య సంపన్నుడైనవాడే' హరి నెరిగిన వాడు - అని అన్నమయ్య తెలియజేశాడు. ఇలా ఈ భక్తకవులు సత్య సంధతకు ప్రాధాన్య మిచ్చారు.

వైష్ణవకవుల దృష్టిలో విష్ణు సహస్రనామావళికి ఎంతో ప్రాముఖ్యం ఉంది. 'ఆయిర నామం సొల్లి' మంగళం పాడుదాం, అని పెరియాళ్వారు మంగళాశాసనంలో తిరుప్పల్లాండులో - తెలియ జేశాడు. వేనామాల వెన్నుండా వినుతించ నెంతవాడ - అని అన్నమయ్య పేర్కొన్నాడు.

ఒక అధ్యాత్మ సంకీర్తనలో 'వెదకి కామునికి విషయములకు నే నదివో నా వయసెల్ల నాహివెట్టితిని' అని అన్నమయ్య తన మనోవ్యధను వ్యక్తం చేస్తాడు. ఇదేవిధంగా తిరుమంగై ఆళ్వారు పెరియ తిరుమొళి

లో అంటాడు గదా:

'తెరివైమార్ వురువమే మరువి వ్వామనార్ కండ కనవిలుంప ఘఆదాయ్
ఒళిన్దన, కళిన్దన అన్నాట్కాళ్.'

ఆయనే 'కూడి యిళైయవర్ తమ్మోడు, అవర్ తరుం కలవియే కరుది ఓడినేన్' - అని యువతులతోడి సౌఖ్యం కోరి తాను జీవితం వ్యర్థం చేసుకున్న విషయాన్ని బాధగా స్మరిస్తాడు.

అన్నమాచార్యుని 'యూక్లలై మాడ్లలై రువ్వాలై తిరిగేని'
అనేపాటలోని 'ఒకరి రాజు జేసు నొకరి బంటుగ జేసు, వొకరి కన్నెల వేరొకరికి నమ్మించు... ..' అనే చరణాలు చదువుతూవుంటే ఆండాళ్ వెలయించిన తిరుప్పావైలోని -

'ఒరుత్తి మగనాయ్ ప్పిరన్దు - ఓరిరవిల్ ఒరుత్తి మగనాయ్ ఒళిత్తు వళర'
అనే ప్రసిద్ధ పాశురంలోని చరణాలు స్ఫురణకు రాకపోవు. ఈ చరణాల లోని శైలీ సామ్యం పరిశీలించదగింది.

పెరియాళ్వార్ తెరుమొళి, నమ్మాళ్వార్ తిరువిరుత్తం మొదలైనవి నాయికా విరహాన్ని అభివర్ణించే రచనలు. అలాగే అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో మధురభక్తి అందాలు దిద్దుకుందని చెప్పడం చర్విత చర్వణం. అన్నమయ్యది మధురభక్తి అయితే ఆళ్వారుల రచనల్లోది కాయిక శృంగార స్పర్శ గల యిలాంటి మధురభక్తి అని మాత్రం అనలేము. ఏమైన వ్పటికీ, పర్యాప్తంగా పరిశీలిస్తే, ఆళ్వారులకూ అన్నమయ్యకూ ఎంతో భావసామ్యం ఉన్నట్టు తెలియకపోదు. హరికీర్తనాచార్యులైన ఆ భక్తక వులు తమ భాషలకు చేసిన సేవ ఎంతైనా కొనియాడదగింది. సంగీత సాహిత్య ప్రియులకు వారు పాడినపాటలు తియ్యని తేనె వూటలు!

# 4. తిరుక్కురళ్ తెలుగు సాహిత్యం

మొనమొన్నటి దాక తెలుగు పండితులు ఉభయ భాషా ప్రవీణులు. ఉభయభాషలంటే సంస్కృతాంధ్రములని అర్థం. అలాగే తమిళపండితులలోనూ కొందరు ఉభయ భాషా ప్రవీణులు. రానురాను ఈ ఉభయ భాషా ప్రావీణ్యం తెలుగు తమిళ పండితులలో తక్కువవుతూ వచ్చింది. అయినా తెలుగువారి సంస్కృత భాషా ప్రియత్వం మన దేశంలో ఎవరికీ తీసిపోని విధంగా ఉండడం గమనించదగిన అంశం. తమిళ పండితుల భాషాప్రియత్వం తమ భాషకే పరిమిత మయింది. ఇది కాలం తెచ్చిన మార్పు! కనుక ఒకరిని పరిహసించడమో విమర్శించడమో తగని పని!

ప్రాచీనకాలంలో తెలుగువారు తమిళ భాషాభిజ్ఞులనిగాని, తమిళులు తెలుగు భాషాభిజ్ఞులనిగాని చెప్పడానికి తగిన సాహిత్యాధారాలు లభించక పోవడం మన దురదృష్టం. అయినా పాల్కురికి సోమన, ధూర్జటి వంటి మహాకవులు కొందరికి తమిళభాషా సాహిత్యాలతో పరిచయం ఉన్నట్లు భావించవచ్చు. అలాగే కంబ మహాకవికి తెలుగుదేశం తోను తెలుగుభాషతోను కొంతవరకు పరిచయం ఉన్నట్లు భావించడం సాహసం కాదు. అయినా తులనాత్మక దృష్టితో తెలుగు తమిళ సాహిత్యాలను పరిశీలిస్తే, ఆయా మహాకవులు వెలిబుచ్చిన భావాలలో సామ్యం కానవస్తుంది. ఇందుకు కారణం, ఈషద్భేదాలు కానవచ్చినా మన సంస్కృతి ఇంచుమించు ఒకటే కావడం! సాంస్కృతికంగానే కాక భాషావిషయంగా కూడా తెలుగువారూ తమిళులూ సన్నిహితులన్న విషయం సర్వ విదితం. ఈ దృష్టితో తిరుక్కురళుకీ తెలుగు సాహిత్యానికీ గల భావసామ్యాన్ని పరిశీలించవచ్చు.

తిరుక్కురళ్ ప్రసిద్ధ నీత్యుద్బోధక గ్రంథం. దేనికీ అనువాదం కాదు. స్వతంత్ర రచనగా భావించబడుతున్నా, దానిపై మనుస్మృతి, అర్థ శాస్త్రం, కామందకుని నీతిశాస్త్రం మొదలైన సంస్కృత రచనల ప్రభావం ఉన్నదనీ, తిరుక్కురళ్ కర్త అయిన తిరువళ్లువర్ సంస్కృత భాషాభిజ్ఞుడనీ కొందరు పండితులు విశ్వసిస్తున్నారు. ఏది ఏమైనా, కొండంత భావాన్ని రెండే రెండు పాదాలలో కుదించి చెప్పిన ప్రతిభా సంపన్నుడు

తిరువళ్లువర్. ఆయన రెండువేల యేండ్లకు మునుపు జీవించినట్లుగా తమిళ పండితుల నమ్మకం.

సాధారణంగా నీతులు సార్వకాలికములు, సార్వజనీనములూను. 'నీతియ తొడ వెవ్వారికి' అని సుమతీ శతకకర్త నీతికి గల ప్రాధాన్యాన్ని తెలియజేశాడు. 'నీతి గాని మాట రాతివేటు' అన్నది వేమనార్యుని నిశ్చితాభిప్రాయం. నీతిలేని వాడు కోతికంటే పాడు - అని కూడా ఆ హేతువాది పేర్కొన్నాడు. కాగా నీతి ప్రధానమైన తిరుక్కురళ్ తమిళవేదమనే విఖ్యాతిని ఆర్జించడం ఒక విశేషం కాదు. ఆ గ్రంథం పెక్కు ప్రాచ్య పాశ్చాత్య భాషలలోకి అనూదితం కావడమూ ఒక విశేషం కాదు. తుదకు రష్యన్ భాషలోకి కూడా పరివర్తిత మయింది. అయితే రష్యన్ అనువాదకుడు విధి అనే అధ్యాయాన్ని అనువదించలేదు. ఇలా ఇన్ని భాషలలోకి అనువదించబడిన తమిళ గ్రంథం మరొకటి లేదనడం సత్య సన్నిహితం.

శ్రీయుతులు కనుపర్తి వేంకట రామవిద్యానందనాథులు (1887, 94), చొక్కం నరసింహులు నాయుడు (1892), గరిమెళ్ల సత్యనారాయణ (1926), ముదిగంటి జగ్గన్నశాస్త్రి (1952), పూతలపట్టు శ్రీరాములురెడ్డి (1948), శౌంరి శ్రీపతిశాస్త్రి (1966), చల్లా లక్ష్మీనారాయణశాస్త్రి (1956), చె.రామలింగాచార్య, సాధన వీరాస్వామినాయుడు (1985), యామిజాల పద్మనాభస్వామి, దూతలూరి జగన్నాథం (1986), అన్నే పిచ్చిబాబు, ఆరుద్ర (1989), చల్లా రాధాకృష్ణశర్మ (1989) ప్రభృతులు కురళుని పూర్తిగానో లేక కొన్ని అధ్యాయాలనో తెలుగుచేశారు. తెలుగు అనువాదకులలో పలువురు తమిళ మూలం నుంచే కురళుని అనువదించడం గమనించదగిన అంశం. ఇక సంవాది రచనల్ని పరిశీలిద్దాము.

గృహస్థుని గురించి ముచ్చటిస్తూ వళ్లువర్ ఇలా పేర్కొన్నాడు.

*తుఱన్దార్క్కుం తువ్వాదవర్క్కుం ఇఱన్దార్క్కుం*
*ఇల్ వాళ్వాన్ ఎన్బాన్ తుణై. (42వ కురళు)*
*(యతులకు, దిక్కులేని వారికి, మృతులకు గృహస్థు దిక్కు)*

ఇదే భావాన్ని 15వ శతాబ్దివాడైన అనంతామాత్యుడు భోజరాజీయంలో ఇలా తెలియజేశాడు.

అధిప! పెరయాశ్రమస్థుల కందరకును
విను గృహస్థాశ్రమము వాడె వెలయ నూత. *(2-71)*

బ్రహ్మచర్యం, వానప్రస్థం, సన్న్యాసం - ఈ మూడు ఆశ్రమములలో ఉన్నవారికి గృహస్థాశ్రమంలో ఉన్నవాడే తోడునీడ అవుతున్నాడని తెలుగుకవి పేర్కొన్నాడు. దిక్కులేని వారికి, ముఖ్యంగా భోజన వసతి లేనివారికి - గృహస్థే ఆధారభూతు డవుతున్నాడు. తమిళ కురళుకి కొందరు ఇలా అర్థం చెపుతారు. పేదలకు అన్నం పెట్టాలి; మృతులకు పారలౌకిక క్రియలు నిర్వర్తించాలి; దిక్కులేనివారిని ఆదరించాలి - ఇవి గృహస్థు చేయవలసిన పనులు. ఇల్‌వాళ్వాన్ ఎన్బాన్ తుణై అని వళ్లువర్ చెప్పగా గృహస్థాశ్రమము వాడె వెలయు నూత అని అనంతామాత్యుడు పేర్కొన్నాడు. వీరిద్దరూ ఒకే మోస్తరుగా చెప్పడం గమనించదగింది. తుణై, ఊత సమానార్థకాలు. భావసామ్యంతోపాటు పదసామ్యం కూడా ఉండడం ప్రశంసార్హం. ఆశ్రమాలు నాలుగింటిలోనూ గృహస్థాశ్రమం ఉత్తమమయిందని నన్నయ, పోతన వంటి కవులు కూడా అభిప్రాయపడ్డారు.

సంతానం గురించి చెపుతూ వళ్లువర్

ఈన్ఱపొళిదిన్ పెరిదువక్కుం తన్ మగనై
చ్చాన్ఱోన్ ఎనక్కేట్ట తాయ్ *(69వ కురళు)*

అని అన్నాడు. (తన కుమారుడు ప్రముఖుడని విన్న తర్వాత తల్లికి కలిగే సంతోషం ఇంతా అంతా కాదు. అది అతనిని కన్నప్పుడు కలిగిన సంతోషం కంటే ఎక్కువ.)

ఈ కురళు చదవగానే తెలుగువారికి వెంటనే సుమతీ శతకంలోని యీ ప్రసిద్ధ పద్యం గుర్తుకి వస్తుంది.

పుత్రోత్సాహము తండ్రికి
బుత్రుడు జన్మించినపుడె పుట్టదు, జను లా
పుత్రుని గనుగొని పొగడగ
బుత్రోత్సాహంబు నాడు పొందుర సుమతీ.

భావం ఒక్కటే. తమిళ కవి తల్లి అనగా, తెలుగు కవి తండ్రి అన్నాడు. తల్లికిగాని తండ్రికి గాని పుత్రోత్సాహం వెంటనే కాక ఆ తర్వాత కలుగుతుంది. ఆ పుత్రుడు ప్రముఖుడని విన్న తర్వాతనే కలుగుతుంది. కనుక పుత్రుని పేరుపెంపులు ముఖ్యం.

*తా ననుభవింప నర్థము*
*మానవపతి జేరు గొంత మఱి భూగతమౌ,*
*గానల నీగలు గూర్చిన*
*తేనియ యొరుం జేరునట్లు తిరముగ సుమతీ!*

ఈగలు కూడబెట్టిన తేనె తుదకు ఇతరుల్ని చేరుతుంది. అలాగే లోభి కూడబెట్టిన ధనం రాజునైనా చేరుతుంది, లేదా భూమిలోనైనా కలుస్తుంది. ఈ భావాన్ని మధుర మోహనంగా తెలియజేశాడు ప్రజాకవి వేమన.

*ధనము కూడబెట్టి ధర్మంబు సేయక*
*తాను దినక లెస్స దాచుగాక*
*తేనెటీగ గూర్చి తెరువరి కియ్యదా*
*విశ్వదాభిరామ వినుర వేమ.*

తెలుగుకవులు తేనెటీగ సామ్యంతో లోభివాని ధనార్జనాన్ని నిరసించారు. కష్టపడి తేనెటీగలు కూడబెట్టే తేనె చివరికి ఆ ఈగల కెలా తోడ్పడదో, అలాగే లోభి కూడబెట్టే ధనం ఇతరులకు బహుధా ఉపకరిస్తుంది. తేనెటీగల సామ్యాన్ని మించింది మరొకటి లేదనవచ్చు. ఈ గొప్ప భావాన్ని తిరువళ్ళువర్ తెలియజేశాడు, వ్యర్థసంపద అనే అధ్యాయంలో. ఒక కురళులో (1005) ఆయన అన్నాడు గదా:

కొడుప్పదూ ఉం తుయ్ప్పదూ ఉం ఇల్లార్క్కు అడుక్కియ
కోడి ఉణ్డాయినుం ఇల్.

తాను ఆర్జించిన ధనాన్ని తాను - అనగా లోభి - అనుభవించలేదు. పోనీ ధనమున్నందుకు ఇతరులకు సహాయపడుతూ వుంటాడా అంటే అదీ లేదు. అలాంటి పరమలోభి వద్ద ఎన్ని కోట్ల ధనం ఉండిమాత్రం ఏం లాభం అని ఆ మహనీయుడు ప్రశ్నించాడు. ధన మున్నందుకు,

ఇతరులకు సహాయపడాలన్నది వళ్లువర్ అభిప్రాయం. ఇతరులకు సహాయపడని ధనం వాసన లేని పువ్వు! సాధారణంగా వళ్లువర్ వాక్కు మృదులంగా ఉంటుంది.

విద్యాధనం వినాశం లేనిదని మన తరతరాల నమ్మకం. అనగా విద్య అక్షయం.

కేడిల్ విళు చ్చెల్వం కల్వి ఒరువఱ్కు
మాడల్ల మట్రై యవై (400వ కురళు)
ఒరునికి విద్యయే చెరగని సిరులు;
వెరవి యెల్ల సిరులై వరలవు సుమ్ము.

కాశీఖండంలో శ్రీనాథుడు విద్యాధనమే నిజమైన ధనమనీ, చోరులు తస్కరించే ధనం నిజమైన ధనం కాదనీ స్పష్టం చేశాడు. ఈ పద్యాన్ని పరికించండి.

ఏ భయంబుల నెచ్చోట నెనయలేదు
నరున కెప్పాట విద్యాధనంబ ధనము
చోర బాధాదికము చేతంజూఱవోవు
ధనము ధనమౌనె యెన్నిచందములం దలంప. (4-112)

సుమతీ శతకంలోని యీ క్రింది పద్యం సర్వవిదితం.

వినదగు నెవ్వరు సెప్పిన
వినినంతనె వేగపడక వివరింపందగున్
గని కల్ల నిజముం దెలిసిన
మనుజుండె పో నీతిపరుండు మహిలో సుమతీ!

ఎవ్వరు చెప్పినా, అది వినదగినదే. విన్నవెంటనే ఒక నిర్ణయానికి రాకూడదు. అందులోని సత్యాసత్యములు తెలుసుకున్నవాడే నిజమైన నీతిపరుడని సుమతీ శతకకారుని అభిప్రాయం. వేగిరపాటు కూడదనీ, బాగోగులు విచారించి అసలు విషయం తెలుసుకోవాలనీ ఆయన అభిప్రాయం.

ఈ భావం తిరుక్కురళులో స్పష్టం చేయబడిన వైనం పరిశీలించదగింది. జ్ఞానం (అఱివు ఉడై మై) అనే అధ్యాయంలోని యీ కురళు

ఇలా సాగింది.

*ఎప్పొరుళ్ యార్ యార్ వాయ్‌క్కేట్పినుం అప్పొరుళ్*
*మెయ్‌ప్పొరుళ్ కాణ్బదఱివు (423వ కురళు)*

(ఏ విషయం ఎవరి నోట విన్నా, దానిలోని నిజతత్వం తెలుసుకోవడమే జ్ఞాన మవుతుంది)

యార్ యార్ వాయ్‌క్కేట్పినుం, వినదగు నెవ్వరు సెప్పిన - అన్న యీ పదబంధాలు ఒకేవిధంగా ఉండడం పేర్కొనదగిన విషయం. ఎవ్వరు అనేమాటను ఎవరెవరు (యార్ యార్) అని తమిళకవి తెలియజేశాడు. అలా తెలుసుకున్న వాడే నీతిపరుడని తెలుగుకవి చెప్పగా, తమిళ కవి అలా తెలుసుకోవడమే జ్ఞానమని పేర్కొన్నాడు. సత్యాసత్యములు తెలుసుకున్నవాడే జ్ఞాని లేక నీతిపరు డవుతున్నాడు. అందుకు విన్నది విన్నట్లే గ్రహించడం పనికిరాదు. విచారించి (అరసి) నిజం తెలుసుకోవాలి.

ఇన్నా చెయ్యామై (హాని తలపెట్టమి) అనే అధ్యాయంలోని యీక్రింది కురళు పరిశీలనార్హం.

*ఇన్నా ఎనత్తాన్ ఉణర్‌న్దవై తున్నామై*
*వేణ్డుం పిఱన్ కణ్ సెయల్ (316)*

మంచివి కావని (బాధను కలిగించేవని) తాను తెలుసుకున్న పిదప, వాటిని ఇతరులకు చెయ్యకుండా ఉండడం చాలా మంచిది. ఈ భావాన్ని తిక్కన్న వివరించిన తీరు తెలుగువారికి తెలియంది కాదు.

*ఒరు లేయవి యొనరించిన*
*నరవర! యప్రియము తన మనంబునకగు, దా*
*నొరులకు నవి సేయకునికి*
*పరాయణము పరమధర్మ పథముల కెల్లన్.*

తనకు అప్రియములుగా తోచిన పనులను ఇతరులకు చెయ్యకుండా వుండడమే సర్వోన్నతమైన ధర్మమని మహాభారతం స్పష్టం చేసింది. కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు ఈ పద్యాన్ని తమ పత్రికకు ఆదర్శంగా గ్రహించడం గమనించదగిన విషయం. తనకు బాధాకరంగా

తోచే పని ఇతరులకు కూడా బాధాకరంగా కనిపిస్తుందని భావించడం ధర్మ మవుతుంది.

తెలుగు తమిళ కవుల దృష్టిలో పేదరికాన్ని మించిన పేదరికం మరొ కటి లేదు. వేమన దృక్పథంలో అది దావానల సమానం.

ధనములేమి యనెడి దావానలం బది
తన్ను చెరచు దాపువాని చెరచు
ధనము లేమి చూడ తలవనే పాపంబు-

అని దారిద్ర్య దుఃఖాన్ని లెస్సగా వివరించాడు. తలచుకోడానికే దారిద్ర్యం పాపమని ఆయన అభిప్రాయం. అది తనను తనపొరుగున ఉన్న వానిని చెరుస్తుంది. సంపాదన లేని (లేమి ననుభవించే) భర్తను చూసి భార్య నడపీనుగు వస్తున్నాడని భావిస్తుందని సుమతీ శతకకర్త అభిప్రాయం. అనగా దారిద్ర్యం గౌరవ నాశనానికి దారి తీస్తుంది.

ఇన్మైయిన్ ఇన్నాదదు యాదెనిన్ ఇన్మైయిన్
ఇన్మైయే ఇన్నాదదు - అని తిరువళ్ళువర్ పేర్కొన్నాడు. అనగా
లేమి వంటి యిడుమ ఏమి కలదన,
లేమి వంటి యిడుమ లేమియే యగును.

తిరువళ్లువరు వంటి ప్రతిభా సంపన్నునికి వేరే ఉపమ దొరకలేదు. పేదరికం వలె దుఃఖకర మయింది పేదరికమే అని ఆయన అభిప్రాయం. దారిద్ర్యమనే పాపి కనుక దరి జేరితే, ఇహపర సౌఖ్యాలు కూడా నశిస్తాయని ఆయన పేర్కొన్నాడు.

కోపం మంచి లక్షణం కాదని కవులు చాలామంది తెలియజేశారు. తనకోపమె తన శత్రువు, తన శాంతమె తనకు రక్ష అని సుమతీ శతక కర్త కోపమే మానవుని శత్రువని వ్యక్తం చేశాడు. స్వర్గ నరకాలు రెండూ తన మనోభావాలలోనే ఉన్నాయన్న గొప్పవిషయం ఆయన తెలియజేశాడు.

కోపముననుఘనత కొంచెమై పోవును
కోపముననుమిగుల గోడు చెందు
కోప మడచెనేని కోరిక లీడేరు
విశ్వదాభిరామ వినురవేమ.

కోపం వల్ల గడించిన ఘనత కొంచెమై పోతుందనీ, కోపాన్ని కనుక తగ్గించుకుంటే కోరికలు సైతం ఈడేరగలవనీ వేమన్న తెలియజేశాడు. కోపం వల్ల నాశనం తప్పదని ఆయన అభిప్రాయం. వళ్లువర్ కూడా అలాంటి భావాన్నే వ్యక్తం చేశాడు. తన్ను తాను కాపాడుకోవాలని అభిలషిస్తే, మొట్టమొదట కోపంనుంచి తనను కాపాడుకోవాలి. లేకపోతే ఆ కోపమే తన మరణానికి కారణ భూతమవుతుందని తిరువళ్లువర్ పేర్కొన్నాడు.

తన్నైత్తాన్ కాక్కిన్ సినం గాక్క; కావాక్కాల్
తన్నైయే కొల్లుం సినం (*305*వ కురళ్)
(తను దాను కాపాడుకొనగ నణచుము
కినుక, లేదేని చంపును కిన్క తనను.)

శత్రువుని కనికరించుటయే అతని కది తగిన శిక్ష అవుతుందని తెలుగు తమిళ కవులు భావించడం గమనించదగిన మరొక అంశం.

ఇన్నా చెయ్యామై (హాని తలపెట్టమి) అనే అధ్యాయంలో తిరువళ్లువర్, హాని చేసినవారి యెడల దయ చూపి వారు సిగ్గుపడేలా వారికి మేలు చెయ్యడమే వారికి తగిన శిక్ష అని ఉద్బోధించాడు.

ఇన్నా సెయ్దారై ఒఱుత్తల్ అవర్ నాణ
నన్నయం సెయ్దు విడల్ (*314*వ కురళు)
(ఎగ్గు చేసినవారు సిగ్గు చెందంగ
లగ్గు చేయుటె వారి కగ్గమౌ శిక్ష)

వేమన కూడా సరిగ్గా ఇదే భావాన్ని వ్యక్తం చెయ్యడం పరిశీలనార్హం.

చంపదగిన యట్టి శత్రువు తన చేత
చిక్కెనేని కీడు సేయరాదు
పొసగ మేలు చేసి పొమ్మనుటే చాలు (వు)

క్షమార్హుడు కాని శత్రువు చేజిక్కినా, అతనికి కూడా హాని చెయ్యరాదు; అతనికి మేలు చెయ్యడమే అతనికి విధించదగిన శిక్ష. నన్నయం అంటే మంచి ఉపకారమని అర్థం. వేమన్న మేలు అన్నాడు. హానికి హాని కాదు మందు. ఇలా ఈ కవులిద్దరూ తమ పెద్దమనస్సుని తెలియజేశారు.

సుమతీ శతకకర్త కూడా అపకారికి ఉపకారం చెయ్యడమే మంచిదనే భావాన్ని స్పష్టం చేశాడు. ఉపకారికి ఉపకారం చెయ్యడం ఒక గొప్ప కాదు; అందులో విశేష మేమీ లేదు. కాని అపకారికి ఉపకారం చేసేవాడే, అందులోనూ నెపం ఎన్నకుండా (దోషం పరికించకుండా) మంచి చేసేవాడే నేర్పరి అవుతాడని ఆయన ఖచ్చితంగా పేర్కొన్నాడు.

తిరుక్కురళులో అక్కడక్కడ వివాదగ్రస్తములైన కొన్ని అభిప్రాయా లున్నట్లు ఆధునిక విమర్శకులు కొందరు భావిస్తున్నారు. బహు ప్రాచీనకాలంలో సంతరించబడిన ఒక రచనలో అలాంటి భావాలు కొన్ని వివాదగ్రస్తములు కావడంలో ఆశ్చర్యం లేదు. కురళు రచనాకాలం క్రీస్తుకు పూర్వమని కొందరు చెప్పగా, మరికొందరు క్రీస్తుశకం తొలి మూడు శతాబ్దులని పేర్కొన్నారు. వివాదానికి పాల్పడిన కురళులలో ఒకటి ఈ క్రిందిది.

దెయ్వన్ తొళా అళ్ కొళువన్ తొళుదు ఎళువాళ్
పెయ్యెన పెయ్యుం మళై *(55వ కురళు)*
*(పర దైవముల వీడి పతిగొల్చు చాన*
*కురియు మన్నంతనే కురియదే వాన)*

పాతివ్రత్య ప్రభావాన్ని వివరించేందుకు ఈ కురళు పేర్కొనబడింది. పరదైవములను గాక పతి దైవమును కొలిచే స్త్రీ - అన్న భావం సరికాదని ఆధునిక విమర్శకులు కొందరి అభిప్రాయం. దీనికి వారు మరో అర్థం చెపుతారు.

ఈ భావాన్ని పోతన యిలా అభివ్యక్తం చేశాడు.

ఉపవాసంబులు వ్రతములు
దపములు వేయేల? భర్త దైవత మని ని
ష్కపటత గొల్చిన సాధ్వికి

నృపవర! దుర్లభము లేదు నిఖిల జగములన్.
(ఆంధ్ర మహాభాగవతం 7-418)

పరదైవములని తమిళ కవి అన్నాడు. భర్తను కొలిచే పడతికి ఉప వాసాదులు ఎందుకు అని ప్రశ్నించాడు పోతన. అలాంటి స్త్రీకి దుర్లభమున్నది లేదని పోతన చెప్పగా, పతివ్రత కనక కురవాలి అంటే వాన కూడా కురుస్తుందని వళ్లువర్ పేర్కొన్నాడు. సంగ్రహంగా చెప్పిన విషయాన్ని తెలుగుకవి కొంచెం విపులీకరించాడు.

అహింసను గురించి ప్రస్తావిస్తూ తిరువళ్లువర్ అన్ని మంచి గుణాల లోనూ అహింసయే మంచిదని అన్నాడు.

ఒన్రాగ నల్లదు కొల్లామై; మదట్రున్
పిన్ సారప్పొయ్యామై నన్రు. (323 వకురళు)
(చాల మంచిది అహింసయే; ఆటు పిదప
చాల మంచిదగును సత్యభాషణము)

సత్యభాషణం కూడా అహింసకు తర్వాతిదే అని ఆయన అభి ప్రాయం. వదాన్యత, సత్కర్మాచరణం, సత్య సంధత, అహింస - ఈ విశిష్ట గుణాలు సమానములే అయినా, అహింస సర్వశ్రేష్ఠ మయిం దని నన్నయ అభిప్రాయం. తిక్కన, ఎర్రనలు కూడా అహింసయే మిన్న అని పేర్కొన్నారు. ఆదికవి నన్నయార్యుని యీక్రింది పద్యం పరిశీలించదగింది.

దానంబును బ్రియంబు చేతయును
సత్యంబును నహింసయు నను నివి
నాలుగును సమానంబులయినను
నహింసయు విశేషంబు (అరణ్య, 4-290)

తిరువళ్లువర్ తిక్కనలు పరుషంగా మాటలాడడం మంచిది కాదని ఉద్బోధించారు.

తీయినాల్ సుట్టపుణ్ ఉళ్లారుం; ఆరాదే
నావినాల్ సుట్టవడు (129వ కురళు)
నిప్పువల్ల ఏర్పడిన పుండు లేక గాయం సులభంగా మానిపోతుంది.

కాని నాలుకవల్ల ఏర్పడిన పుండు ఎన్నటికీ మానదని యీ కురళులోని భావం. దేహాన్ని చొచ్చుకుని వెళ్లే బాణాల్ని పైకి తియ్యవచ్చు; కాని హృదయాన్ని చీల్చుకుని వెళ్లే పరుషోక్తుల్ని పెకలించడం సులభం కాదని తిక్కన మనోహరంగా పేర్కొన్నాడు. నుడువకుమీ యొరుల మనసు నొవ్వగ సుమతీ - అని సుమతీ శతక కారుడు లెస్సగా పేర్కొన్నాడు. ఇక తిక్కనగారి పద్యం పరికిద్దాము.

పలుకులం జెడ దునిసిన కార్యంబు
నిగుడ నేరదు పిదప నెట్టు
తనువున విఱిగిన యమ్ముల
ననువునఁ బుచ్చంగ వచ్చు నతి నిష్ఠురతన్
మనమున నాఁటిన మాటలు
విను మెన్ని యుపాయములను వెడలునె?...... (ఉద్యో, 2-616)

తన అవయవాలను ముడుచుకొని ప్రవర్తించే తాబేలులా, మానవుడు తన పంచేంద్రియాలను అదుపులో ఉంచు కోవాలని మనకవులు ఉద్బోధించారు. తిక్కన ఎర్రనలు కూర్మం వలె సంచరించే మానవుడు ఆనందం పొందగలడని భావించారు. అనగా ఇంద్రియ నిగ్రహం వల్ల ఆనంద ప్రాప్తి అవుతుందని భావం. వళ్లువర్ అన్నమాట లివి.

ఒరుమైయుళ్ ఆమైపోల్ ఐన్దడక్కల్ ఆట్రిన్
ఎళుమైయుం ఏమాప్పుడైత్తు. (126వ కురళు)

ఒక్క జన్మలో కనక ఇంద్రియ నిగ్రహం పాటించ గలిగిన మానవుడికి తరువాతి జన్మలలో కూడా అతనికి సౌఖ్యం కలుగుతుందని వళ్లువర్ అభిప్రాయం. ఎళుమైయుం అనడం వల్ల, ఏడవ జన్మలో కూడా అతడు సుఖించగలడని ఆయన తెలియజేశాడు.

ఆత్మశుద్ధికి గల ప్రాధాన్యాన్ని వేమన చాలా పద్యాలలో చక్కగా వ్యక్తం చేశాడు. నిజం చెప్పాలంటే, చిత్తనైర్మల్యాన్ని మించినది మరొకటి లేదు. కడమ గుణాలన్నీ దానికి లోకువే.

ఆత్మ శుద్ధిలేని ఆచార మది యేల
భాండశుద్ధిలేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజ లేలరా

అన్న వేమన్న పద్యం నలుగురికీ తెలిసిందే. మాలిన్యరహితమైన మనస్సు వాంఛనీయమని తిరువళ్లువరు సంభావించాడు. చిత్తశుద్ధి కనుక లోపించి మిగిలినవి ఉంటే, అవి అన్నీ వట్టి ఆడంబరములని ఆయన పేర్కొన్నాడు.

మనత్తుక్కణ్ మాసిలన్ ఆదల్; అనైత్తు అఱన్
ఆకుల నీర పిఱ.
(మనసున చేర్పకు మలినత, ధర్మ
మనగా అదియె; వెర ఆడంబరమ్ము)

చిత్తశుద్ధియే ధర్మ మని ఆయన అభిప్రాయం.

తిరుక్కురళులో ధర్మార్థ కామములను గురించి పెక్కు విషయాలు తెలుపబడినవి. అర్థ ఖండంలో పాలకులకు సంబంధించిన అంశాలెన్నో వివరించబడ్డాయి. అర్థశాస్త్రం రచించిన చాణక్యునివలె, వళ్లువరు కూడా రాజు సప్తాంగయుతుడై ఉండాలని ఉద్బోధించాడు. స్వామ్యమాత్య జన పద దుర్గకోశ దండమిత్రాణి - రాజుకి ఆవశ్యకాలు. ఈ భావాన్ని వళ్లువరు ఇలా తెలియజేశాడు:

పడై, కుడి, కూళమైచ్చు, నట్పరణాఱు
ముడై యాన్ అరశరుళ్ ఏఱు (381వ కురళు)

బలము (సైన్యం), ప్రజలు, ధనం, మిత్రులు, సచివులు, దుర్గం అనే ఈ ఆరంగములు గలవాడు రాజులలో పురుషసింహం వంటివాడని తిరువళ్లువర్ అభిప్రాయం. రాజుని ఒక అంగంగా పేర్కొనక, రాజుకి ఈ ఆరూ ఉండాలని ఆయన పేర్కొన్నాడు.

ఆంధ్రభోజుడైన శ్రీకృష్ణదేవరాయలవారు
స్వామ్యమాత్య సుహృత్కోశ జన పదబల
దుర్గములు స్వామి గలిగినఁ దొలుతఁ గలవు;
అంగి సుఖియైన నంగంబు లటకు మును వె
చాల సుఖు లౌట మనకు దృష్టంబు గాదె.

అంగి సుఖంగా ఉంటే అంగాలు కూడా సుఖంగా ఉంటాయి. చక్కని భావం!

తిరుక్కురళునీ తెలుగు సాహిత్యాన్నీ - ముఖ్యంగా నీత్యుద్బోధక గ్రంథా

లను - పర్యాప్తంగా పరిశీలిస్తే, మహాకవులు ఏ ప్రాంతం వారైనా ఏ భాషవారైనా వారి మనోభావాలు ఇంచుమించు ఒకేవిధంగా ఉంటాయని స్పష్ట మవుతుంది. అందులోనూ సాంస్కృతికంగా భారతీయులు ఒక్క మూసలోనివారు కావడం వల్ల, భారతీయ కవుల భావాలలో సామ్యం కనిపించడంలో ఆశ్చర్యం లేదు.

**ఉపసంహారంగా ఒకమాట:**

తిరుక్కురళ్ వంటి ప్రశస్త నీతిగ్రంథ ప్రభావం తెలుగు సాహిత్యం మీద లేదని చెప్పడం సముచితం. ఆ గ్రంథానువాదకులు ఆధునికులే కాని ప్రాచీనులు కారు. చల్లా లక్ష్మీనారాయణశాస్త్రిగారు కురళును బహుధా ప్రశంసించిన వారిలో ఒకరు. ఒక ప్రాచీన తమిళ కవి తిరుక్కురళును కొనియాడిన వైనాన్ని ఆయన యిలా వ్యక్తం చేశారు.

త్రవ్వివ కొలంది చెలమ నేర్పడిన నీర
మట్లు, చదివిన కొలది భావైకరాశి
నలరు భవదీయ సత్కవితామృతాప్తిం
బారమే లేదు రసిక ప్రపంచమునకు.

నీతి ప్రధానమైన ఆ రచన శాస్త్రిగారిని ఎంతగానో ఆకర్షించింది.

ఊరుణి నీర్ నిఱైన్దఱ్ఱే ఉలగవాం
పేరఱివాళన్ తిరు - అనే కురళు ఆయన్ని ఆకట్టుకుంది.

(ఊరి చెరువు నిండియుండుట గాదె
ఊరి మేలును కోరు నుచితజ్ఞు ధనము)

ఊరి చెరువు నలుగురికీ ఉపయోగపడుతున్నట్లుగా, వివేకంగల వాని ధనం నలుగురికీ ఉపయోగపడుతుందని తిరువళ్లువర్ భావించాడు. ఈ మధుర భావాన్ని తమ ఆణిముత్యాలు అనే శతకంలో (1953) శాస్త్రిగారు ఇలా వ్యక్తీకరించారు.

తన సర్వస్వము జీవన మ్మొరులకున్ దానమ్ముగా నిచ్చి స
జ్జను డెల్లప్పుడు భంగపాటు గనకే సంతోషియై యుండుగా,
జనముల్ నల్దెసలన్ గృహస్థులయి నిచ్చల్ తన్ను సేవింప జీ
వన మర్పించు తటాక మొప్పదొకొ? భాస్వత్కీర్తి రాధేశ్వరా!

# 5. తెలుగు తమిళనాడులలో శైవం

## భక్త్యుద్యమం:

భక్తిభావం బహు ప్రాచీన మయింది. భగవంతుడు భక్తవత్సలుడనీ, భక్తుల పాలిటి కొంగు బంగారమనీ మన నమ్మకం. ఇది ఈ నాటిది కాదు; తరతరాలుగా వస్తున్న నమ్మకం.

భక్తియే ప్రాతిపదికగా, భక్తియే జీవనాడిగా ఒక ఉద్యమం తమిళనాడులో క్రీస్తుశకం 7-12 శతాబ్దుల మధ్య వెలుగులోకి వచ్చింది (కొందరు 5-9 శతాబ్దుల మధ్య అని భావించారు.) దీన్ని భక్త్యుద్యమమని వ్యవహరిస్తారు. దీనికి నాయకత్వం వహించినవారు నాయన్మారులూ, ఆళ్వారులూను. నాయన్మారులు శివ భక్తులైతే, ఆళ్వారులు విష్ణుభక్తులు. నాయన్మారులు అరవై ముగ్గురున్నారు. ఆళ్వారులు పన్నిద్దరు. వీరు వివిధ ప్రాంతాలకూ, విభిన్న వర్ణాలకూ చెందినవారు. వీరిలో కొందరు నిమ్న జాతులవారు కూడా ఉండడం గమనించదగిన అంశం. ఈ ఉద్యమం బలం పుంజుకునేకొద్దీ అంతవరకు బహుళ ప్రచారంలో ఉన్న జైన బౌద్ధాలు తెరమరుగుకి వెళ్లసాగాయి.

భక్త్యుద్యమ నాయకులు కుల నిరసన కావించిన విశాల హృదయులు. అందువల్ల వివిధ కులాలవారు ఒకవేదిక మీదికి రాగలిగారు. ఇదొక్కటే కాదు ఈ ఉద్యమం సాధించిన ఘనవిజయం. మతవ్యాప్తికి దేశభాష కూడా ప్రబలసాధన మనే సత్యాన్ని ఈ ఉద్యమం స్పష్టం చేసింది. నాయన్మారులలో ఆళ్వారులలో చాలా మంది వట్టి భక్తులే కాదు; కవులు కూడా. కాగా ఆ భక్తకవులు తమిళంలో గీతరచన చేశారు. గీతం గానానుకూల మయింది. అందువల్ల ఆ భక్తిగీతాలు పండితపామర రంజకాలై అనాయాసంగా ప్రచుర ప్రచారం గడించాయి.

ఆ మహోద్యమం వ్యాప్తిలోకి వచ్చేకొద్దీ భక్తుణ్ణే భగవంతుని కన్న మిన్నగా భావించడం జరిగింది. సంఘంలో భక్తుడికి ప్రాధాన్యం లభించింది. భక్తుల పాదోదకం పరమ పవిత్ర మైనదనే భావం ప్రచారంలోకి వచ్చింది. బహుభాషాభిజ్ఞుడైన పాల్కురికి సోమనాధుని మాటలలోనే ఈ

విషయం తెలుసుకుందాము.

"సకలేశు భర్తుల చరణోదకంబు
సకల తీర్థములకు జనయిత్రి యనియు
పలు తీర్థముల గ్రుంగబరచుటకంటె
నిల భక్త పాదాంబువులు గొనుటురవు"
(పండితారాధ్య చరిత్రము)

ఈ విషయాన్నే యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకంలో మరింత స్పష్టంగా పేర్కొన్నాడు. 'పలు తీర్థంబుల గ్రుంకు కంటె మహిలో భక్తాంఘ్రి పానీయముల్ తలమీదం జిలికించుకోదగును....' తీర్థ స్నానం వల్ల కలిగే ఫలం అత్యల్ప మనీ భక్తపాదాంబువులు శాశ్వత భుక్తిముక్తిఫలదమనీ విశదీకరించాడు.

పాల్కురికి సోమనాథుడు అరవైముగ్గురు నాయన్మారుల ఉనికినే కాక వారిని గురించి సంగ్రహంగా నైనా తెలుగువారికి ఓం ప్రథమంగా తెలియజేసిన పుణ్యాత్ముడు. ఆ మహాకవి ప్రసాదించిన బసవపురాణ పండితారాధ్య చరిత్రలు ' తప్పక పరిశీలించవలసిన ఉద్గ్రంధాలు.

## తమిళశైవ సాహిత్యం:

తమిళ శైవ కవులు సృష్టించిన- సాహిత్యం స్తోత్రమనీ, శాస్త్రమనీ ద్వివిధం. శైవ సిద్ధాంత తత్త్వానికి స్తోత్రవాఙ్మయం పెట్టనికోట! ఈ భక్తి గీతాలు గంభీర భావబంధురాలు. భక్తకవులు వెలయించిన గీతాలను నంబి ఆండార్ నంబి అనే ఒక అర్చకుడు (10వ శతాబ్ది) సేకరించి, కొన్ని భాగాలు చేశాడు. వీటిని తిరుమురై (తిరుముఱై) అని వ్యవహరిస్తారు. మొదటి తిరుమురై, రెండవ తిరుమురై, మూడవ తిరుమురై అని వ్యవహరించడం సంప్రదాయం. మురై అనే మాటకు విభిన్నార్థాలు వాడుకలో ఉన్నా, మహత్వం, ప్రార్థన అనే అర్థాలు ప్రధానమైనవిగా భావించవచ్చు. పవిత్రము అనే అర్థంలో తిరు శబ్దం ప్రయుక్తం.

తిరుజ్ఞాన సంబంధుడు చెప్పిన గీతాలు మొదటి మూడు తిరుమురైలలో అందాలు దిద్దుకున్నాయి. ఆయన్ని సంబంధుడనీ వ్యవహరిస్తారు. 7వ శతాబ్దిలో జీవించాడు. భగవదనుగ్రహంవల్ల బాల్యంలోనే ఆయన

కవిత చెప్పినట్లు ఐతిహ్యం. చాలా ప్రతిభ గలవాడు. ఆయన ప్రతిభా విశేషాలు తెలుసుకుని మధురను పరిపాలించే గూనిపాండ్యుని పట్టమహిషి ఆయన్ని మధురకు పిలిపించింది. జైన మతావలంబకుడైన రాజుని ఆయన శాస్త్రచర్చలో ఓడించి, రాజుని శైవునిగా చేశాడు.

7వ శతాబ్దిలో వర్ధిల్లిన తిరునావుక్కరశర్ సంతరించిన గీతాలు నాలుగవ, అయిదవ, ఆరవ తిరుమురైలలో చోటు చేసుకున్నాయి. మొదట్లో ఆయన శైవుడు. తర్వాత జైనుడై, ఆ తర్వాత శైవం స్వీకరించాడు. ఆయన ప్రోద్బలంతో అప్పటి పల్లవ భూపతి అయిన మొదటి మహేంద్రవర్మ కూడా శైవు డయ్యాడు. ఆయన సంగీత ప్రియుడు. మత సహనం లోపించిన జైనులు ఆయన్ని ఆవంలో ఉంచారట! అప్పుడా భక్తశిఖామణి యీ క్రింది గీతం ఆలపించాడు.

"నవ్య మోహన మధుర వీణా నినాద
మధురిమము వోలె, చల్లని మందమారు
తము విభాతి, ప్రశాంత సంధ్యా సుధాంశు
కిరణముల రీతి, పంకజాకరము మాడ్కి
లలిత వాసంతికాశోభవలె చెలంగు
పావనములైన నా తండ్రి పరమశివుని
చరణ కమలంబు లతి మనోహరము, లతుల
శీతలమ్ము, లశేష సంప్రీతిదములు"

మరొక ప్రసిద్ధ భక్తకవి సుందరమూర్తి వెలయించిన గీతాలు ఏడవ తిరుమురైలో చేర్చబడ్డాయి. 9 వ శతాబ్దిలో జీవించిన ఆయన్ని సుంద రుడనీ వ్యవహరిస్తారు. ఈ యేడు తిరుమురైలను సమిష్టిగా తేవారం అంటారు. తేవారాన్ని తమిళ వేద మని భక్తిపురస్సరంగా కొనియాడు తారు. శైవులకిది ప్రీతిపాత్రమైనదే కాక పారాయణగ్రంథం కూడా!

శైవ సమయాచార్యులలో ఒకడైన సుందరుడు దక్షిణార్కాడు జిల్లాలో ప్రభవించాడు. ఆయన కాలంలో మతసంఘర్షణలు తగ్గడం వల్ల కాబోలు, ఆయన గీతాలలో పరమత ఖండనం అంతగా కనిపించదు. సంబంధుడు, తిరునావుక్కరసు, సుందరుడు - ఈ భక్త కవిత్రయాన్ని మూవర్ (ముగ్గురు) అని సగౌరవంగా వ్యవహరించడం సంప్రదాయం.

ఎనిమిదవ తిరుమురైని సంతరించిన భక్తకవి మాణిక్క(క్య)వాచకర్. ఆయన కాలం గురించి అభిప్రాయ భేదములున్నా, ఆ భక్తకవి 8వ శతాబ్దిలో జీవించినట్లు చెప్పవచ్చు. ఆయన అరవైముగ్గురు నాయన్మారు లలో ఒకడు కాకపోయినప్పటికీ, శైవులకు ఆయన పరమాచార్యు డనడం సముచితం. ఆయన అసలు పేరు వాదవూరర్. ఆయన్ని గురించి రుచిక రములైన కథలు నేటికీ ప్రచారంలో ఉన్నాయి. దేశికవితా శాఖకు చెందిన అమ్మానై ( అచ్చనగాయలు ఆడేటప్పుడు స్త్రీలు పాడే పాట) తెళ్ళేణం (గొబ్బిపాట) మొదలైన వాటిలోనూ ఆయన గీతరచన చేశాడు. ఆయన వెలయించిన ఎనిమిదవ తిరుమురైలో తిరువాచకం, తిరుక్కోవైయార్ అనే రెండు కృతులు ఇమిడివున్నాయి.

సంబంధుడు, తిరునావుక్కరసు, సుందరుడు, మాణిక్యవాచకుడు - ఈ భక్తకవులు నలుగురినీ 'నాల్వర్' (నలుగురు) అని వ్యవహరించడం తమిళుల సంప్రదాయం. అనగా శివభక్తులలో ఈ నలుగురు అతిము ఖ్యులని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు.

తొమ్మిదిమంది భక్తులు చెప్పిన గీతాల సంకలనమే తొమ్మిదవ తిరు మురై. దీనికి తిరువచైప్పా తిరుప్పల్లాండు అనే నామాంతరం ఉన్నది.

పదవ తిరుమురైని తిరుమందిరం (తిరుమంత్రం) అంటారు. దీన్ని సంతరించిన భక్తకవి తిరుమూలర్. 6వ శతాబ్దివాడని భావిస్తున్నారు. ఆయనది ప్రధానంగా మర్మకవిత. శైవ సిద్ధాంతానికి సంబంధించిన తాత్త్వికరహస్యాలు కూడా తిరుమంత్రంలో చోటు చేసుకోవడం పేర్కొ నదగిన అంశం.

ద్వాదశ భక్తకవుల గీత సంకలనం పదకొండప తిరుమురై. ఆ కవులలో కారైక్కాల్ అమ్మైయార్ ( అమ్మగారు) వంటి విదుషియు, నంబి ఆండార్ నంబి ప్రభృతులున్నారు.

తిరుత్తొండర్ పురాణం (శ్రీభక్తచరితం) అనే నామాంతరం గల పెరియపురాణం (పెద్దపురాణం) పన్నెండవ తిరుమురై. తమిళ వేద విఖ్యాతిని అర్జించిన ఈ ఉద్గ్రంథాన్ని సేక్కిళార్ అనే విద్వత్కవి వెలయించాడు. రెండవ కులోత్తుంగుని కాలంలో (1133-50) జీవిం

చినవాడు. శైవ వాఙ్మయంలో ఈ గ్రంథానికి గల ప్రాముఖ్యం నిరుపమానం. అరవై ముగ్గురు నాయన్మారుల కథలు ఈ కృతిలో సవివరంగా అభివర్ణించబడ్డాయి. పెరియపురాణంలో పేర్కొనబడిన భక్తులు చాలామంది పాల్కురికి సోమనాథుని బసవపురాణ పండితారాధ్య చరిత్రలలోనూ, హరిహరుని కన్నడ కృతి ఆయన 'పురాతన రగళెగళు' లోనూ కనిపిస్తారు. అయితే సోమనాథుని కథనానికీ సేక్కిళారు కథనానికీ భేదం లేకపోలేదు. సుందరమూర్తి చెప్పిన తిరుత్తొండత్తొగైనీ, నంబి ఆండార్ నంబి వెలయించిన తిరుత్తొండర్ తిరువంతాదినీ ఆధారంగా చేసుకునీ సేక్కిళారు తన కృతిని సంతరించాడు.

ఇంతకుముందు పేర్కొన్నట్లుగా, తొలి ఎనిమిది తిరుమురైలు చెప్పిన ఆ నలుగురు భక్తులను (నాల్వర్) సమయాచార్యులనీ, సమయకురవర్ అనీ శైవలోకం భావించి గౌరవిస్తున్నది. సమయాచార్యులంటే మతాచార్యులని అర్థం. ఈ ఆచార్యులు తమిళనాడులో మెట్టని శివాలయం లేదు; కీర్తించని క్షేత్రం లేదు - అని చెప్పినా, అది అతిశయోక్తి కాదు. వారు తెలుగుదేశంలోని శ్రీకాళహస్తి, శ్రీశైలం క్షేత్రాలను కూడా సందర్శించారు; కీర్తించారు. అలా వారు సందర్శించిన క్షేత్రాలను 'తిరుమురై తలంగళ్' అని పేర్కొంటారు. ఇక్కడ తిరుమురై అనగా తేవారమని అర్థం. కనుక తేవారంలో కీర్తించబడిన పుణ్య స్థలాలని అర్థం.

సర్వవ్యాపకుడైన ఈశ్వరుడు లేని చోటు లేదని మన తరతరాల విశ్వాసం. ఆలయంలోని విగ్రహం ( మూర్తి) లోనే కాక, ఆ ఆలయం నెలకొన్న చోటును (స్థలం), అక్కడ ఉండే నీటిలోనూ (తీర్థం) ఈశ్వరుడు ఉన్నాడు. 'శాస్త్రోక్తంగా మూర్తిని, స్థలాన్ని, తీర్థాన్ని సేవించే వ్యక్తి గురు కటాక్షానికి పాత్రుడు కాగలడు' అని 17వ శతాబ్దిలో జీవించిన తాయుమానవర్ అనే ప్రసిద్ధ భక్తకవి పేర్కొన్నాడు. కనుక క్షేత్రాటనం అవసరమే కాక వాంఛనీయం కూడా.

**స్థల పురాణాలు:**

తిరుమురైలు ప్రచారంలోకి వచ్చిన తర్వాత, కాలక్రమాన స్థల పురాణాలు కూడా వెలువడ్డాయి. ఆయా క్షేత్రాలకు సంబంధించిన చరిత్ర

కథలు మొదలైన వాటిని కవులు గ్రంథస్థం చేశారు. అవే స్థలపు రాణాలు. తమిళంలో స్థల పురాణాలు చాలా వ్రాసిన మహనీయుడు మహావిద్వాన్ మీనాక్షిసుందరం పిళ్లై (1815-1876). పిళ్లైగారు విద్వత్కవులుగానే కాక మహామహోపాధ్యాయ డాక్టర్ ఉ.వే.స్వామినాథయ్యరు వంటి పండితులకు విద్యాదానం చేసిన ఉత్తమ దేశికులుగా కూడా పేరు పెంపులు గడించారు.

మొత్తంమీద, తమిళ శైవ సాహిత్యం భక్తి రసప్రధానమైనదనీ, విశిష్టమైనదనీ, అది తమిళ వాఙ్మయాన్ని సుసంపన్నం చేసినదనీ నిస్సంశయంగా పేర్కొనవచ్చు.

**ఇతర రచనలు:**

తేవారమే కాక మరికొన్ని రచనలు కూడా శైవ సాహిత్యాన్ని సుసంపన్నం చేశాయి. అవి తిరుప్పుగళ్, అరుట్పా (తిరువరుట్పా), పిళ్లైత్తమిళ్.

16వ శతాబ్దివాడైన అరుణగిరినాథుడనే భక్తుడు తిరుప్పుగళుని వెలయించాడు. ఆయన సుబ్రహ్మణ్యస్వామివారి భక్తుడు. మూవర్ సందర్శించిన ఆలయాలను ఆయన కూడా సందర్శించి, భక్తిగీతాలు సంతరించాడు. కాగా, (శ్రీ) స్తుతి అని అర్థమొసగే తిరుప్పుగళ్ భక్తిరసపు ముద్ద. అందులోని ప్రతిగీతమూ భక్తిరస ప్లావితమై లయాన్వితమై వీనుల విందు గొలుపుతుంది.

అరుట్పా అంటే అనుగ్రహ కావ్యమని అర్థం చెప్పవచ్చు. 19వ శతాబ్దిలో జీవించిన రామలింగస్వామి అనే భక్తుడు అరుట్పా సంతరించాడు. వళ్లలార్ అనే ప్రసిద్ధ నామాంతరం ఆయనకి ఉన్నది. బహుముఖ ప్రజ్ఞావంతుడైన ఆయన పండితుడు, తాత్త్వికుడు, సంఘ సంస్కర్త. కరుణరస ప్రధానమైన రచన ఆయనది. భావ గాంభీర్యానికి పెట్టింది పేరు.

96 ప్రబంధాలలో (ఖండకావ్యం) ఒకటైన 'పిళ్ళైత్తమిళ్' తమిళ సాహిత్యంలోని ఒక విశిష్ట ప్రక్రియ. దేవతా మూర్తుల్నీ రాజుల్నీ శిశువులుగా సంభావించి, వారి శైశవావస్థను మనోహరంగా అభివర్ణిస్తుంది

పిళ్లైత్తమిళ్. ఇందులో పది భాగా లుంటాయి. ప్రతిభాగంలోను పది పద్యాలు. శైశవం ఎంత మధుర మైనదో, ఈ రచన కూడా అంత మధురంగా ఉంటుంది. కుమర గురుపరర్ (17వ శతాబ్ది) రచించిన మీనాక్షియమ్మై పిళ్లైత్తమిళ్, ముత్తుక్కుమారస్వామి పిళ్లైత్తమిళ్ మొదలైనవి పేర్కొనదగిన రచనలు.

### గుళ్లగోపురాలు:

మనదేశం, అందులోనూ దక్షిణాపథం, గుళ్లగోపురాలకు ప్రసిద్ధి కెక్కింది. మనదేశం సందర్శించ వచ్చే పాశ్చాత్యులు సైతం ఈ ఆలయాలను చూసి ముగ్ధులు కావడం సర్వ విదితం. ఆలయ నిర్మాణం ఆగమానుసారం జరుగుతుంది. గర్భగృహం, అర్ధమండపం, మహామండపం, స్నానమండపం, అలంకార మండపం మొదలైనవి ఆలయంలో ఉండాలి. మనిషికి హృదయంలా గుడికి గర్భగృహం చాలా ముఖ్యం. దానికి అభిముఖంగా ధ్వజస్తంభం, బలిపీఠం ఉంటాయి.

నిర్మాణాన్ని పురస్కరించుకుని, ఆలయాలను సప్తవిధాలుగా విభజిస్తారు. అవి: (1) కరక్కోయిల్ (2) పులక్కోయిల్ (3) కొగుడిక్కోయిల్ (4) ఇళంకోయిల్ (5) మణిక్కోయిల్ (6) ఆలక్కోయిల్ (7) తూంగానైమాడం.

గర్భగృహం గోడలలో గూళ్లు ఉంటాయి. వీటిని కోష్ఠము లంటారు. ఈ గూళ్లలో దేవతా విగ్రహాలు ఉంటాయి. విటిని కోష్ఠమూర్తు లని వ్యవహరిస్తారు. ఆలయాలలో వ్యవహృత మయ్యే యీ పరిభాషను తెలుసుకోవడం చాలా అవసరం. కోష్ఠమూర్తులూ పరివార దేవతలూ ఉంటారు. గర్భగృహం చుట్టూ ఉన్న నడవలలో కుడ్యాలకు దగ్గరగా కనిపించే విగ్రహాలనే పరివార దేవతలని వ్యవహరిస్తారు.

గర్భగృహంలా స్థలవృక్షం కూడా ముఖ్య మైనదే. ఆలయ నిర్మాణం జరగడానికి మునుపు శివలింగాన్ని ఒక చెట్టు కింద ప్రతిష్ఠించి పూజాదికం నిర్వర్తించేవారు. కనుక ఆ వృక్షం స్థలవృక్ష మయింది; పరమ పవిత్రంగా భావించబడింది. మహర్షులు స్నానాదులు చేసిన నదులు తటాకాలు మొదలైనవాటి పుణ్యోదకాన్ని తీర్థ మంటారు. సాధారణంగా

ప్రతి గుడికి దగ్గరగా ఒక కోనేరు ఉంటుంది. దాన్ని పుష్కరిణి అని కూడా వ్యవహరిస్తారు.

పరమశివుడు అశక్యములైన ఎనిమిది పనులు చేసినట్లు మన పెద్దలు చెపుతారు. ఆ పనులు జరిగిన స్థానాలను వీరస్థానాలని (వీరట్టం) వ్యవహారం. అష్ట వీరస్థానాలు (అట్ట వీరట్టం) ఉన్నాయి. అవి:-

1. తిరుక్కండియూరు - పూర్వబ్రహ్మ అయిదుతలల వాడు. ఇక్కడ ఆయన శిరస్సు ఒకటి పోయింది. తదాదిగా బ్రహ్మ చతుర్ముఖుడయ్యాడు.
2. తిరుక్కోవలూరు - అంధకాసుర సంహారం జరిగిన చోటిది.
3. తిరువడిగై - త్రిపుర సంహారం జరిగిన స్థల మిది.
4. తిరుప్పదియలూరు - దీన్నే పరచలూరనీ పిలుస్తారు. దక్షుని శిరచ్ఛేదం జరిగిన చోటు.
5. తిరువర్కుడి - జలంధరుణ్ణి చంపిన చోటు.
6. వళవూరు - గజసంహారం జరిగిన స్థలం.
7. తిరుక్కురుక్కై - మన్మథ దహనం జరిగిన స్థలం.
8. తిరుక్కడవూరు - యముణ్ణి శిక్షించిన చోటు.

అష్ట వీరస్థానాలు ఉన్నట్లే సప్తవిటంక స్థలాలూ ఉన్నాయి. ఉలితో చెక్కబడని విగ్రహాన్ని విటంక మంటారు. స్వయంభువని అర్థం. ఈ విగ్రహం నాట్యభంగిమలో ఉంటుంది. ఆ ఏడు విటంక స్థలాలు:-

1. తిరువారూరు - వీధి విటంకుడు (అజపా నాట్యం)
2. తిరువళ్లారు - నఖ విటంకుడు (ఉన్మత్త నాట్యం)
3. నాగపట్టణం -సుందరవిటంకుడు (వీచి నాట్యం)
4. తిరుక్కారాయిల్ - ఆది విటంకుడు (కుక్కుట నాట్యం)
5. తిరుక్కోళిలి - అవని విటంకుడు (భృంగ నాట్యం)
6. తిరువాయ్మూరు - నీల విటంకుడు (కమల నాట్యం)
7. తిరుమరైక్కాడు - భువని విటంకుడు (హంసపాద నాట్యం)

నాట్యకళాకోవిదుడైన శివుడు అయిదు స్థలాలలో నాట్యం చేశాడు. ఈ అయిదింటినీ పంచ సభలని వ్యవహరిస్తారు. ప్రతి సభామండపానికి విలక్షణమైన పేరు ఉన్నది. పంచ సభలు:-

1. చిదంబరం (తిల్లై) - పొన్నంబలం (స్వర్ణ సభ)
2. మధుర - వెళ్లియంబలం (రజత సభ)
3. తిరువాలంగాడు - రత్న సభ
4. తిరునెల్వేలి - తామ్ర సభ
5. తురుక్కుట్రాలం- (కుత్తాలం) - చిత్ర సభ

ఈ ప్రపంచం పంచభూతాత్మకం. నేల, నీరు, నిప్పు, గాలి, ఆకాశం - వీటిని పంచభూతములని వ్యవహరిస్తారు. ఈ పంచభూతాలకు ప్రాతినిధ్యం వహించే ఆలయాలు దక్షిణాపథంలో ఉండడం పేర్కొనదగిన అంశం. ఇవి పంచభూత స్థలాలని వ్యవహృతము లవుతున్నవి.

1. నేల (పృధివి) - కంచి (కాంచీపురం)
2. నీరు (అప్పు) - తిరువానైక్కా
3. నిప్పు ( తేజస్సు) - తిరువణ్ణామలై
4. గాలి (వాయువు) - శ్రీ కాళహస్తి
5. ఆకాశం - చిదంబరం

సాధారణంగా ఆలయాల పేర్లు అవి నెలకొన్న స్థలనామాలై ఉంటాయి. శ్రీశైలం ఆలయం, చిదంబరం ఆలయం అని వ్యవహరించడం పరిపాటి. కొన్ని సందర్భాలలో ఆయా మూర్తుల పేర్లతో వ్యవహృత మవుతాయి. మీనాక్షి గుడి, రామనాథస్వామి గుడి (రామేశ్వరం) అని యిలా కొన్ని పేర్లు.

### దేవోత్సవాలు:

ఉత్సవాలలో మన ఆలయాలు కలకలలాడుతూ ఉంటాయి. నిత్యోత్సవాలు, మాసోత్సవాలు, బ్రహ్మోత్సవాలు - ఇలా ఎన్నెన్నో. ఉత్సవ కాలంలో ఆలయం కన్నుల కైలాసంగా కనిపిస్తుంది. అధిష్ఠాన దేవతను

మూలమూర్తి లేక మూలస్థానమూర్తి అని వ్యవహరిస్తారు. ఉత్సవ కాలంలో ఊరేగింపుగా తీసుకుని వచ్చే మూర్తిని ఉత్సవమూర్తి లేక ఉత్సవ విగ్రహం అంటారు. ఏడాది కొకమారు జరిగే ఉత్సవాన్ని బ్రహ్మోత్సవం, మహోత్సవం అంటారు. సాధారణంగా ఇది పదిరోజులు జరుగుతుంది. విత్తం కొద్ది వైభవం. కనుక ఆలయాల ఆర్థిక స్తోమతను బట్టి ఉత్సవ దిన, సంఖ్య మారుతుంది. ఉత్సవకాలంలో మూర్తిని వాహనం మీద కూర్చోబెట్టి ఊరేగించడం సంప్రదాయం. సాధారణంగా అయిదు విగ్రహాలను ఊరేగిస్తారు. వారు పార్వతి, శివుడు, గణపతి, సుబ్రహ్మణ్యుడు, చండేశుడు ప్రభృతులు. ఆయా ఆలయాల సంప్రదాయాలకు అనుగుణంగా వాహనాలు మారుతూ వుంటాయి. కొన్ని ఉత్సవాలు విలక్షణంగా కూడ ఉంటాయి. ఇందుకు కంచిలో ఏకాంబరనాధుని ఆలయంలో జరిగే మావడి సేవ ఒక మంచి ఉదాహరణ. స్వామివారిని రజత ఆమ్ర (మామిడి) వృక్షం కింద ఉంచుతారు. శివలింగాన్ని పార్వతి ఆలింగనం చేసుకుంటుంది. ఆ విధంగా ఊరేగింపు జరుగుతుంది.

కొన్ని సందర్భాలలో రక్షణ లోపించడంవల్ల, విగ్రహాన్ని సురక్షితమైన ఆలయంలోనో మరోచోటనో ఉంచుతారు. అనగా బాలాలయంలో ఉంచుతారన్నమాట. భక్తకవిత్రయం (మూవర్) కొన్ని క్షేత్రాలను సందర్శించకుండానే గీతరచన చేశారు. ఆ కోవకు చెందిన స్థలాలను షిక్షిప్త స్థలాలని (వైప్పుత్తలంగళ్) వ్యవహరిస్తారు.

## శైవ సిద్ధాంత తత్త్వం:-

తమిళదేశపు శివభక్తుల్ని గురించి తెలుసుకునేటప్పుడు, శైవ సిద్ధాంతతత్త్వం గురించి తెలుసుకోవడం చాలా ముఖ్యం. మెయ్ కండార్, అరుళ్ నంది శివాచార్యులు, మరైజ్ఞాన సంబంధులు, ఉమాపతి శివాచార్యులు - ఈ నలుగురూ ఈ తత్త్వాన్ని ఆపోశనం పట్టిన మహనీయులు. వీరిని సంతాన ఆచార్యులని వ్యవహరిస్తారు. శైవ సిద్ధాంత సాహిత్యంలో 14 తాత్త్విక రచన లున్నాయి. వీటిలో ఎనిమిదింటిని ఉమాపతి శివాచార్యులు వెలయించారు.

శైవ సిద్ధాంత తత్త్వంలో పతి (ఈశ్వరుడు), పశు (ఆత్మ), పాశం

(బంధం) చాలా ప్రధాన మైనవి. పతి స్వతంత్రుడు. పశు పాశంతో బంధించబడింది. ఆణవం (అవివేకం), కర్మ, మాయ అనే మూడు గుణాలు పాశంలో అంతర్లీనములై ఉన్నాయి. అజ్ఞానాత్మకమైన పశుకి పతి తెలియదు. అంతే కాదు. తాను అజ్ఞానాత్మక మనే అంశమూ దానికి తెలియదు. కాని కరుణాన్వితుడైన పతి పశుకి దేహం (తనువు), అను భవం మొదలైనవాటిని (కరణం, భోగం) అనుగ్రహిస్తున్నాడు. దేహాదులు మాయచే కల్పించబడినవి. దేహధారి కాగానే, పశు కర్మాచరణకు పూను కుంటున్నది. కర్మవల్ల అది పునర్జన్మను పొందుతున్నది. ఈ జనన మరణ చక్రం పరిభ్రమిస్తూ వుంటుంది. ఎప్పుడైతే ఆత్మ రాగ ద్వేష రహితమై ప్రవర్తించగలుగుతుందో, అప్పుడు భగవదనుగ్రహం లభిస్తుంది; ఆత్మకు విముక్తి కలుగుతుంది. ఈ వివిధ దశలను కర్మ సామ్యం (ఇరువిపై ఒప్పు), మల పరిపాకం, శక్తివిపాతం అని వ్యవహరిస్తారు. విముక్తి లభించినప్పుడు, ఆత్మ భగవంతునితో ఐక్యం చెందుతుంది; ఆనందావస్థను పొందుతుంది. అవివేకం తన శక్తిని కోల్పోతుంది.

# 6. పాల్కురికి సోమన - మాణిక్య వాచకర్

తెలుగు తమిళసాహిత్యములలో ఉన్నత శిఖరాల వంటివారు పాల్కురికి సోమనాథుడు, మాణిక్య వాచకర్ మహాకవులు. వారి కృతులు వేద తుల్యములుగా భావించబడుతున్నాయి. కవులే కాక మతదృష్టి కలవారు కూడా వారిద్దరినీ పరమ పూజ్యులుగా భావిస్తున్నారు. విప్లవ కవిగా దర్శన మిస్తున్న పాల్కురికి భావావేశం గల శైలితో పాఠకుల్ని బహుధా అలరిస్తున్నాడు. ఋషితుల్యుడైన కవిగా దర్శనమిచ్చే మాణిక్యవాచకర్ తాత్త్విక చింతనలతో పాఠకుల్ని ఆకట్టుకుంటున్నాడు. ఈవిధంగా ఆ మహాకవులిద్దరూ తమ అనుయాయులకు విశిష్ట చరిత్రులుగా దర్శన మిస్తున్నారు.

తన రచనల ద్వారా వైదిక అవైదిక శైవముల మధ్య సమన్వయాన్ని సాధించినవాడు పాల్కురికి సోమనాథుడు. వైదిక వీర శైవాచార్యుడైన మల్లికార్జున పండితారాధ్యుని జీవితచరిత్రను అభివర్ణిస్తూ ఆయన పండితారాధ్య చరిత్ర వెలయించాడు. అలాగే అవైదిక వీర శైవాచార్యుడైన బసవేశ్వరుని జీవితగాథను అక్షరబద్ధం చేస్తూ బసవపురాణం సంతరించాడు. పురాణమని పేర్కొన్నా, అది కూడా కావ్యమే. సొమనాథునిలో మరొక విశిష్టత కూడా లేకపోలేదు. వివిధ వర్ణాలకూ ప్రాంతాలకు చెందిన శివభక్తుల జీవిత కథల్ని గ్రంథస్థం చేసిన విప్లవ కవి సోమన. అనగా దివిని గాక భువిని అభివర్ణించి, మానవుణ్ణి ధ్యేయంగా చేసుకున్న మహాకవి సోమన!

సోమనాథుని కృతులు ఆకృతిలో జీవితచరిత్రలే అయినా అంతస్తత్వంలో అవి మత సంబంధి రచనలు కూడా! విద్వత్కవులు చిన్న చూపు చూసిన ద్విపదకు ఆయన బ్రహ్మరథం పట్టి,

'తెలుగు మాటలనంగ వలదు వేదముల
కొలదియకాం జూడుడు - '

అని వేదవిఖ్యాతిని సమకూర్చినవాడు. సర్వసామాన్యమైన జాను తెనుగుకి - అనగా ప్రజావ్యవహారంలో ఉన్న తెలుగుకి పెద్ద పీట వేసిన

విద్వత్కవి. అయితే వీరశైవం మీది అభిమానం దురభిమానంగా పెరిగి పెద్దదై ఆ మహాకవిని మతదురభిమానిగా మార్చివేసింది. అంతేకాదు. ఆయన వాక్పారుష్యం ప్రజాభిమానాన్ని కోల్పోయింది. అందువల్ల పాల్కురికి కవి రచనలకు సర్వజనాకర్షణ శక్తి లభించలేదు.

మాణిక్యవాచకర్‌ది సార్వజనీనమైన శైలి. ఆయన రచనలో మత దురభిమానం కనిపించదు. అందుకు విరుద్ధంగా ప్రేమైక దృక్పథం కనిపిస్తుంది. స్పష్టంగా చెప్పాలంటే తాత్త్వికత ఆయన రచనకు నిండుదన మిచ్చింది. మధురభక్తి అంతర్వాహినియై ప్రవహించింది, ఆయన రచనలో. అందువల్ల ఆయన పండితులకూ పామరులకూ ప్రీతిపాత్రుడైన కవిగా దర్శనమిస్తాడు. అంతేకాక ఆయన కవిత స్వీయ చరిత్రాత్మకంగా కనిపిస్తుంది. దైవ సాక్షాత్కారం కోరి జీవుడు పయనిస్తున్న దివ్యానుభూతి కలుగుతుంది, ఆయన రచన చదువుతుంటే. పాల్కురికి రచనలోవలె, మాణిక్యవాచకుని రచనలోనూ వివిధ శాస్త్రవైదుష్యం, ఐతిహాసిక పరిజ్ఞానం, అకలంక భక్తిభావం మొదలైనవి కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి. మాణిక్యవాచకర్ అన్నది బిరుదనామం. మాణిక్యముల వంటి సూక్తులు చెప్పిన కారణం వల్ల ఆయన కాపేరు వచ్చినట్లు తెలియవస్తున్నది.

మాణిక్యవాచకుని కృతులలో పేర్కొనదగింది తిరువాచకం (పవిత్ర ప్రవచనం). ఈ కృతిలో 658 భక్తి గీతాలు ఉన్నాయి. తిరువాచకత్తుక్కు ఉరుగాదవర్ ఒరువాచకత్తుక్కుం ఉరుగార్ అనే ప్రశస్తి పొందినదీ రచన. తిరువాచకానికి ద్రవించనవారు ఏ వాచకానికీ ద్రవించరని ఈ సూక్తిలోని భావం. అంత భక్తిరసపు ముద్ద తిరువాచకం! పామరులు సైతం అర్థం చేసుకునేలా ఆధ్యాత్మిక రహస్యాలు వివరించ బడ్డాయి. శ్రీకాళహస్తీశ్వర శతక కర్త ధూర్జటిలా, ఆయన కూడా ఆత్మోద్ధరణ కోసం భగవంతుణ్ణి వేడుకున్నట్లుగా కనిపిస్తుంది ప్రతిగీతం. దేశికవితాశాఖకు చెందిన అమ్మానై (అచ్చన గాయలు ఆడేటప్పుడు స్త్రీలు పాడే పాట), సాళల్ (ఉయ్యాలపాట), తెళ్లేణం (గొబ్బిపాట) మొదలైన జానపద బాణీలలోనూ ఆయన రచన కావించాడు. వైదిక అవైదిక వీర శైవముల మధ్య సోమన సమన్వయం సాధించినట్లుగానే, మాణిక్యవాచకర్ సాంప్రదాయిక నవీన ఛందస్సుల మధ్య సమన్వయం సాధించాడు.

అగవల్, ఆసిరియుప్పా మొదలైన ప్రాచీన ఛందస్సుల్ని ఉపయోగించినట్లు గానే, ఆయన నాలుగు పాదాల వృత్తమైన నాలడిప్పాట్టుని, అమ్మానై మొదలైన జానపద బాణీలను ఉపయోగించి పాతకొత్త ఛందస్సుల్ని సరి సమానంగా ఆదరించినవా డయ్యాడు.

కవిగా సోమనాథుని పేరు ప్రతిష్ఠలు బసవపురాణం పండితారాధ్య చరిత్రం మొదలైన రసవద్రచనల్ని ఆధారం చేసుకుని ప్రచారంలో ఉన్నట్లుగా, మాణిక్యవాచకునికి పేరుపెంపులు తెచ్చి పెట్టిన రచన తిరు వాచకం. పరమశివుని నాయకునిగాను తనను నాయికగాను చేసుకుని, నాలుగువందల ప్రేమ సన్నివేశాలతో ఆయన సంతరించిన తిరుక్కోవై యార్ కూడా ప్రముఖ రచనయే. అయినా తిరువాచకానికి లభించినంత ప్రశస్తి ఆయన యితర రచనలకు లభించలేదు. ఆ భక్తిగీత సందోహం మనదేశానికి క్రైస్తవ మత బోధకుడుగా వచ్చిన జి.యు. పోప్ అనే కవిని బహుధా ఆకర్షించింది. ఆయన ఆ భక్తి గీతాలను ఆంగ్లంలోకి అనువదించాడు కూడా.

మాణిక్య వాచకుని గ్రంథరాజం పాశ్చాత్యుల్ని కూడా ఆకర్షించిన ట్లుగా, సోమనాథుని కృతులు తమిళ, కన్నడ వీరశైవులకు వేదతుల్యము లైనవని చెప్పడం సత్యసన్నిహితం. ముఖ్యంగా బసవపురాణం ప్రాచ్య పాశ్చాత్య రచయితల్ని ఆకర్షించింది. తమిళ కన్నడ భాషలలోకి అనూ దితమైన తొలి తెలుగు కావ్యం కూడా అదే. సి.పి.బ్రౌన్ 1839లో ఆ కావ్యాన్ని 140 పుటలలో వచనంలోకి అనువదించాడు; కాని అది అముద్రితం. 14వ శతాబ్దివాడైన భీమ కవి భామినీ షట్పదీవృత్తంలో బసవ పురాణాన్ని కన్నడం చేశాడు. ఆ తర్వాత శంకరకవి అనే ఆయన సంస్కృతంలోకి అనువదించాడు. తమిళ బసవపురాణం 1931లో ప్రచు రిత మయింది. కర్త పేరు తెలియరాలేదు. నాగిచెట్టి అనే ఆయన విపులమైన వ్యాఖ్యానం వెలయించాడు. పాల్కురికి సోమన పాదప ద్మాలు సేవించే భాగ్యం కలగడం వల్ల నా జన్మ చరితార్థ మయిందని తమిళ కవి పేర్కొనడం గమనించదగిన అంశం. కాగా మాణిక్యవాచకర్, పాల్కురికి సోమనలు తమ అనుయాయులకు ఆరాధ్యుడన్నా సాహసం కాదు.

ఇక ఆత్మోద్ధరణ కోసం ఈశ్వరుణ్ణి ప్రార్థించిన మాణిక్యవాచకుని భావరామణీయకాన్ని గ్రహించి ఆనందిద్దాము.

సాహాయ్య మేమియు నలుపక మృత శ
రీరమ్ము వలె సంచరించు హృదయమ!
ఆద్యుడై భాసించు నా నటరాజ
మూర్తియం దిక నీకు మోహమ్ము లేదు.

ఆనంద తాండవం బాతని యెదుట
చేయనే చేయవు; హాయిగా పాట
పాడవు బొమికలు పొడియగు దాక!
భక్త్యంజలులు ఘటింపవు నీ వతనికి
శివు పదంబుల తల జేర్పవు నీవు.

అతడు జగదేక సంసేవ్యు, డమల చరితు
డతడు, నన్నుద్ధరించువా, డితర దైవ
ములను నే గొల్వ, నతని భక్తులు మదీయ
సఖులు, మెలగుదు వారితో సంతతమ్ము.

పాల్కురికి సోమనాథుడు వీరశైవుడనడం చర్విత చర్వణం. మాణిక్యవాచకుడు శైవుడనడంలో విప్రతిపత్తి లేదు. ఆయన వీరశైవుడని ప్రసిద్ధ విద్వాంసులు మరైమలై అడిగళ్ (అసలు పేరు స్వామి వేదాచలం) భావించారు. కాని ఆయన అభిప్రాయం సరికాదని కొందరు పేర్కొన్నారు. మాణిక్యవాచకుడు వీరశైవుడైనా కాకపోయినా, ఒక్క విషయం మాత్రం సుస్పష్టం. అరవై ముగ్గురు నాయన్మారులలో మాణిక్యవాచకుని పేరు కనిపించదు. శివభక్తుల కథల్ని లోకానికి ప్రప్రథమంగా తెలియజేసిన పెరియ పురాణకర్త అయిన సేక్కిళార్ మాణిక్య వాచకుని కథను ఏకారణం వల్లనో తెలుపలేదు. నాయన్మారులలో స్థానం లేకపోవడం వల్లనూ, పెరియ పురాణ కర్త ఆయన కథను వివరించకపోవడం వల్లనూ మాణిక్య వాచకర్ శైవుడు కాడనీ వీరశైవుడై ఉండవచ్చుననీ భావించబడుతున్నది. మాణిక్యవాచకుణ్ణి శైవులు స్వామిగళ్ అనీ, అడిగళ్ అనీ (పూజ్యపాదులు) ఆదరభావంతో వ్యవహరిస్తారు.

ప్రముఖ నాయన్మారులూ భక్తకవులూ అయిన తిరుజ్ఞాన సంబంధర్, తిరునావుక్కరశర్, సుందర మూర్తి - ఈ ముగ్గురునీ తమిళశైవులు మూవర్ అనే సమష్టి నామంతో వ్యవహరిస్తారు. ఈ భక్త కవిత్రయంతో పాటు మాణిక్యవాచకర్‌ని కలుపుకుని నాల్వర్ (చతుష్టయం) అని శైవులు వ్యవహరిస్తారు. ఈ నలుగురు ప్రముఖులూ శైవ మతానుయాయులకు పరమాచార్యులన్నా అతిశయోక్తి కాదు. కాగా మాణిక్యవాచకర్ నాయన్మారులలో ఒకడు కాకపోయినా, ఆయనకి పరమాచార్యుడనే విశిష్ట గౌరవం కలగడం గమనించదగిన విషయం.

మాణిక్యవాచకర్, సోమనలు బ్రాహ్మణకుటుంబంలో జన్మించారు. బ్రాహ్మణ కుటుంబానికి చెందిన అమాత్యర్ వర్గానికి చెందినవాడు మాణిక్యవాచకర్. అమాత్యు డనగా మంత్రి. అంటే ప్రెగ్గడ అన్న మాట. క్రీస్తుశకం 1 నుంచి 11వ శతాబ్దిలో ఆయన వర్ధిల్లినట్లుగా భావిస్తూ పండితులు వివిధ శతాబ్దులు పేర్కొన్నారు. కాని పలువురు విద్వాంసుల అభిప్రాయం ప్రకారం ఆయన 9వ శతాబ్ది ఉత్తరార్ధంలో కాని 10వ శతాబ్ది పూర్వార్ధంలోకాని జీవించి వుండవచ్చునని చెప్పవచ్చు. పాల్కురికి సోమన మాణిక్యవాచకునికి తరువాతి వాడనడం నిస్సంశయం. 13వ శతాబ్దిలో ఆయన జీవించాడు. మాణిక్య వాచకుని అసలు పేరు వాదవూరన్. అనగా మధురానగరానికి సమీపంలో ఉన్న వాదవూర్ అనే గ్రామానికి చెందినవాడని అర్థం; వాదవూర్ గ్రామ నివాసి అని పిండితార్థం.

సోమనాథుని కులగోత్రాలు దేశకాలాల విషయమై అభిప్రాయభేదాలు లేకపోలేదు. 13-14 శతాబ్దముల మధ్య కాలంలో ఆయన జీవించినట్లు నిశ్చయించబడింది. ఆయన బ్రాహ్మణుడని కొందరు జంగముడని మరికొందరు భావించారు. ఏది ఏమైనా ఆయన వేదవేదాంగ విదుడనడం సత్యసమ్మతం. ఆయన తెలంగాణంలోని పాలకుర్తి గ్రామనివాసి అని కొందరూ, మరికొందరు కన్నడనాడులోని హాల్కురికి గ్రామస్థుడనీ భావించారు. కాని పలువురి నిర్ణయానుసారం ఆయన బ్రాహ్మణుడనీ తెలంగాణము వాడనీ పేర్కొనవచ్చు.

విచిత్ర మేమిటంటే, మాణిక్యవాచకర్ సోమనలు శైవాభిమానం

కొద్దీ కులనిరసనం కావించారు; తమ తలిదండ్రుల పేర్లు కూడా చెప్పు కోడానికి వారు ఇష్టపడలేదు.

మాణిక్యవాచకర్ అమాత్యపదవి నిర్వహించినవాడు కావడం వల్ల, ఆయన జీవిత విశేషా లెన్నో తెలియవచ్చాయి. కాని ఆయన జననీ జనకుల పేర్లు మాత్రం తెలియరాలేదు. జాతి కులం పిఅప్పు ఎన్నుం - సుళిపట్టుత్తదు మారుం ఆదమిలినా యేనై - అని జాతి కులం జన్మం మొదలైనవాటిని ఆయన నిరసించాడు.

వేద విదుడైనా, పాల్కురికి సోమనాధుడు బసవేశ్వరుని ప్రభావా నికి లోనయిన పిమ్మట - వీరశైవమత దీక్షస్వీకరించిన పిమ్మట - తన కులమునే కాక తలిదండ్రుల పేర్లు కూడా పేర్కొనలేదు. బసవేశు శ్రీ పాదపద్మ సేవకుడనని చెప్పుకున్నాడు, సహర్షంగా. ఆయన మాటలలోనే ఆయన చెప్పుకున్న విధం పరికిద్దాము.

బసవ గోత్రుండను బసవని కరణ
బసవేశు శ్రీ పాదపద్మ సేవకుడ
బసవన్న బొగడ బాల్పుడు కవీంద్రుడను
బసవన్న బొగడ బాల్పుడు పారకుండ
బసవన్న దూతనే బసవన్న బంట
బసవన్న లెంకనే బసవన్న లెంగి
బసవన్న యిలుపుట్టు బానిస కొడుక -

జన్మదాతలైన తలిదండ్రుల పేర్లు కూడా స్మరించడానికి సమ్మతిం చని వీరశైవులు మాణిక్య వాచకర్ సోమనాధులు!

మధుర నేలిన పాండ్య భూపతి ఆస్థానంలో మంత్రి పదవిని నిర్వహిం చిన ఉన్నతోద్యోగి మాణిక్యవాచకర్. చిన్నతనంలోనే ఆ ఉన్నత పదవి ఆయనకి లభించింది. ఆయన విద్వాంసుడే కాక అశ్వ శాస్త్రంలోనూ నిపుణుడుగా కనిపిస్తున్నాడు. మంచి గుర్రాలు కొనుగోలు చేయవలసిం దిగా పాండ్యుడు తన మంత్రిని ఆజ్ఞాపించాడు. రాజాజ్ఞను శిరసావ హించి ఆయన బయలుదేరాడు. దారిలో ఒక ముని కనిపించాడు. ఆ ముని మాణిక్యవాచకరులో ఆధ్యాత్మిక దృక్పధం కలిగించాడు. ఆయన

ఆ మునిని తన గురువుగా సంభావించాడు. చివరకి రాజాజ్ఞను విస్మరించాడు. మధురకు తిరిగి వచ్చి, గుర్రాలు త్వరలోనే వస్తాయని రాజుకి విన్నవించాడు. అన్నట్లుగానే గుర్రాలు వచ్చాయి. కాని అవి నక్కలుగా మారి, రాజుగారి గుర్రాలను గాయపరిచాయి. రాజుకి ఆగ్రహం కలిగింది. తత్ఫలితంగా మాణిక్యవాచకునికి కారాగారప్రాప్తి కలగడం, ఆయేడు వైగై నదిలో విపరీతంగా వరదలు రావడం, ఇంటికొకరు చొప్పున వచ్చి వైగై కట్టల్ని ఎత్తు చెయ్యాలని రాజు ఆజ్ఞ విధించడం, శివుడు మారు వేషంతో వచ్చి ఒక అవ్వకు సహాయం చెయ్యడం మొదలైనవి ఒకదాని వెంట ఒకటి జరిగాయి. చిట్టచివరికి మాణిక్యవాచకర్ భగవదన్వేషణలో జీవితశేషం గడిపాడు.

మాణిక్యవాచకర్ జీవిత విశేషాలు పూర్తిగా కాకపోయినా కొంత వరకైనా తెలుసు సోమనాధుడికి. బసవపురాణంలో కొన్ని వివరాలు తెలియజేశాడు. కాని మాణిక్యవాచకుని పేరు తెలుపలేదు. రాజుపేరు కూడా తెలుపలేదు. మధురపాండ్యుడు తన మంత్రి - అని మాత్రం పేర్కొన్నాడు. కాని గుర్రాలు నక్కలుగా మారిన అద్భుతాన్ని ప్రముఖంగా అభివర్ణించాడు. అలాగే శివుడు మారువేషంతో వచ్చి ఒక వృద్ధస్త్రీకి సహాయం చేసిన వృత్తాంతాన్ని కూడా వివరించాడు. ఆ వృద్ధాంగనను పిట్టవ్వ అని పేర్కొన్నాడు. పండితారాధ్య చరిత్రలో శివభక్తుల పేర్లు చాలా ఉదాహరించిన సోమనాధుడు పిట్టనంగరోహిణి అని ఆ వృద్ధస్త్రీని పేర్కొనడం గమనించదగింది. పిట్టవ్వ అనే పేరులో పిట్టు అవ్వ అనే రెండు శబ్దాలున్నాయి. వాసెనమీద ఉడకబెట్టిన పిండిని పిట్టు అంటారు. ఇది నేటికీ తమిళనాడులో ప్రచారంలో ఉన్న భక్ష్యం. పూజ్యురాలు లేక వృద్ధురాలు అనే అర్థంలో అవ్వ శబ్దం ప్రయుక్తం. కనుక మాణిక్యవాచకుని వృత్తాంతం పూర్తిగా కాకపోయినా కొంతవరకైనా సొమనాధునికి తెలుసుననడం చర్విత చర్వణం. కాని కావేరికి కట్టలు పోసిన కరికాల భూపతి కాలంలో పిట్టవ్వ వృత్తాంతం జరిగినట్లుగా పేర్కొనడం వల్ల, సోమనాధుడు మాణిక్యవాచకుని కథను కరికాలుడు కావేరికి కట్టలు పోసిన వృత్తాంతాన్ని కలగాపులగం చేసినట్లు భావించవచ్చు.

మాణిక్యవాచకుడు ప్రముఖ దార్శకునిగా అద్భుతాలు సలిపిన అద్భు

తవ్యక్తిగా దర్శన మిస్తాడు. సోమనాధుడు అద్భుతవ్యక్తి కాకపోయినా, మంత్రిపదవి వంటి ఉన్నతోద్యోగం నిర్వహించక పోయినా ఆయన జీవితంలోనూ కొన్ని అద్భుతాలు కానవస్తాయి. వాటిని పరిశీలిస్తే, మహాకవిగానే కాక అద్భుతాలు సలిపిన వ్యక్తిగా కూడా ఆయన దర్శన మిస్తాడు.

సోమనాధుడు కాకతీయ నృపతి ప్రతాపరుద్రుడికి సమకాలికుడు. ఒక నాడు వరంగల్లులో స్వయంభూదేవాలయంలో పురాణపఠనం జరుగుతూ వుండగా అక్కడికి రాజు వెళ్లడం సంభవించింది. సోమనాధుని బసవ పురాణ ప్రవచనం జరుగుతున్నట్లుగా తెలుసుకున్న రాజు ఆ పురాణం వినకుండానే అంతఃపురానికి వెళ్లిపోయాడు. ఆ విషయం సోమనాధునికి తెలిసింది. కవి బాధ చెందాడు. వెంటనే ఆయన ఓరుగల్లుకి బయలు దేరాడు, పండితులతో వాగ్వాదం చెయ్యడానికి. ఆయన ప్రయాణం చేసే బండికి లింగాకారం ముద్రగా కలిగిన ఎద్దు కట్టారు. తుంటరులు కొందరికి లింగముద్రలు వేసి, సోమనాధుణ్ణి ఆహ్వానించడానికి వాళ్లను పంపారు, ప్రతిపక్షానికి చెందిన పండితులు! ఆశ్చర్యం! ఆ తుంటరులు సోమనాధుడికి సాష్టాంగదండప్రణామం చేసేసరికి, వారి లింగముద్రలు శాశ్వతంగా ఉండిపోయాయి. వారు ఆయన శిష్యులైనారని వేరుగా చెప్ప నవసరం లేదు.

శిష్యసమేతుడై సోమనాధుడు నగర ద్వారాన్ని సమీపించాడు. ద్వారం మీద గజలక్ష్మి విగ్రహం ఉండడం చూసి బండికి కట్టిన ఎద్దు ముందుకి పోలేదు. సోమనాధుడు ఆ విగ్రహం వంక చూశాడో లేదో, అది కాస్తా భూపతన మయింది. ఆ అద్భుతాలు రాజు చెవిని పడ్డాయి. ఆయన పశ్చాత్తప్తు డయ్యాడు. వెంటనే ఆయన కవిరాజు వద్దకు వచ్చి క్షమా భిక్ష అర్థించాడు. ఇలాంటి మహత్తులు సోమనాధుడు ప్రదర్శించినట్లుగా తెలియవస్తున్నది.

పరిశీలించేకొద్దీ మాణిక్యవాచకర్ సోమనాధులకు సంబంధించిన పెక్కు అంశాలలో సామ్యత కనిపిస్తుంది. ఇద్దరూ వీరశైవులు. మాణిక్యవాచ కుడు వీరశైవుడు కాడనుకున్నా, ఆయన శైవాభిమానం పుష్కలంగా గల వ్యక్తి అనడం నిస్సందేహం. ఇద్దరూ మహా కవులు. మాణిక్యవాచ

కర్ తిరువాచకం కర్తగా నేటికీ ప్రజాసన్నుతిని చూరగొంటున్నాడు. బసవపురాణ పండితారాధ్య చరిత్రల వంటి ప్రశస్త కావ్యకర్తగా సోమనాథుడు నేటికీ విద్వల్లోకంలో ఆరాధ్యుడు. ఆయన మహాపండితుడు. సంస్కృతాంధ్రకన్నడ భాషలలో ఆయనకి గల విద్వత్తు విస్మయావహం. మాణిక్యవాచకర్ కూడా ప్రముఖ పండితుడే. ఇద్దరూ మహత్తులు ప్రదర్శించినవారే. దేశికవితాశాఖకు చెందిన ఛందస్సుల్ని ఇద్దరూ ఆదరించారు. అయితే మాణిక్యవాచకుని కవితలో ప్రేమైన దృక్పథం గోచరిస్తే, సోమనాథుని రచనలో మతాభినివేశం గోచరిస్తుంది. అనుయాయులకు వారుద్దరూ గురుతుల్యులే!

# 7. పెరియ పురాణం - బసవపురాణం

ప్రముఖ శివభక్తులుగా ప్రసిద్ధికెక్కిన అరవై ముగ్గురు నాయన్మారుల (అరువత్తు మూవర్) జీవిత వృత్తాంతాలను అభివర్ణించే మహాకావ్యం పెరియపురాణం. దీన్ని తిరుత్తొండర్ పురాణం అని కూడా వ్యవహరిస్తారు. తొండర్ అనగా భక్తుడని అర్థం. ఈ మహాభక్త చరితకావ్యాన్ని సేక్కిళార్ అనే మహనీయుడు రచించాడు. ఆయన 11వ శతాబ్దంలో చోళ భూపతి అయిన కులోత్తుంగుని మంత్రిగా ఉండేవాడు. సేక్కిళారుకు పూర్వం, అనగా, 9వ శతాబ్దివాడైన సుందరమూర్తి నాయనారు తిరుత్తొండత్తొగై సంతరించాడు. నాయన్మారుల సంస్తుతి యిందులో ఉంది. ఆ తర్వాత నంబియాండార్ నంబి అనే ఒక అర్చకుడు నాయన్మారుల జీవిత విశేషాలను తెలియజేసే తిరుత్తొండర్ తిరువంతాది అనే లఘుగ్రంథం వ్రాశాడు. తాను విన్న విషయాలను పూస గుచ్చినరీతిగా అరవై ముగ్గురు శివభక్తుల కథల్ని ఒక పెద్ద (మహా) కావ్యంగా తీర్చిదిద్దిన ఖ్యాతి సేక్కిళారుకే చెందుతుంది. ఈ పెరియ (బృహత్) పురాణం నాలుగు వేల రెండువందల ఎనభై ఆరు పద్యాలతో వెలసిన గ్రంథం. కనుక అరవై ముగ్గురు శివభక్తుల సంప్రదాయం తమిళనాడులో చాలా కాలంగా ప్రచారంలో ఉన్నదని చెప్పవచ్చు. జైనులలో కూడా త్రిషష్టి శలాకపురుషులనే సంప్రదాయం ఒకటి ఉంది.

అరవై ముగ్గురు శివభక్తుల కథలను తొలిసారిగా తెలుగు వారికి పరిచయం చేసిన విశిష్ట చరితుడు పాల్కురికి సోమనాథుడు. ఆయన సేక్కిళారుకి అర్వాచీనుడనీ, పెరియపురాణం సోమన కంటే ముందుగా వెలసిన రచన అనీ స్పష్టంగా చెప్పవచ్చు. ఆయనే చెప్పుకున్నట్లుగా,

ప్రస్తుతింపగ సద్భక్తి విస్ఫురణ
బ్రస్తుతి కెక్కిన బసవన చరిత
జెప్పితి భక్తులచే విన్న మాడ్కి
దప్పకుండగను యథాశక్తి జేసి

భక్తులు వివరించగా విని, యథాశక్తిని భక్తుల కథలను సోమన తెలియజేశాడు. కాగా పెరియపురాణ కర్త, బసవపురాణ కర్త తాము విన్న

విశేషాలను గ్రంధస్థం చేశారని భావించడం సమంజసం.

బసవపురాణ పండితారాధ్య చరిత్ర కావ్యాలలో సోమనాథుడు నాయన్మారుల కథలు తెలియజేశాడు. బసవపురాణం సుమారు 12,700 పాదాలగ్రంథం కాగా, పండితారాధ్య చరిత్ర 22,222 పాదాల గ్రంథం. పండితారాధ్య చరిత్రలో నాయన్మారుల పట్టిక యివ్వబడింది. ఈ జాబితాలోని పేర్లకీ పెరియపురాణంలోని పేర్లకీ మధ్య భేదం కనిపిస్తున్నది. తిరుత్తొండతొగైలోని అన్ని పేర్లను సొమనాథుడు ఉదాహరించలేదనీ, తమిళ గ్రంథంలోని క్రమాన్ని కూడా పాటించలేదనీ చెప్పవచ్చు. భక్తుల పట్టిక ఇలా తెలియజేశాడు.

*తిరునీలకంఠుండు తిరునీలనక్క*
*తిరుమూలదేవుండు తిరునాళ్లపోవ*
*మానకంజారుండు మంగయక్కరసు*
*ఆనయనార్ మొన్నయధరుండు పిట్ట*
*నంగరోహిణి పిళ్లనయనారు నంగ*
*సంగచందుండు పూసల నయనారు*

తెలుగు ఛందస్సుకి అనుగుణంగాను, తెలుగుదనానికి అనుగుణంగాను సోమన నాయన్మారుల పేర్లు ఉదాహరించడం వల్ల అవి తమిళ పేర్లకు కొంచెం భిన్నంగా కనిపించడంలో వింత యేమీ లేదు. బహుశః ఆనాటి తెలుగు భక్తులు అవిధంగానే ఆ భక్త శిఖామణుల్ని వ్యవహరించారేమో! కొన్నిపేర్లు తమిళపేర్లకు సరిసమానంగా ఉన్నాయి. ఆయన వ్యవహరించిన తీరుని పరిశీలిద్దాము.

తిరునీలకంఠుండు (తిరునీలకంఠ నాయనార్)
తిరునీలనక్క (తిరునీలనక్క నాయనార్)
తిరుమూలదేవుండు (తిరుమూల నాయనార్)
తిరునాళ్లపోవ (తిరునాళైప్పోవార్ నాయనార్, నందనారు)
మానకంజారుండు (మానక్కంజార నాయనార్)
ఆనయనార్ (ఆనాయ నాయనార్)
మొన్నయధరుండు (మునైయడువార్ నాయనార్)
పిట్టనంగరోహిణి

పిళ్ల నయనారు (తిరుజ్ఞాన సంబంధ నాయనార్)
నంగ సంగ
చందుండు (చండేసువర నాయనార్)
పూసల నాయనారు (పూసలార్ నాయనార్)

కొన్ని పేర్లు గుర్తించలేనంతగా మారిపోయాయి. సోమనాథుడు పేర్కొన్న చెన్నయ్య, మారయ్య, పరమనాచి, కరికామదేవుండు, కాళవ్వ మొదలైన భక్తులు తెలుగు కన్నడ నాడులకు చెందినవారై ఉండవచ్చు. పెరియ పురాణం పేర్కొనని, సోమన మాత్రమే పేర్కొనిన తెలుగుబొమ్మయ్య కన్నడ బ్రహ్మయ్య ప్రభృతులు అరవై ముగ్గురు నాయన్మారులలోని వారు కారని స్పష్టంగా చెప్పవచ్చు; కాని వారు ఆనాళ్లలో ప్రసిద్ధికెక్కిన శివభక్తులై ఉండవచ్చు. లేకపోతే వారు ఆయన దృష్టికి వచ్చివుండరు. ఏది ఎలా ఉన్నా, అరవై ముగ్గురు శివభక్తుల సంప్రదాయాన్ని తెలుగు వారికి తొలిసారిగా తెలియజేసినవాడు సోమనాధుడే అనడం సత్యోక్తి.

ఇక పెరియ పురాణంలోనూ బసవపురాణంలోనూ అభివర్ణితములైన భక్తుల కథలు కొన్నిటిని తులనాత్మకంగా పరిశీలిద్దాము. ఈరెండూ కావ్యములే అయినా, ప్రాచీన భక్తుల వృత్తాంతాలను తెలపడమే ధ్యేయంగా గలవి కనుక, వీటిని పురాణాలని సేక్కిళార్ సోమనలు సహేతుకంగా వ్యవహరించారు.

పూసలార్ నాయనారు ప్రముఖ భక్తులలో ఒకడు. ఆయన కథ పెరియపురాణంలో 18 పద్యాలలో - 72 పాదాలలో - వివరించబడింది. కాని యిదే కథ బసవపురాణంలో కేవలం ఎనిమిదే ఎనిమిది పాదాలలో తెలుపబడింది. కనుక బసవపురాణ కథనం అతి సంగ్రహంగా ఉన్నట్లు స్థూలదృష్టికి సైతం తెలియవస్తుంది. తెలుగు కథ యిలా సాగింది: విక్రమ చోడుడనే రాజు స్వర్ణమయమైన ఒక శివాలయం నిర్మించాడు. ఆలయంలో లింగప్రతిష్ఠ చేశాడు. పూసల నాయనారనే భక్తుడు తన గుండెలో రత్న విమానం గల శివుని కోవెల ఒకటి కట్టాడు. అయినా శివుడు పూసలనాయనారు నిర్మించిన ఆలయాన్ని బహుధా మెచ్చుకున్నాడు. ఆయనకి చివరికి శివలోకప్రాప్తి సిద్ధించింది. (1926లో ఆంధ్రగ్రంథమాల వారు ప్రచురించిన బసవపురాణం, పుట

120)

పూసల నాయనారు కథలోని వైశిష్ట్యాన్ని గ్రహించేందుకు పెరియపురాణంలోని ఆ భక్తుని వృత్తాంతం అవశ్యపఠనీయం. ఆయన పేరు పూసలార్ నాయనారు. తెలుగుదనానికి అనుగుణంగా పూసలార్‌ని పూసలగా మార్చాడు సోమనాథుడు.

సకల సంపదలకు నెలవైన తొండమండలంలో తిరునిండ్రవూర్ (తిణ్ణనూర్) అనే గ్రామంలో ఒక బ్రాహ్మణ కుటుంబంలో పూసలార్ ప్రభవించాడు. (ప్రాచీన కాలంలో కంచి రాజధానిగా గల ఆర్కాటు, చెంగల్పట్టు, నెల్లూరు జిల్లాలతో కూడిన తమిళదేశపు విభాగాన్ని తొండ మండలమని వ్యవహరించేవారు.) ఆయన గొప్ప శివభక్తుడు. సదా శివనామం ఉచ్చరించేవాడు. శివపాదసేవ, శివభక్తుల సేవ సర్వోత్తమములని ఆయన నిశ్చితాభిప్రాయం. శివాలయం ఒకటి నిర్మించాలని ఆయనకి బుద్ధి పుట్టింది. కాని ధనాభావం అందుకు ప్రతిబంధక మయింది. అయినా తన అభిలాషను వదులుకోలేదు. చివరికి ఎలాగయితేనేం కృతకృత్యుడయ్యాడు. తన గుండెలోనే శివుని కోవెల నిర్మించగలిగాడు. ఆ ఆలయంలో లింగ ప్రతిష్ఠ చెయ్యాలని సంకల్పించి, అందుకుగాను ఒక మంచి రోజు కూడా నిర్ణయించాడు.

ఆనాళ్లలో కంచిని కాటవుడనే రాజు పరిపాలించేవాడు. ఆయన కూడా శివభక్తుడే. కంచిలోనే ఆయన శివాలయం పెద్దది ఒకటి నిర్మించాడు. ఆలయంలో శివలింగ ప్రతిష్ఠ కొరకు ఒకమంచి రోజు నిర్ణయించబడింది. ఆరోజుకి ముందురాత్రి శివుడు రాజుకి కలలో దర్శనమిచ్చి, పూసలార్ కట్టిన ఆలయానికి తాను వెడుతున్నట్లుగా చెప్పి అంతర్ధాన మయ్యాడు. ఎవరీ పూసలారు? ఎవరీ పరమభక్తుడు? అనే తపనలో పడిపోయాడు రాజు. పూసలారుని దర్శించాలనే ధ్యాస కలిగింది. తిరునిండ్రవూరుకి పయన మయ్యాడు. గ్రామస్థుల్ని కనుక్కున్నాడు. పూసలార్ నిర్ధనుడనీ, ఆయన ఆలయనిర్మాణం కావించలేదనీ వారు ప్రత్యుత్తర మిచ్చారు. రాజు ఆశ్చర్యంలో మునిగిపోయాడు. వెంటనే ఆయన పూసలారుని సమీపించి స్వప్న వృత్తాంతం తెలియజేశాడు. ఆ భక్తుడికి కలిగిన సంతోషం అంతా ఇంతా కాదు. తన అంతరంగంలోనే ఆలయం నిర్మించినట్లు

సవినయంగా విన్నవించాడు. అంతే. రాజు వినమ్రు డయ్యాడు. భక్తుడికి సాష్టాంగదండ ప్రణామం కావించాడు. అనంతరం తన రాజధానికి తిరిగి వెళ్లాడు. మరణానంతరం శివపాద పద్మాలు చేరుకున్నాడు.

ఈ వివరాలు లోపించిన కారణం వల్ల తెలుగు కథ రంగు రుచి లేక కళకాంతులు లేకుండా కనిపిస్తున్నది. ఇటుకలు మొదలైన వాటితో ఆలయ నిర్మాణం చెయ్యడం కంటే నిర్మలమైన భక్తిభావంతో గుండెలో గుడి కట్టడం శివుడికి ప్రీతిపాత్రమైన కార్యమనే ఉదాత్తభావం అవగతం కావడానికి తమిళ కథ ఎంతగానో తోడ్పడుతుంది. భక్తిభావానికి గల అద్భుత శక్తిని వ్యక్తీకరిస్తుంది పూసలార్ వృత్తాంతం.

మరొక కథ. అడిభర్తుని వృత్తాంతం. ఇది బసవపురాణంలో 36 పాదాలలో చెప్పబడింది. (బసవపురాణం పుట 118). పెరియ పురాణంలో ఈ కథ 80 పాదాలలో తెలుపబడింది. కాగా తెలుగు కథ మరీ సంగ్రహంగా కాక కొంచెం విపులంగా చెప్పబడినట్లు విదిత మవుతుంది.

పాండ్య మండలంలో అడిభర్తుడనే ఒక బెస్తవాడు ఉండేవాడు. అతడు శివభక్తుడు. దొరికే చేపలలో మొదటి దాన్ని శివుని పేరు మీదగా నీళ్లలో వదిలిపెట్టేవాడు. కడమ చేపలు విక్రయించి లభించే ద్రవ్యాన్ని జంగమసేవకు వినియోగించేవాడు. ఇది అతని నిత్యకృత్యం. చేపలు దొరకకపోవడంతో అతడు కొన్నాళ్లకు నిర్ధను డయ్యాడు. ఇలా ఉండగా ఒకనాడు, అతడు నదీతీరానికి వెళ్లాడు. నదిలో వల వేశాడు. అదృష్టం కొద్దీ అతని వలలో ఒక స్వర్ణమత్స్యం పడింది. అలవాటు చొప్పున, ఆ చేపను నదిలోనే విడిచిపెట్టాడు. ఇంకొక చోట వల వేశాడు. మళ్లీ ఆ బంగారు చేపే వలలోకి వచ్చింది. దాన్ని కూడా నదిలోనే విడిచిపెట్టాడు. శివుడికి సొంతమైన ఆ స్వర్ణమత్స్యమే కనక వలలోకి వస్తే, నేనింక వలను ముట్టుకోను, చేపలు పట్టను - అని నిశ్చయించుకున్నాడు. నదిలోకి వలను విసిరివేశాడు. ఈసారి వలలోకి స్వర్ణమత్స్యం కాదు వచ్చింది, సాక్షాత్తు నందివాహనారూఢుడైన శివుడే వచ్చాడు. ఆ తర్వాత అడిభర్తకు ప్రమథేంద్ర పదవి లభించింది. ఇదీ బసవపురాణంలోని కథ.

పెరియపురాణంలోని కథ కనుగుణంగానే తెలుగు కథ చెప్పబడింది.

అయితే కద జరిగింది పాండ్యమండలంలో కాదు; చోళ మండలంలో సముద్రతీరాన ఉన్న నాగపట్టణం పరిసరాలలోని ఒక గ్రామంలో జరిగిన కథ. అడిభర్తుడు తమిళకథలో అతిబత్త నాయనారుగా వర్ణితుడు; అతిభక్తుడు కాబోలు!

కొన్ని కథలలో సోమనాథుడు మార్పు లెన్నో చేశాడు. రుద్రపశుపతి కథ యిందుకు చక్కని నిదర్శనం!

తొలుత పెరియపురాణంలోని కథను తెలుసుకుందాము.

చోళదేశంలో తిరుత్తలైయూర్ అనే ఒక గ్రామం ఉంది. ఆ గ్రామంలో పశుపతి అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయన శివ భక్తుడు. వేదోక్తంగా శివుని ఆరాధించేవాడు. ఒక తటాకంలో మునిగి రుద్రసూక్తం చదివేవాడు. అలా కొన్నేళ్లు గడిచాయి. ఆయన భక్తిభావం శివుడికి నచ్చింది. చివరికి ఆయన శివసాయుజ్యం చెందాడు. రుద్రసూక్తపరనం వల్ల శివసాయుజ్యం చెందడం వల్ల, ఆయన్ని రుద్ర పశుపతి అని వ్యవహరించసాగారు.

సరళమైన యీ కథ బసవపురాణంలో 88 పాదాలలో వివరించబడింది.

అళయూరనే ఒక గ్రామంలో రుద్రపశుపతి అనే భక్తుడు ఉండేవాడు. ఒకనాడు ఆయన ఆదిపురాణంలోని క్షీరసాగరమథనం కథ విన్నాడు. క్షీరసాగర మథనం వల్ల ఉత్పన్నమైన గరళాన్ని శివుడు మింగిన వృత్తాంతాన్ని పౌరాణికుడు వివరించాడు. శివుడు నిజంగా హాలాహలం మింగాడా? అని పశుపతి పౌరాణికుణ్ణి ప్రశ్నించాడు. అవునని సమాధానం వచ్చింది. పశుపతి విషణ్ణ హృదయుడయ్యాడు. "శివా! నిన్ను అందరూ కలిసి అమాయకుణ్ణి చేశారు. ఎవరైనా విషం మింగి ప్రాణాలకు ముప్పు తెచ్చుకుంటారా? హాలాహలం ఆరగించిన తర్వాత సజీవులైన వారెవరైనా ఉన్నారా? ఇప్పుడు నేనేం చెయ్యను? ఎవరు నిన్నింక రక్షిస్తారు? ఆ హాలాహలాన్ని మింగకు. నా కోసమైనా దాన్ని కక్కివేయవయ్యా! గౌరీదేవి! నీవు శివుని సగం శరీరం ఆక్రమించావు గదా! విషం ఆరగించవద్దని నువ్వైనా చెప్పలేక పోయావా? ప్రమథ గణములారా! మరణిస్తే

శివుణ్ణి మీరు మళ్లీ బ్రతికించగలరా? అయ్యో! తల్లిలేని శివుణ్ణి కాపాడే వారు ఎవ్వరు లేరా? తల్లి కనుక ఉంటే, ఆమె ఊరుకునేదా? విషం మింగనిచ్చేదా? నేనిక జీవించలేను; మరణిస్తాను" అంటూ తటాకంలోకి దూకాడు, ప్రాణత్యాగం చెయ్యాలని. అప్పుడు శివుడు ప్రత్యక్షమై ఆయన్ని కాపాడాడు. పార్వతి కూడా ప్రత్యక్ష మయింది. వరమేమన్నా కోరుకొమ్మని శివుడు అడిగాడు. మింగిన విషాన్ని కక్కమని అర్థించాడు పశుపతి. ఆ విషం నన్నేమీ చెయ్యదని శివుడు ప్రత్యుత్తర మిచ్చాడు. అయినా పశుపతికి తృప్తి కలగలేదు. శివుడు కనక విషం కక్కకపోతే, ఆ ముగ్ధభక్తుడు ప్రాణత్యాగం చేస్తాడని పార్వతి సందేహించింది! శివుడు కనుక విషం కక్కితే, తమకు ముప్పు తప్పదని విష్ణువు ప్రభృతులు భయభ్రాంతు లయ్యారు. అప్పుడు శివుడు పశుపతిని తన చేతుల్లోకి తీసుకొని, "నేనీ విషం వల్ల మరణించను. నా మాట నమ్ము. నా ఎడమ తొడనెక్కి నా నీల కంఠాన్ని చూడు" అని శివుడు చెప్పగా, అందుకు సరే అన్నాడు పశుపతి. అలా రుద్ర పశుపతి రుద్రుని నీల కంఠాన్ని పరికిస్తూనే ఉండిపోయాడు.

ఇక తెలుగు తమిళ ఉల్లేఖనాలలో కానవచ్చే భేద సాదృశ్యాలను పరి కిద్దాము.

సోమన వర్ణించిన రుద్ర పశుపతి ముగ్ధభక్తుడు. కాని తమిళ కథనం లోని పశుపతి జ్ఞానభక్తుడు; మొదట పశుపతిగా తుదకు రుద్ర పశు పతిగా దర్శన మిస్తాడు. ఈ అంశం తెలుగుకథనంలో కనిపించదు. అంతేకాదు. సోమనాథుని రుద్ర పశుపతి బ్రాహ్మణుడని స్పష్టంగా తెలి యదు. కథాంతంలో 'రుద్ర పశుపతి భట్టారకుండు' (పుట 56)అనడం వల్ల, ఆయన బ్రాహ్మణుడని తెలియవస్తుంది. ఇకపోతే, సోమన వర్ణిం చిన పశుపతి ముగ్ధబాషణములు తమిళములో కనిపించవు. కాగా, కథ సరిగా తెలియక సోమనాథుడు అలా పేర్కొన్నాడో లేక బుద్ధిపూర్వ కంగానే అలా పేర్కొన్నాడో ఖచ్చితంగా చెప్పలేము. తెలుగు తమిళ కథనముల మధ్య అంతరం మాత్రం స్పష్టంగా కనిపిస్తున్నది. సోమనా థుడు మహాకవి కనుక, ఆయన వర్ణించిన తీరు హృద్యంగా ఉన్నదనడంలో సందేహం లేదు.

సోమనాథుడు చెప్పిన కథలలో చిరుతొండనంబి కథ ఒకటి. ఆయన వ్రాసేనాటికే ఆ కథ ప్రచురప్రచారంలో ఉండినట్లు భావించవచ్చు. ఆయన యిలా పేర్కొన్నాడు.

........... ధరణిలోపలను
గరమ్మరి నూరూర సిరియాళుచరిత
మేటియైచను భక్తకూటువలందుఁ
బాటలుగాఁ గట్టి పాడెదువారు
ప్రస్తుతోక్తుల గద్యపద్య కావ్యముల
విస్తారముగ జేసి వినుతించువారు

ఆ కథను వీరు వారనక అందరూ రోళ్ల రోకళ్ల పాడేవారట! కాని ఆయనకి ముందు రచింపబడిన సిరియాళుని చరిత్ర మనకు లభించకపోవడం మన దురదృష్టం.

సోమనాథుడు చిరుతొండనంబి కథను 186 పాదాలలో తెలియజేశాడు. అయితే చిరుతొండడు, సిరియాళుడు ఒకరేనా? అనే సందేహం కలగవచ్చు తెలుగు పాఠకుడికి. ఇద్దరూ ఒకరే. అయితే, పెరియ పురాణం అనుసరించి చిరుతొండనంబి అసలు పేరు పరంజ్యోతి. ఆయన తనను శివభక్తులలో చాలా చిన్నవాడుగా (అల్పజ్ఞుడుగా) భావించుకున్నాడు. అందువల్ల చిరుత్తొండర్ అయ్యాడు. తెలుగులో చిరుతొండడయ్యాడు. బహుశః ఆనాటి భక్తులు చిన్నవాడు లేక అల్పజ్ఞుడు అనే అర్థం స్ఫురించే సిరియాళనే పేరుతో చిరుతొండనంబిని వ్యవహరించేవారేమో! సిరియాళ శబ్దం తమిళంలో లేకపోయినా సిరియ (చిన్న) ఆళ్ (మనిషి, వ్యక్తి) అనే మాటలు తమిళంలో వాడుకలో ఉన్నాయి. కాలక్రమాన చిరుతొండనికి పర్యాయపదంగా తెలుగుభక్తులు సిరియాళుడని వ్యవహరించి వుండవచ్చు. సోమన సిరియాళ శబ్దాన్ని గ్రహించాడు

సోమనాథుణ్ణే అనుసరించి శ్రీనాథుడంతటి మహాకవి హరవిలాసంలో చిరుతొండనంబి కథను మధురమోహనంగా చిత్రించాడు. కాని ఆ కవి సత్రమాట్టు చిరుతొండడనే వ్యవహరించాడు; సిరియాళుడని చెప్పలేదు. పరంజ్యోతి పేరు సోమనాథుని కథనంలో లేకపోవడం చింత్యం! అందువల్ల పరంజ్యోతికి సంబంధించిన పెక్కు విషయాలు బసవపురాణంలో

చోటు చేసుకోలేదు. పరంజ్యోతి చారిత్రక వ్యక్తి; కల్పితవ్యక్తి కాదు. ఇక తెలుగు తమిళ కథనాలలో కానవచ్చే పేర్ల గురించి:

| పెరియపురాణం | బసవపురాణం | హరవిలాసం |
|---|---|---|
| పరంజ్యోతి (అసలు పేరు) చిరుత్తొండర్ | కథాంతంలో చిరుతొండని పేరు కానవచ్చినా, కథ అంతటా సిరియాళు డుగా వ్యవహృతుడు. | చిరుతొండనంబి |
| తిరువెంగాట్టునంగై (భార్య) | తిరువెంగాణినంగ లేక సంగళవ్వ | తెరువెంగనాంచి |
| చందనిక (దాది) | చందన నంగ | చందనిక |
| సీరాళన్ (కొడుకు) | సీరాలుడు | సిరియాలుడు |

పెరియపురాణం కథనం ప్రకారం పరంజ్యోతి చోళదేశానికి చెందిన వాడు. మహామాత్య బ్రాహ్మణుడు. వేదశాస్త్రాలు నేర్చినవాడు. ఆయు ర్వేదంలో కూడా ఘటికుడు. ఆయన నరసింహవర్మ పల్లవుని మంత్రి; సైన్యాధిపతి కూడా. రాజాజ్ఞ ననుసరించి ఆయన వాతాపి మీదికి ససై న్యంగా దండెత్తి వెళ్లాడు. విజయం సాధించాడు. రాజుకి ఎక్కడలేని సంతోషం కలిగింది. ఘనంగా సత్కరించాడు. ఆయన మహావీరుడే కాక ప్రముఖ శివభక్తుడని కూడ రాజు తెలుసుకున్నాడు. అలాంటి భక్త శిఖా మణిని యుద్ధభూమికి పంపి పాపకార్యము తలపెట్టినందుకు పశ్చాత్తాపం చెందాడు. ఆయన్ని శివసేవలో జీవితశేషం గడపమని రాజు అర్థిం చాడు. మంత్రిపదవి నుంచి విముక్తుణ్ణి చేశాడు. తదాదిగా పరంజ్యోతి స్వస్థలానికి వెళ్లి శివపాదసేవలో కాలం గడపసాగాడు.

ఈ వివరాలు తెలుగు కథలో లేకపోడవం వల్ల, తెలుగు పాఠకుడికి పరంజ్యోతి ఒక్క శివభక్తుడుగానే కనిపిస్తాడు. కేవలం శివభక్తుడుగా మాత్రమే పరంజ్యోతిని చిత్రించాలనే ఉద్దేశంతో సోమనాథుడు పై విషయాలను త్యజించి వుంటాడు. కాని సోమన పరంజ్యోతిని వైశ్య కులస్థునిగా చెప్పడానికి తగిన ఆధారం ఏమీ కనిపించడం లేదు. బహుశః చిరుతొండనంబి కథను తెలియజేసిన భక్తులు అలా తెలియజేశారా అనే సంశయం కలుగుతున్నది!

ఇక తరువాత జరిగిన కథ తెలుగు తమిళములలో ఇంచుమించు ఒకేవిధంగా ఉన్నది. కాని కథాంతంలో సోమనాథుడు అనవసరమైన మార్పులు చేసి, చిరుతొండనంబి అహంకారయుతుడనే భావం కలిగించాడు. అందువల్ల ఆ భక్తశిఖామణి పాత్రచిత్రణలో లోపం వాటిల్లింది.

శివసన్నిధిని చేరుకున్నాడు చిరుతొండడు. అహంకారం తలకెక్కింది. ప్రమథగణాలను చూసి, నేనేగదా కన్నకొడుకుని చంపి పిమ్మట ఆ మృత జీవిని బ్రతికించుకున్నవాణ్ణి - అని అనుకున్నాడు. ఎంతయుఁ గ్రొవ్వి తానహంకరించి తలపంగ - అన్నాడు సోమనాథుడు. అప్పుడతనికి తగిన బుద్ధి చెప్పాలని శివుడు చిరుతొండనంబిని భూలోకానికి తీసుకు వెళ్లాడు. నిమ్మవ్వ అనే భక్తురాలివద్ద నిలబెట్టాడు. కొమ్ములు తిరిగినవాడైనా గర్వాంధకారంలో పడకూడదనే నీతి మంచిదే అయినా, ముమ్మూర్తులా భక్తుడైన చిరుతొండనంబిని మరొక భక్తుని వద్దకు తీసుకువెళ్లడం, నీతి కరపడం, కథకు పురాణ వాసన కల్పించడం అంత సమంజసంగా కనిపించదు.

నిమ్మవ్వ వృత్తాంతం పెరియ పురాణంలో లేదు. కన్నడ భక్తులు చెప్పగా ఆ కథ వినివుంటాడు సోమనాథుడు. కక్కయ్య, సడ్డవ్వ మరి కొందరు కన్నడ భక్తులకు తన రచనలో ఆయన స్థానం కల్పించాడు. ఏమైనా చిరుతొండని పాత్రకు నిర్హేతుకంగా మచ్చ కల్పించడం భావ్యం కాదు.

సోమనాథునివలె, శ్రీనాథుడు కూడా కథలో క్రొత్తవిషయాలు కొన్ని చొప్పించాడు. ప్రతిఘట్టంలోనూ మాయాజంగము వేషంలో ఉన్న శివుడు జోక్యం చేసుకోవడం అనుచితంగా కనిపిస్తుంది. తన ఒక్కగాని ఒక్క కొడుకుని జంగముడికి నైవేద్యంగా సమర్పించడానికి చిరుతొండ దంపతులు సహర్షంగా అంగీకరించగా, మాయాజంగముడు జోక్యం కల్పించుకోవడం అనుచితమూ, అనవసరమూ కూడా. పార్వతి జోగెత వేషం దాల్చి చిరుతొండని భార్య మనస్సుని మార్చడానికి మహా ప్రయత్నించి, చివరికి విఫల మనోరథురాలవుతుంది. ఈ మార్పులు చాలవన్నట్లుగా, శ్రీనాథుడు మరికొన్ని కూడా చేశాడు. అచ్చమైన పురాణ వాతావరణం కల్పించాలని కాబోలు, చిరుతొండడు తుంబురు

డనీ, సిరియాలుడు కుమారస్వామి అనీ, తిరువెంగనాంచి గంధర్వాంగన అనీ, చందనిక అప్సరస స్త్రీ అనీ, కొన్ని కారణాలవల్ల వారు భూలోకంలో ప్రభవించారనీ పేర్కొన్నాడు. ఇలా చిరుతొండని కథకు చిలవలు పలవలు చేర్చారు తెలుగు కవులు.

తాను పేర్కొన్నట్లుగా, సోమనాథుడు భక్తులవల్ల విన్న విశేషాలను గ్రంథస్థం చేసినట్లు భావించవచ్చు. వీరశైవ మతానుయాయి కావడం వల్ల, ఆయన వైదిక శైవానుగుణంగా సంతరించబడిన పెరియపురాణాన్ని పూర్తిగా అనుసరించలేదు. రుద్ర పశుపతి నాయనారు, పరంజ్యోతి (చిరుతొండనంబి) మొదలైన వారు వేద విదులైన బ్రాహ్మణులు. వారి కథలలో పెక్కు మార్పులు కానవస్తాయి. చోళదేశస్థుడైన సైన్యాధిపతి (పరంజ్యోతి) కాంచీపురమునకు చెందినవాడుగా చిత్రించబడ్డాడు. బసవపురాణం ప్రథమముద్రణకు (1926) అమూల్యమైన పీఠిక వ్రాసిన వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, ఏదో ఒక తమిళ గ్రంథం ఆధారం చేసుకుని సోమన అరవైముగ్గురు భక్తుల కథలు రచించి వుండవచ్చుననీ (పుట 29), సేక్కిళారు పెరియపురాణాన్ని సంప్రతించి వుండవచ్చుననీ తమ అభిప్రాయం వెల్లడించారు. పండితారాధ్య చరిత్రకు (1939) 348 పుటల బృహత్పీఠిక వెలయించిన చిలుకూరి నారాయణరావుగారు 'సోమనకు పెరియపురాణము తెలియదు' అని పేర్కొన్నారు. సంస్కృతాంధ్ర కర్ణాట భాషాకోవిదుడైన పాల్కురికి సోమనాథుడు ద్రావిడ భాషాభిజ్ఞుడని నా అభిప్రాయం. శైవులకు పరమ ప్రీతిపాత్రమైన పెరియపురాణం పేరు ఆయన వినివుంటాడు. ఆ కావ్యాన్ని పూర్తిగా అనుసరించక పోయినా, తత్కావ్యగత విశేషాలు ఆయనకి తెలిసివుండవచ్చు; బుద్ధిపూర్వకంగా కొందరు భక్తుల కథలలో మార్పులూ చేసి వుండవచ్చు.

సుందరమూర్తి నాయనారు వెలయించిన తిరుత్తొండత్తొగై సోమనాథునికి తెలుసు. అయినా అరువది ముగ్గురు నాయన్మారుల పేర్లు గల యీ రచనను ఆయన యథాతథంగా అనుసరించలేదు. ఇందుకు సాక్ష్యంగా బసవపురాణంలోని యీక్రింది పాదాలను ఉదాహరించవచ్చు.

తమిళ మూలాన్ని అనుసరించి ప్రతిభక్తుని పేరు చివర బంట, భృత్యుండ, బంటు బంట, దాసాను చాసి అని యీవిధంగా పేర్కొ

న్నాడు. తమిళంలో అడియేన్ అని ఉన్నది. అడియేన్, బంటు శబ్దాలు సమానార్థకాలు. తమిళమూలం ఇలా సాగింది:

తిల్లైవాళ్ అన్దనర్ తం అడియార్క్కుం అడియేన్
తిరునీలకంఠ తుక్కుయవనార్క్ డియేన్
ఇల్లైయే యెన్నాద ఇయర్పగైక్కుం అడియేన్
ఇలైయన్దాని కుడిమారన్ అడియార్క్కుం అడియేన్.

బసవపురాణ రచన యిలా సాగింది: (పుట 122)

ధర రాజ్యమొల్లక తిరుముడి దాల్చి
పరము నమ్మిన తిరుపాలుని బంట
దిరునావకపురీశు కరుణ బ్రాణేశు
నిరవెర్గి కొల్చిన తిరుకుర్పి బంట
ధర రోహిణియు దాను హరుకృప జనిన
తిరువూరి తిరుమూలదేవుని బంట
చన్న పురాతన సానుల బంట
నున్న నూతన భక్త యూథంబు బంట

కాని ఆశ్చర్య మేమిటంటే, తిరుత్తొండత్తొగైలోని మొదటి పాదమైన 'తిల్లైవాళ్ అన్దనర్ తం అడియార్క్కుం అడియేన్' ను సోమనాథుడు పూర్తిగా పరిహరించాడు. తిల్లై అనగా చిదంబరం - చిదంబరంలోని శైవ బ్రాహ్మణులకు బంటునని యీ పాదానికి అర్థం. చిదంబరంలోని కనకసభలో నటరాజస్వామి ఆనందతాండవం చేశాడు. కనక సభను తిరు చిట్రంబలం అంటారు. తిరునావుక్కరశర్, తిరుజ్ఞాన సంబంధర్, సుంద రమూర్తి - ఈ ముగ్గురు నాయన్మారుల పాటల సంకలనమైన తేవారం పఠనానికి ముందు వెనకలలో శైవులు 'తిరు చిట్రంబలం' అనడం సంప్రదాయం. వైదిక శైవానికి నెలవైన చిదంబరమును గాని, చిదంబరంలోని వేద విప్రుల్నిగాని స్మరించడానికి సోమనాథునికి ఇష్టం లేదనవచ్చు. కాని చిదంబరాన్ని త్యజించడమూ యుక్తం కాదు. కనుక అరువది ముగ్గురు నాయన్మారుల పట్టికలో లేకపోయినా, సోమనాథుడు తిరుచిట్టంబలుని పేరుని చొప్పించాడు. పండితారాధ్య చరిత్రలో ఆయన అంటాడు గదా:

భువి నరువద్దాది మువ్వురిలోన
శ్రీ నిలయుడు దిరు చిట్టంబలుండు
నా నొక్క భక్తుడు ....... (పుట 42)

తిరు చిత్రంబలం అని ఉచ్చరించక, తిరుచిట్టంబలం అని ఉచ్చరించి సోమనాథుడు తృప్తిపడి వుండవచ్చు. కాగా ఈ తిరుచిట్టంబలుడు సోమనాథుడు సృష్టించిన పేరు కావచ్చు. కాని చిలుకూరి నారాయణరావు గారు, తిరుచిత్రంబల నాయనారు పేరు ఒక శాసనంలో కానవస్తున్నదని పేర్కొన్నారు. (పండితారాధ్య చరిత్ర పీఠిక, పుటలు 304-6) మరి యీ తిరుచిత్రంబలు డెవరో?

అరవై ముగ్గురు శివభక్తుల కథలను వివరించే పెరియ పురాణం శైవులకు పరమ ప్రీతిపాత్రమూ ప్రామాణికమూ అయిన గ్రంథ మనడం నిర్వివాదం. అలాగే వారందరూ కాకపోయినా కొందరి కథలను హృద్యంగా తెలియచేస్తున్న బసవ పురాణం తెలుగు శైవులకు ప్రామాణికమైన రచన అనడం నిర్వివాదం. అయినా, పెరియపురాణంలోని కథలు తెలుగు రచయితల్ని అలరించినట్లు పేర్కొనవచ్చు. ఆ కథలను భక్త లీలా మృతము అనే పేరున 1900లో ఒమాండూరు (వైద్యం శ్రీనివాస) దొరసామయ్యగారూ, శ్రీ శివభక్త చరితము అనే పేరున 1962 లో పొంగూరు సూర్యనారాయణ శర్మ గారూ వచనంలోకి అనువదించారు.

# 8. తమిళాంధ్ర నవ్యకవిత్వములు

నవ్యకవిత్వం అనగానే తెలుగులో గురజాడ అప్పారావు, తమిళంలో సుబ్రహ్మణ్య భారతి స్ఫురణకు వస్తారు. వీరిద్దరూ నవయుగ వైతాళికులు; మానవతావాదులు. స్త్రీ జనాభ్యుదయాన్ని కాంక్షించిన అభ్యుదయ వాదులు. ఇలా చెప్పవలసి వస్తే, ఈ మహాకవు లిద్దరిలోనూ మరికొన్ని పోలికలు కనిపించకపోవు.

1862లో ప్రభవించిన గురజాడ ప్రముఖ నాటక కర్తగా ప్రసిద్ధు డైనా, ఆయన వెలయించిన దేశభక్తి గేయం, పూర్ణమ్మకథ మొద లైనవి ప్రతి సాహిత్య విద్యార్థి మనస్సులోనూ మెదులుతాయి. నిజానికి ఈ రెండూ రచనల్లోనూ ఆయన సాహిత్య దృక్పథం గోచరిస్తుంది. గురజాడ సంభావించిన దేశభక్తి సంకుచిత మయింది కాదు. దానికి ఎల్లలు లేవు. గురజాడ వలె ఆ రోజుల్లో దేశభక్తిని అంత విశాల దృక్పథంతో చూడగలిగిన కవులు మన దేశంలో లేరన్నా అతిశయోక్తి కాదు. గురజాడ కంటే 20 యేళ్లు చిన్నవాడైన భారతిది (1882) అలాంటి దృష్టి కాదు. ప్రముఖ దేశభక్తుడైనా, స్వాతంత్ర్య సమర వీరు డైనా భారతి దేశభక్తి భారత దేశానికే పరిమితం. ఇలా తులనాత్మకంగా పరిశీలించినప్పుడు గురజాడ దృక్పథంలోని వైశిష్ట్యం అవగత మవుతుంది. అంతమాత్రాన భారతిది సంకుచిత దృష్టి అనుకోవడం పొరపాటు. ఆయ నలో అంతర్జాతీయ స్పృహ స్పష్టంగా కనిపిస్తుంది. మహా క్రూరుడైన జార్ చక్రవర్తి పతనానికి దారి తీసిన రష్యన్ విప్లవం ప్రపంచ చరిత్రలో ఒక ప్రముఖ ఘట్టం. ఆ విప్లవ ప్రాధాన్యాన్ని గ్రహించి కవిత వెల యించిన భారతీయుల్లో భారతే ఆద్యు డనవచ్చు. పుదియ రుషియా (కొత్త రష్యా) అనే శీర్షికలో ఆయన వ్రాసిన కవిత భారతిలోని ప్రగ తిశీలాత్మక చింతనకీ, సంప్రదాయ విధేయతకీ ప్రబలోదాహరణం. ఈ క్రింది పాదాలు పరిశీలించ దగినవి.

"మహాకాళి పరాశక్తి
కడగంటు చూసింది రష్యాని
'ఆహా' అనేలా అప్పు డక్కడ

ఆవిర్భవించిందొక విప్లవం.

పరమ క్రూరుడు పతన మయ్యాడు
సురలు బుజాలెగర వెయ్యగా
కళ్ల నీళ్లు గుక్కు కుంటూ
దయ్యాలు కన్ను ముయ్యగా
చూశారా యీ వింతను!

ప్రజా రాజ్య మవతరించింది
ప్రజలు కోరుకున్నట్లు
ఒక్క త్రుటి కాలంలో
ప్రజాస్వామ్యం నెలకొన్నదనీ,
దాస్యాని కిక చోటు లేదనీ
దాసు లెవరూ యిక లేరనీ
పిడుగు పడ్డ గోడలా
అంతరించింది ఘోర కలి
కృతయుగం వెలుగు చూడాలి.

భారతి, గురజాడలు వ్యావహారిక భాషోద్యమ నాయకులు కావడం వల్ల, సజీవ భాషకు వారి రచనల్లో పెద్ద పీట లభించింది. అలాగే గేయ చ్ఛందస్సులకూ వారు ప్రాధాన్య మిచ్చారు. ఆ విధంగా కూడా నవ్య సాహిత్య స్వరూపాన్ని తీర్చిదిద్దిన వారయ్యారు. అంతేకాక నవ కవితలో కనిపించే కుల నిరసన, అసమానతల నిర్మూలన, దారిద్ర్య నిర్మూలన మొదలైన అభ్యుదయ భావాలు గురజాడలోనూ భారతి లోనూ పుష్కలంగా కనిపిస్తాయి.

"ఎల్లలోకము ఒక్క యిల్లై
వర్ణభేదము లెల్ల కల్లై
వేల నెఱుగని ప్రేమబంధం వేడుకలు కురియ"

అనే ముత్యాలసరాలలోని పాదాలలో గురజాడ చేసిన కుల నిరసన స్పష్టంగా గోచరిస్తుంది.

వందేమాతరం అనే గేయంలో భారతి యిలా అంటాడు:

'వందేమాతరమని పలికేము - మన
మంతా మన తల్లిని కొలిచేము
జాతి మతాలు నిరసించేము
ఉత్తమ జన్మములమని తలచేము
వేద విదులూ ఒకటే - మరి
వేరెవరైనా ఒకటే!'

బాల బాలికల్ని ఉద్దేశించి రచించిన బాలగీతంలో కూడా భారతి,

'జాతులు లేవే పాపా - కులమున
హెచ్చుతగ్గులు ఎంచుట పాపము'

అని పేర్కొన్నాడు.

గురజాడవారి లవణరాజు కలలో కూడా ఈ కుల నిరసన అద్దం పట్టినట్లు కనిపిస్తుంది.

'మంచి చెడ్డలు మనుజు లందున
ఎంచి చూడగ రెండె కులములు
మంచి యన్నది మాలయైతే
మాలనే అగుదున్'

ఈ సందర్భంలో భారతి చెప్పిన యీ మాటలు పరిశీలించ దగినవి.

'జాతులు రెండే రెండని చాటిన
అవ్వై* పలుకులనే అమృత మనేము
నీతిని పాటిస్తూ పరులకు తోడ్పడుతూ
నివసిస్తే పైవారు, ఇతరులు కింది వారు.'

ఇలా తమిళ తెలుగు సాహిత్యాలలో నవ్య కవిత్వానికి ఆద్యులైన భారతి గురజాడలకు మానవుడు ఆరాధ్య దైవం. అందువల్ల వారు తమ రచనల్ని సామాజిక శ్రేయస్సుకి మీదు కట్ట గలిగారు. పాంచాలి శపథం అనే దీర్ఘ కావ్యానికి మున్నుడి వ్రాస్తూ భారతి చెప్పిన మాటలు గమనించ

---

*అవ్వైయార్ సుప్రసిద్ధ ప్రాచీన తమిళ కవయిత్రి. వివరాలకు నా 'తమిళ విందు'ని చూడగోరుతున్నాను.

దగినవి. "సులభమైన మాటలు, సులభమైన నడక, సులభంగా అర్థం చేసుకోదగిన ఛందస్సు, సామాన్యులు అభిలషించే ఫణితి - ఈ లక్ష్ణాలు కలిగిన కావ్యాన్ని ఈ రోజులలో రచించే కవి తన మాతృభాషకు నవ చైతన్యం కలిగించిన వాడవుతాడు." "క్లిష్టమైన సాంఘిక పరిస్థితుల్ని ప్రదర్శించే ఆధునిక జీవితాన్ని నాటక కర్తలు నిర్లక్ష్యం చేశారు" అని గురజాడ అప్పారావుగారు తమ కన్యాశుల్కం ద్వితీయ ముద్రణ పీఠికలో ఒక చోట పేర్కొన్నారు. ఇలా వీరిద్దరూ సామాన్య మానవుడికి ప్రాధాన్యమివ్వడం ప్రశంసార్హం.

భారతికి తర్వాత తమిళంలో నవ్య కవిత్వాన్ని మరో మలుపు తిప్పినవాడు భారతి దాసన్. ఆయన అసలు పేరు సుబ్బురత్నం. భారతి అనుయాయుడు కావడం వల్ల ఆయన భారతి దాసన్ అయ్యాడు. ఆయన విప్లవ కవిగా (పురట్చిక్కవిజర్) సుప్రసిద్ధుడు. భారతి అనగానే నవ్య కవిత్వం స్ఫురణకు వచ్చినట్లుగా, భారతి దాసన్ అనగానే విప్లవాత్మక భావాలు స్ఫురణకు రావడం పరిపాటి.

పాతకాలపు ఆచార వ్యవహారాలు, మూఢనమ్మకాలు మొదలైనవి నశించి నవ సమాజం వెలుగు చూడాలని భారతిదాసన్ ఆశించాడు. కులభేదాల నిరసన, మతభేదాల ఖండన ఆయన కవితలలో ప్రముఖంగా కనిపిస్తుంది. చదువు సంధ్యలు నలుగురికీ లభ్యం కావాలని ఆయన ఆశించాడు. సమాజంలో సమత నెలకొనాలని ఉద్బోధించాడు. ఈ సమతాదృష్టి వల్లనే ఆయన కవిత్వం ప్రత్యేకతను సంతరించుకుంది. 'లోకం నీది' అనే కవితలో ఆయన భావాలు కొన్ని స్పష్టంగా గోచరిస్తాయి.

"ఆకస మంటే కొండ మీదికి ఎక్కి
అవలోకించు నలువైపులా -
చూడు ఈ లోకపు మనుషుల్ని
చూడు నీ సాటి మానవ సంఘాన్ని
నా జాతి అనే భావనతో
మానవ సముద్రాన్ని చూసి సంతోషించు
జ్ఞానాన్ని విస్తృతం చెయ్యి; అఖండం చెయ్యి
విశాల దృష్టితో ఆకట్టుకో ప్రజను

మానవ సముద్రం నేనని చెప్పు
చీలికలు లేవు భేదాలు లేవు
లోకం తినగా తిను
ధరించగా ధరించు
సంపదలు సర్వజనుల దంటూ
సమష్టి భావనతో సంచరించు
ఆకాశంలా ప్రజను ఆదరించి
అమలమైన ఆదర భావంతో
అల్పబుద్ధులకు సైతం దీన్ని వివరించు"

అలాగే 'కొట్టు భేరీ' అనే కవిత కూడా ఆయన విశిష్ట భావాలకు అద్దం పడుతున్నది.

"ఆనందం అష్టైశ్వర్యాలు
అందరికీ లభ్యమైనప్పుడు
కొట్టు భేరీ - జీవితంలో
పారతంత్ర్యం తొలగిందని
కొట్టు భేరీ
లేమి అనే వ్యాధి లేదనీ
అందరికి చదువు సంధ్యలు కావలెననీ
కొట్టు భేరీ - జీవితంలో
సెబ్బర తీరిపోయిందనీ
కొట్టు భేరీ.
కనిపెంచుట మాతృ ధర్మ మనీ
కృషి చేయుట అందరి ధర్మ మనీ
కొట్టు భేరీ - జీవితంలో
తేనె వాన కురిసిందనీ
కొట్టు భేరీ - "

ఏ భాషకు చెందిన వారయినా, సాధారణంగా విప్లవ కవులలో లీలగా నైనా కరినోక్తి కనిపిస్తుంది. ఇది అనివార్యమన్నా సాహసం కాదు. కాని భారతిదాసన్‌లో కరినోక్తి కనిపించకపోవడం గమనించదగిన విషయం. ఏ

సందర్భంలోనూ ఆయన కఠినోక్తులు పలకలేదు.

బూజుపట్టిన పాత వ్యవస్థ నశించి నవజ్యోతి వెలుగు చూడాలని చెప్పినప్పుడు కూడా, ఆయన లేఖినిలో సారళ్యమే తొంగి చూసింది.

"జాతి మత భేదాలు
మూఢాచారాలు నిండిన
ఈ కయ్యాల జగతిని
గాలిలో ధూళిగా చేసి
ఆవల నిర్మూలింతము
నవ జగతిని నిర్మింతము."

అని అన్నాడు. తరువాతి కాలంలో ఆయన ద్రావిడోద్యమ కవిగా రూపొందాడు.

తెలుగులో భారతిదాసన్ వంటివాడు శ్రీ శ్రీ. వీరిద్దరూ తమ సాహిత్యాలలో పాత పుంతలకు స్వస్తి చెప్పి కొత్త పుంతలు స్వీకరించిన వారే. ఇద్దరికీ భాషమీద గల అధికారం అనిర్వచనీయం. అయితే భారతిదాసన్ రచనలో గ్రాంధికభాష ప్రయుక్తం. వ్యావహారిక భాషావాది శ్రీ శ్రీ. విప్లవ భావ వ్యక్తీకరణలో ఇద్దరూ వెనుకాడ లేదు. అన్ని విషయాలూ కవితకు అర్హములని యిద్దరూ చాటిన వారే. అగ్గిపుల్ల, కుక్కపిల్ల, సబ్బుబిళ్ల మొదలైనవన్నీ కవితా వస్తువులని శ్రీ శ్రీ స్పష్టం చెయ్యగా, సినిమా, భేరీ మొదలైన విషయాలను పురస్కరించుకుని భారతి దాసన్ కవితలు వెలయించాడు.

అసమానతలు తొలగి నవ సమాజం ఏర్పడాలని శ్రీ శ్రీ పెక్కు కవితలలో శంఖారావం చేశాడు.

"ఈ కత్తి
బూజు పట్టిన భావాలకి
పునర్జయం ఇవ్వడానికి కాదు
కుళ్లిపోతున్న సమాజ వృక్షాన్ని
సమూలచ్ఛేదం చెయ్యడానికి,
దీన్ని,

నల్ల బజారు గుండెల్లో దించు
దీనితో
కల్ల కపటాలను వధించు
ఇది
సమాన ధర్మాన్ని స్థాపిస్తుంది
నవీన మార్గాన్ని చూపిస్తుంది"

ఈ పాదాలు ఆ మహాకవి 'ఖడ్గ సృష్టి' లోనివి.

జాబిల్లిని సంబోధిస్తూ ఆ మహాకవి చెప్పిన యీ కింది పాదాలు ఆపాత మధురములే కాక ఆలోచనా రమణీయములు కూడా.

"ఇదిగో మాట! ఈ ప్రపంచంలో
ఇంకా ఎందరో అభాగ్యు లున్నారు
పలకరించు వాళ్లని చల్లగా
ధైర్యం చెప్పు వాళ్లకి మెల్లిగా
మురికి గుడిసెల్లో నివసించే
పరమ దరిద్రుల నుదుటి మీద
ఏ కన్నంలోంచో జాగా చేసుకుని
ఎలాగైనా పరామర్శ చేస్తావు కదూ?"

సినిమా కవిగా సుప్రసిద్ధుడైన కణ్ణదాసన్ తమిళ నవ్య కవిత్వాన్ని సుసంపన్నం చేసిన వారిలో ప్రముఖుడని నిస్సంశయంగా పేర్కొనవచ్చు. ఆయన కొన్నివేల గీతాలు రచించాడు. అవి కాక ఎన్నో కవితలు కూడా వెలయించాడు. ఆ గీతాలలో కవితామృతం జాలువారుతున్నట్లు పండితులు సైతం గుర్తించడం ప్రశంసార్హం. భారతి, భారతిదాసన్, కణ్ణదాసన్ - ఈ ముగ్గురినీ తమిళ నవ్య కవిత్రయంగా విమర్శకులు సంభావిస్తున్నారు.

మహాకవులుగానే కాక సినిమా కవులుగా కూడా లబ్ధ ప్రతిష్ఠులైన దేవులపల్లి వెంకట కృష్ణశాస్త్రి, శ్రీ శ్రీ ప్రభృతుల్ని ఈ సందర్భంగా తెలుగువారు సగర్వంగా స్మరించుకోవడం సమంజసం. ముఖ్యంగా కృష్ణ శాస్త్రి, శ్రీశ్రీల సినిమా పాటలలో కూడా ఉదాత్త భావాలు, ఉత్తమ

కవిత అందాలు దిద్దుకున్న విషయం తెలుగువారికి తెలియంది కాదు. ఈ విషయమై పర్యాప్త పరిశీలన జరగడం అవసరం. అప్పుడుగాని మన సినిమా పాటలలో కూడా కమనీయ కవిత చోటు చేసుకున్నట్లు సలుగురికీ తెలియదు.

భారతి శ్రీకారం చుట్టిన తమిళ వచన కవిత యింకా ప్రచుర ప్రచారం అందుకోలేదనీ, నేడు వెలువడుతున్న వచన కవితలకు పండితుల ఆదరాభిమానాలు అంతగా లభించడం లేదనీ చెప్పవచ్చు. పండితులలోగాని పాఠకులలోగాని చాలామంది సంప్రదాయబద్ధమైన కవితను, గేయచ్ఛందస్సులీ్ని అభిమానిస్తున్నారు. అయినా వచన కవిత వెలువడుతూనే వుంది. చక్కని వచన కవితలు వెలయించిన పెద్దలలో న.పిచ్చమూర్తి, సి.సు.చెల్లప్ప, క.నా.సుబ్రహ్మణ్యం ప్రభృతులు ప్రముఖులు.

తెలుగులో వచన కవిత్వం స్థిరపడినట్లు స్థూల దృష్టికి కూడా తెలియకపోదు. అది ఒక ఉద్యమంగా కొనసాగింది. తొలిరోజుల మాట ఎలా ఉన్నా, ఈనాడు ఇంచుమించు తెలుగు కవు లందరూ వచన కవిత్వాన్ని సహర్షంగా అభిమానిస్తున్నారు. ఇది వచన కవితాయుగం అన్నా సాహసం కాదు. వచన కవితా సంపుటాలు చుబ్బన చూరలుగా వెలువడుతున్న విషయం ఈ ప్రక్రియకు గల ప్రచారాన్ని ప్రశస్తినీ వ్యక్తం చేస్తున్నది. నిజానికి శ్రీశ్రీ, బాలగంగాధర తిలక్, కుందుర్తి ఆంజనేయులు మొదలైన ప్రముఖులు చిక్కనీ చక్కనీ వచన కవిత లెన్నో వెలయించి ఆ ప్రక్రియను పరిపుష్టం చేశారు.

ఇటీవలి కాలంలో తెలుగులోను తమిళంలోను యువకవులు పలువురు ఆర్థిక అసమానత్వం, నిరుద్యోగ సమస్య మొదలైన వాటిని ఇతివృత్తాలుగా స్వీకరించి కవితలు సంతరిస్తున్నారు. అవకాశం లభ్యమైనప్పుడెల్ల విప్లవ భావాలను ప్రత్యక్షంగానో పరోక్షంగానో ప్రకటిస్తున్నారు. కనుక భక్తి, తాత్త్విక చింతన మొదలైన వాటి ప్రాబల్యం యువకవుల రచనలలో లేదనడం సత్య సన్నిహితం. జాతీయ దృష్టి, అంతర్జాతీయ భావన కొందరి రచనలలో గోచరిస్తున్నాయి. ఇది మంచి పోకడగా భావించవచ్చు.

ఈనాడు తెలుగు తమిళ భాషలలో వచన కవితలు, మినీ కవితలు పరశ్శతంగా వెలువడుతున్నాయి. ప్రత్యేక సంపుటాలుగానే కాక పత్రిక

లలోనూ వెలువడుతున్నాయి. తెలుగులో పెద్ద, చిన్న పత్రికలు మినీ కవితల్ని సరిసమానంగా ప్రోత్సహిస్తుండగా, తమిళంలో చిన్న పత్రికలు వాటికి ఎక్కువ ప్రాధాన్య మిస్తున్నాయి.

వ్యంగ్య ప్రధానాలు ఆలోచనా రమణీయాలూ కావడం వల్ల మినీ కవితలు - తెలుగులోనైనా సరే తమిళంలోనైనా సరే - పాఠకుల్ని అనాయాసంగా ఆకర్షించ గలుగుతున్నాయి. అవి నేటి సమాజానికి మణి దర్పణాలుగా ప్రతిభాసిస్తున్నాయి. వివిధ సాంఘిక రాజకీయ పరిస్థితుల్ని అవి సూటిగా తెలియజేస్తున్నాయి. డొంక తిరుగుడు, పులుముడు మొదలైనవి లేకుండా స్పష్టంగా సంగ్రహంగా ఉండడం మినీ కవితలోని ప్రత్యేకత. తెలుగు, తమిళ మినీ కవితల్ని అలవోకగా పరిశీలించినా ఈ అంశం తెలియక పోదు.

'రాత్రి వేళ వచ్చింది
ఇంకా తెల్లారనే లేదు'

ఒక తమిళ రచయిత మన స్వాతంత్ర్యాన్ని వ్యాఖ్యానించిన తీరు ఇది. ఈ రెండు చిన్న పాదాలలో గంభీరార్థం ఇమిడి వుందని వేరుగా చెప్పనవసరం లేదు.

అబ్దుల్ రహమాన్ అనే కవి దృష్టిలో స్వాతంత్ర్యదినం ఒక 'అద్భుత మైన రోజు'. ఎందుకంటే: అది 'పిల్లలు తల్లిని కన్న రోజు.' స్వాతంత్ర్య సమరయోధుల శక్తియుక్తులకు ఫలితంగా మనకు స్వాతంత్ర్యం లభిం చిందన్న విషయాన్ని ఆయన చమత్కార పూర్వకంగా తెలియజేశాడు.

స్వాతంత్ర్యాన్నే కమలా మణాళన్ అనే మరో రచయిత మరో విధంగా దర్శించాడు.

"భారత మాత
ఇద్దర్ని కన్నది
ఒకరు స్వాతంత్ర్యం
మరొకరు స్వార్థం.
పెద్దది స్వాతంత్ర్యం
ఇద్దర్ని కన్నది

ఒకరు ప్రజాస్వామ్యం
మరొకరు సోషలిజం.
ప్రజాస్వామ్యమూ ఇద్దర్ని కన్నది
ఒకరు వోటు
మరొకరు దొంగ వోటు
పెద్దది సుందరి
చిన్నది కురూపి"

వ్యంగ్య వైభవం మూర్తీభవిస్తున్న యీ క్రింది కవితని (మట్టీ మంత్రీ) పరిశీలించండి. రచయిత జ్ఞాన కూ్కాత్తన్.

"రాముని పాదం తగలగా
రాళ్లన్నీ విరులైనవట!
ఇందులో ఏముంది వింత?
మా మంత్రిగారి పాదం తగలక మునుపే
మట్టికి ఏదేదో జరిగింది."

మంత్రిగారి రాకను పురస్కరించుకుని ఒక ఊరు సంతరించుకునే మార్పులు చేర్పుల్ని కవి మనోహరంగా తెలియజేశాడు.

వ్యంగ్య ప్రధానంగా కనిపించినా, కొన్ని మినీ కవితలు విందు భోజనం చేసిన అనుభూతిని కలిగించడం లేదు, ఏదో ఒక మధుర భక్ష్యం చవి చూచిన అనుభూతిని మాత్రమే కలిగిస్తున్నాయి. బహుశః యిందుకు కారణం వీటిలో తాత్త్విక చింతన లోపించడం కావచ్చు. లేదా చమత్కారపు పాలు ఎక్కువ, ఆలోచింపజేసేది తక్కువ - కారణం కావచ్చు.

చమత్కార భరితములైన మినీ కవితలు తెలుగులో కూడా చాలా వెలువడుతున్నా, కొన్ని కవితలలో ఒక విధమైన తాత్త్విక చింతన చోటు చేసుకోవడం గమనించదగిన విషయం. ఆ తాత్త్విక చింతన వల్ల, ఆ కవితలకు పుష్టి కలిగింది.

"పుటక నీది
చావు నీది
బ్రతుకంతా దేశానిది."

ప్రముఖ దేశభక్తుడు జయప్రకాశ్ నారాయణ్ మీద ప్రసిద్ధకవి కాళోజీ చెప్పిన గొప్ప కవిత యిది. జనన మరణాలు వ్యక్తి నిష్టములు. కాని అతని బ్రతుకు దేశానికి అంకితం కావాలనే గొప్ప విషయం ఈ పాదత్రయంలో సూచించబడింది. తన జీవిత మంతా దేశం కోసం త్యాగం చేసిన మహనీయుడు జయప్రకాశ నారాయణ అనే అంశం యీ కవితలో స్పష్టం చేయబడింది.

జీవితం వ్యధాభరితమనే పరమ సత్యాన్ని 'వసీరా' ఈ క్రింది కవితలో వ్యక్తం చేసిన వైనం పరిశీలనార్హం.

"కాళ్ళు తడవకుండా
సముద్రాన్ని దాటగల మేధావి యైనా
కళ్లు తడవకుండా
జీవితాన్ని దాటలేడు."

కాళ్లు తడవకుండా మేధావి సముద్రాన్ని దాటవచ్చు. ఆ మేధావి కూడా కన్నీరు కార్చకుండా జీవితాన్ని దాటలేడు. అనగా జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు వ్యధ చెంది కన్నీరు కార్చడం మానవ సహజం.

పురుష సహజమైన ఒక అంశాన్ని చల్లా రాధాకృష్ణశర్మ 'మగధీరుడు'లో వ్యక్తం చేసిన తీరు పరిశీలించండి.

"మగధీరుడిలో విశిష్టత?
కొంగు పట్టుకు తిరగడం
చిన్నప్పుడు తల్లిది
పెద్దయ్యాక భార్యది"

ఇలా తెలుగు మినీ కవితలు వైవిధ్యానికి అద్దం పడుతున్నాయి. జీవిత సత్యాన్ని చమత్కార భరితంగా చెప్పినప్పుడు, అది మనోహరమైన మినీ కవితగా రూపొందగలదు. ఆ జీవిత సత్యం తాత్త్వికం కావచ్చు; సామాజికం కావచ్చు.

తమిళ యువకవులలో ము.మెహతా, నా.కామరాజన్, మీరా ప్రభృతులు సంభావ్యులు. వీరి కావ్య శీర్షికలు బట్టి వీరి దృక్పథం ఇదమిత్థమని

గ్రహించవచ్చు కణ్ణీర్ పూక్కళ్ (కన్నీటి పూలు) అనే కవితా సంపుటికి కర్త మెహతా. కరుప్పు మలర్ గళ్ (నల్లని పూలు) అన్నది కామరాజన్ కవితా సంపుటి. తెలుగు దిగంబర కవుల ప్రభావం ఆయన కవితలలో కనిపిస్తున్నదనవచ్చు. మీరా (మీ. రాజేంద్రన్) కనవుగళ్ + కర్పనైగళ్ = కాగితంగళ్ (కలలు + కల్పనలు = కాగితాలు) అను సంపుటి వెలయించాడు.

కొ.చ. బలరామన్ అనే ఆయన 'కూలి' అనే కవితలో మనలో పాతుకుపోయిన ఒక అంధ విశ్వాసాన్ని యిలా వ్యక్తం చేశాడు.

"అమ్మవారి
వేషం వేసుకుని
వీధిలో నడిస్తే
ఒడినిండా బియ్యం.
బుద్ధి నుపయోగించి శ్రమించినా
నాట్యమాడి శ్రమించినా
తగిన కూలి లేదు."

ఇలాంటి భావాలను మన తెలుగు కవులు కూడా వ్యక్తం చేశారు.

తెలుగులో గాని తమిళంలో గాని నవకవితలు వెలయించే వారిలో చాలా మంది అభ్యుదయవాదులు. వారందరి ధ్యేయం సామాజిక శ్రేయస్సు. అయితే అందుకు వారు సూచించే మార్గాలు విభిన్నాలై ఉండవచ్చు. నూతన భావాలను ఆవిష్కరించడానికి సజీవమైన వ్యావహారికాన్ని ఉపయోగిస్తున్నారు. తెలుగు కవులైతే కొందరు మరీ వ్యావహారికాన్ని ఉపయోగిస్తున్నారు. తమిళ కవులలో, భాషకు సంబంధించినంత వరకు, సంప్రదాయవిధేయత చాలా వరకు కనిపిస్తున్నది. వాడుక తమిళ భాషను వాడడానికి వెనుకంజ వేస్తున్నారు. వాడుక తమిళంలో సంస్కృతాది అన్య భాషా శబ్దాలు కలిసి వుండడం వల్ల, సంప్రదాయ బద్ధమైన గ్రాంథికాన్ని వాడడమే వాంఛనీయమని వారిలో కొందరు భావించి వుండవచ్చు.

ఆధునికాంధ్ర కవితారంగంలో భావ, అభ్యుదయ, దిగంబర, విప్లవ కవిత్వాది ఉద్యమాలు కనిపిస్తాయి. ఇలా విభిన్న ధోరణులు కనిపిం

చడం ఆరోగ్య హేతువుగా భావించవచ్చు. కాని తమిళ నవ్య కవిత్వంలో ఇలా విభిన్న ధోరణుల్ని సూచించే ప్రత్యేక శీర్షికలు లేవు. నవ్య కవిత్వాన్ని తర్కాల కవితై (నేటి కాలపు కవిత్వం) అని వ్యవహరిస్తున్నారు. భారతి, భారతిదాసన్‌ల కవిత్వాన్ని కూడా ఈ పేరుతోనే వ్యవహరిస్తున్నారు. అనగా నేటికాలంలో వ్రాయబడినా, యిది సంప్రదాయ కవిత అని వారి అభిప్రాయం కాబోలు. సంప్రదాయానికి విరుద్ధంగా వెలువడుతున్న వచన కవితను పుదుక్కవితై అని వ్యవహరిస్తున్నారు. కొత్త కవిత, వచన కవిత, సంప్రదాయానికి భిన్నమైన కవిత - అని పుదుక్కవితైకి అర్థాలు చెప్పవచ్చు.

మొత్తం మీద తమిళాంధ్ర నవ్య కవిత్వ క్షేత్రాలలో జరుగుతున్న కృషి ప్రశంసార్హమనీ, తత్ఫలితంగా బంగారు పంటలు పండుతున్నాయనీ భావించవచ్చు.

# 9. వీరేశలింగం - భారతి

కందుకూరి వీరేశలింగమూ (1848-1919) సుబ్రహ్మణ్య భారతి (1882-1921) ఉత్తర దక్షిణ ధ్రువాలుగా కనిపించవచ్చు. స్థూల దృష్టికే ఇలా తెలియవస్తారు. సూక్ష్మంగా కనుక పరిశీలిస్తే, ఆ మహా పురుషు లిద్దరి లోనూ కొన్ని సామ్యాలు కొట్టవచ్చినట్లు అవగత మవుతాయి. అలాగే కొన్ని భేదాలూ కానవస్తాయి.

ఇద్దరూ నవయుగ ప్రవక్తలు. కందుకూరి వారు నవ్యాంధ్ర నిర్మాతగా పేరు పెంపులు గడిస్తే, భారతి తమిళ నవయుగ ప్రవక్తగా చిరకీర్తి ఆర్జించారు. ఇద్దరూ సాహిత్య వేత్తలే. ఇద్దరూ తమ తమ క్షేత్రాలలో అవిరళంగా కృషి చేసిన వారే. అయితే కందుకూరిది ఒక్క రంగానికి పరిమితమైన కృషి కాదు. ఆయన ఎంత సంస్కార ప్రియుడో అంత భాషాప్రియుడు కూడా. సంస్కారాభిలాష సాహిత్యాభిమానం ఆయనకి వెన్నతో పెట్టిన విద్యలుగా గోచరిస్తాయి. ఆయన కార్యక్షేత్రం సువిశాల మయింది. స్వాతంత్ర్యోద్యమ సాహిత్యరంగాలకు పరిమిత మయింది భారతి కృషి. ఆయనలోనూ సంస్కార ప్రియత్వం కానవస్తుంది. కాని ఆయన సాహిత్య కృషి ముందు ఆ సంస్కార ప్రియత్వం మరుగున పడిపోయింది. అందువల్ల భారతి ప్రధానంగా సాహిత్యోపాసకుడుగానే దర్శన మిస్తాడు. కందుకూరి యేమో బహుముఖ ప్రజ్ఞాశాలిగా స్థూలదృష్టికి కూడా గోచరిస్తాడు. భారతి జాతీయ కవిగా కనిపిస్తే, కందుకూరి కర్మవీరుడుగా కనిపిస్తాడు.

ఇద్దరూ స్త్రీ విద్యాభివృద్ధిని మనసా వాచా అభిలషించిన వారే. స్త్రీ విద్య ఆవశ్యకమని యిద్దరూ గుర్తించారు. అందుకు యధోచితంగా కృషి చేశారు. స్త్రీవిద్య ఆవశ్యకమని గుర్తించడమే కాక కందుకూరి ఆచరణలో కూడా తన ఆశయాలకు స్పష్టమైన రూపం కల్పించారు. ఆయన తన వివేకవర్ధని పత్రికలో స్త్రీలకు విద్యా విజ్ఞానము లవసరములని ఉద్బోధిస్తూ పెక్కు వ్యాసాలు వ్రాశారు. విద్యాధికు లందుకు నడుము బిగించాలని కూడా తెలియజేశారు. స్త్రీ విద్య పట్ల విముఖులైన పెద్దలతో ఆయన వాగ్వాదాలు సాగించి, వారిని తన పక్షానికి

తిప్పుకున్నారు. స్త్రీ విద్య బహూళ ప్రయోజనకారి అని వారు గుర్తించేలా ఆయన పాటు పడ్డారు. స్త్రీ విద్యలో ఆసక్తికల పెద్దల సహాయంతో బాలికా పాఠశాల కూడా స్థాపించారు.

భారతి కూడా పెక్కు వ్యాసాలలో స్త్రీవిద్య దేశ శ్రేయస్సుకి అవసరమంటూ వ్రాశారు. స్త్రీ స్వాతంత్ర్యం అనే వ్యాసంలో ఆయన యిలా అన్నారు. 'స్త్రీవిద్య కనక ప్రచారంలోకి వస్తే స్త్రీలు శీలభ్రష్టులవుతారని ఇరవై ముప్పయి సంవత్సరాలకు మునుపు తమిళనాడులో చాలామంది పేర్కొన్నారు. ప్రస్తుతం తమిళనాడులో స్త్రీవిద్య సర్వసాధారణ మయింది. ప్రపంచ కుడ్యాలు ఇంకా కూలలేదు'. ఆనాళ్లలో స్త్రీ విద్య పట్ల సంఘంలో ఎలాంటి విరుద్ధ భావం ఉండేదో భారతి మాటలు స్పష్టం చేస్తాయి. కాగా ఆ ప్రతికూల భావాలను పెడచెవిని పెట్టి స్త్రీ విద్యాభిమానులు కృషి సాగించవలసి వచ్చిందని చెప్పడం సత్యదూరం కాదు.

వీరేశలింగం అనగానే వితంతు వివాహం బాల్య వివాహ నిరసనం మొదలైన విషయాలు స్ఫురణకు రావడంలో వింత లేదు. ఈ రోజులలో ఈ వివిధ విషయాలు సర్వ సామాన్యములుగా కనిపించ వచ్చుగాని, సంఘంలో స్త్రీకి సమాన ప్రతిపత్తిలేని ఆనాళ్లలో స్త్రీ పునర్వివాహం పాపకార్యంగా నీచకార్యంగా భావించబడేదనడం నిస్సంశయం. అసలా మాటకు సభ్య ప్రపంచంలో తావు లేదు. అలాంటి పరిస్థితులలో వితంతు వివాహం వంటి విషయాలు గురించి వ్రాయడమే కాక వితంతు వివాహాలు జరిపించారంటే వీరేశలింగంలోని సంస్కారాభిలాష ప్రవ్యక్త మవుతుంది. రాజమహేంద్రవరంలో వితంతు శరణాలయం స్థాపించి, దానికి ముప్పయివేల భూరి విరాళం ఇచ్చారు. ఈ విషయం సామాన్య మయింది కాదు!

వితంతు శరణాలయం స్థాపించక పోయినా, భూరి విరాళాలు ఇవ్వకపోయినా సుబ్రహ్మణ్య భారతి కూడా వితంతు వివాహాలను ప్రోత్సహించిన వారే. ఆయన రచనలలో ఈ విషయం కానవస్తుంది. ఆయన అసంపూర్ణ రచన చంద్రిక కథలో వితంతు వివాహప్రసక్తి ప్రముఖంగా కనిపిస్తుంది. ఆ పెద్ద కథలో (అసంపూర్ణ నవలలో) వీరేశలింగం

పంతులూ ఆయన సహధర్మ చారిణి రాజలక్ష్మి పాత్రలు! ఇలా భారతి కందుకూరి దంపతులకు తమిళ సాహిత్య లోకంలో స్థానం కల్పించారు. వీరేశలింగం పంతులు వీట్టిల్ విరున్దు (వీరేశలింగం పంతులు గారింట్లో విందు) అనే అధ్యాయం నుంచి భారతికి కందుకూరి వారి పట్ల గల గౌరవాభిమానాలు వ్యక్తము లవుతాయి. బాల్య వివాహాలను నిరసిస్తూ వితంతు వివాహాలను ప్రోత్సహిస్తూ సంతరించబడిన యీ సాంఘిక నవ లలో విశాలాక్షి అనే బాలవితంతువుని ఉద్దేశించి ఆమె వదినగారు అన్న యీక్రింది మాటలు పరిశీలించదగినవి. 'నాప్రాణం పొయ్యే ముందు నీకు రెండుముక్కలు చెప్పి పోతాను. అవి నువ్వు బొందిలో ప్రాణం ఉన్నంత వరకూ మరిచిపోవద్దు. మొదటిది: నువ్వు పెళ్లి చేసుకో. వితంతు వివాహం చెయ్యదగిందే. స్త్రీ పురుషులు ఒక్క మోస్తరుగానే యముడికి లోబడివున్నారు. అందువల్ల పురుషులకు స్త్రీలు బానిసలుగా, పురుషులకు స్త్రీలు భయపడుతూ ప్రాణ మున్నంతవరకూ అఘోరించి మరణించవలసిన అవసరం లేదు. కనుక పురుషులు వ్రాసిన నీచమైన స్వార్థపూరిత శాస్త్రాన్ని చింపేసి, పొయ్యిలో పడేసి, ధైర్యంగా చెన్నపట్ట ణానికి వెళ్లి, అక్కడ విధవా వివాహాలకు సహాయం చేసే సంఘం వారిని కనుక్కొని, వాళ్లద్వారా మంచి భర్తను పొంది జీవించు.... ..... ' మరొకచోట ఆయన అంటారు గదా- 'భర్త మరణానంతరం స్త్రీ మళ్లీ పెళ్లి చేసుకోడాన్ని నివారించకూడదు.' స్త్రీవిద్య, స్త్రీ స్వాతంత్ర్యం మొదలైన అంశాలు గురించి భారతి పెక్కు వ్యాసాలు వ్రాశారు.

చంద్రిక కథలో భారతి కందుకూరిని గురించి వ్రాసినట్లుగా, కందు కూరి వారు తమ రచనలలో ఎక్కడా భారతిని గురించి వ్రాసినట్లుగా కనిపించదు.

ప్రసిద్ధ దేశభక్తుడు బిపిన్ చంద్ర పాల్‌ని బాలభారత సంఘం పక్షాన ఆహ్వానించడానికి భారతి 1907, ఏప్రిలులో రాజమహేంద్రవరం వెళ్లి నట్లు స్పష్టంగా తెలుస్తున్నది. అప్పుడు బిపిన్ చంద్రపాల్ ఆంధ్రదేశం పర్యటిస్తున్నాడు. ఆ సందర్భంగా భారతి వీరేశలింగం గారిని రాజమ హేంద్రవరంలో కలుసుకుని వుండవచ్చు. ఆంగ్ల ప్రభుత్వాన్ని ప్రతిఘటిం చాలంటూ బిపిన్ చంద్రపాల్ చేసిన ప్రసంగాన్ని వీరేశలింగం గారు

సమర్ధించక పోవడం శోచనీయం.

ఇద్దరూ పత్రికలు నిర్వహించినవారే. అయితే వారి లక్ష్యాలు మాత్రం వేరు. సంఘసంస్కరణోద్దేశంతో, ముఖ్యంగా స్త్రీల సమస్యలు చర్చించేందుకు వీరేశలింగం వివేక వర్ధని అనే మాసపత్రికను సమర్ధంగా నిర్వహించారు. ఆయన ఆశయసిద్ధికి ఆ పత్రిక బహూధా ఉపకరించిన అంశం నలుగురికీ తెలిసిందే. పేరుకు తగినట్లుగా, ఆ పత్రిక మూఢ విశ్వాసాలను తొలగించి వివేకాన్ని పెంపొందించేందుకు తోడ్పడింది. మూఢ విశ్వాస నిర్మూలనోద్యమంలో వివేకవర్ధని ఆయనికి వజ్రాయుధ తుల్యమన్నా సాహసం కాదు.

రాజకీయ ప్రచారం కోసం భారతి 'ఇండియా' అనే వారపత్రికను స్థాపించారు. అంతకు ముందు ఆయన స్వదేశమిత్రన్ దిన పత్రికలో సహాయ సంపాదకుడుగా పని చేశారు. చక్రవర్తిని అనే పత్రికకూ సంపాదకత్వం నిర్వహించారు. కాని 'ఇండియా' ద్వారా భారతి రాజకీయోద్దేశాలు నలుగురికీ తేటతెల్లము లైనాయి; ఆయన పలుకుబడి కూడా పెరిగింది. అది గమనించిన అప్పటి ఆంగ్ల ప్రభుత్వం బ్రిటిష్ ఇండియాలో ఆ పత్రికా పఠనాన్ని నిషేధించడం వల్ల, చివరి కది నిలిచిపోయింది. ఆ పత్రిక ఒకటే కాక, ఆయన పెక్కు పత్రికలు నిర్వహించినట్లు తెలియవస్తున్నది. విజయా అనే దినపత్రిక, సూర్యోదయం అనే వారపత్రిక, బాలభారతమనే ఆంగ్ల వారపత్రిక, కర్మయోగి అనే ఆంగ్ల మాసపత్రిక మొదలైన వాటిని కొంతకాలమే నిర్వహించగలిగారు; ఆర్థికాది కారణాల వల్ల అవి తరువాత నిలిచిపోయాయి. చిత్రావళి అనే ఆంగ్ల - తమిళ కార్టూన్ (వ్యంగ్య చిత్ర) పత్రికను కూడా నిర్వహించాలని ఆయన అభిలషించారు. తమిళ పత్రికలలో రాజకీయాంశాలకు సంబంధించిన వ్యంగ్య చిత్రాలను ప్రోత్సహించిన యశస్సు ఆయనకే చెందుతుంది. గాంధీజీ జరిపిన దక్షిణాఫ్రికా పోరాటాన్ని సమర్థిస్తూ భారతి ప్రచురించిన గాంధీ గోవు (ఇండియా, 18-12-1909) అనే వ్యంగ్యచిత్రం చాలా గొప్పది. కనుక సంఘ సంస్కరణ కోసం పత్రిక కందుకూరి చేతిలో శక్తివంతమైన ఆయుధం కాగా, భారతి చేతిలో అదే పత్రిక రాజకీయాభిప్రాయ వ్యక్తీకరణకు గాను ప్రబలసాధనంగా ప్రతిభాసించింది.

ఇద్దరూ అధ్యాపక వృత్తి నిర్వహించారు. ఇద్దరికీ భాషా వ్యవసాయమే ప్రధానవృత్తి. కందుకూరి జీవితం ఉపాధ్యాయ వృత్తిలోనే గడిచింది; ఆదర్శగురువుగా యశస్సు నార్జించారు. భారతి మధుర సేతుపతి ఉన్నత పాఠశాలలో తాత్కాలికంగా తమిళ పండిత పదవి నిర్వహించారు. కాని భాషారాధనమే యిద్దరి ధ్యేయ మనవచ్చు.

ఇద్దరూ సాహిత్యోపాసకులు. సాహిత్యమే వారికి సర్వస్వమన్నా సాహసం కాదు. సరదాకోసం వారు రచనావ్యాసంగం చేపట్టలేదు. ఇద్దరూ కూడా సాహిత్య క్షేత్రంలో మంచి పంటలు పండించిన ప్రముఖులే. కవిత, నవల, స్వీయ చరిత్ర, వ్యాసం,సాహిత్య విమర్శ, శాస్త్రం, నాటకం, అనువాదం మొదలైన ఎన్నో ప్రక్రియలలో రచన సాగించిన సాహిత్యవీరుడు కందుకూరి. ఆ మహనీయుడు స్పృశించని సాహిత్య ప్రక్రియ లేదని పేర్కొనవచ్చు. ఆయన తెలుగు సాహిత్య చరిత్రలో హిమవన్నగంలా దర్శన మిస్తారు. చిన్నవీ పెద్దవీ కలుపుకుని 125కి పైగా గ్రంథరచన చేసిన కందుకూరి ప్రముఖ సారస్వత మూర్తి అనడంలో అభిప్రాయభేదం ఎవ్వరికీ ఉండదు.

భారతి చేసిన సాహిత్యసేవ అపారమే అయినా, ఆయన వెలయించిన కవితలు అనర్ఘరత్నాలే అయినా, ఆయన సృష్టించిన సాహిత్యం అంత వైవిధ్య విలసితం కాదని చెప్పవచ్చు. కవితలే కాక, ఆయన సాంఘిక వ్యాసాలు సంతరించారు. వేదాంత వ్యాసాలూ వెలయించారు. కథలు వ్రాశారు. అనువాదాలు సాగించారు.

భారతి కవితలో గేయాంశం ప్రధానంగా గోచరిస్తుంది. గీత రచనలో వైవిధ్యం ప్రస్ఫుటం. జాతీయ గీతాలు, భక్తి గీతాలు, జ్ఞానగీతాలు, స్వీయచరిత్ర, చాటువులు - ప్రభృతి కవితలు ఆయన లేఖిని నుంచి వెలువడ్డాయి. వచన కవితలు కూడా ఆయన సంతరించారు. కాగా భారతి కవిత వైవిధ్య విలసితమని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు.

కందుకూరి వారి కవితలో ఈ వైవిధ్యం గోచరించదు. పైగా గేయాంశం అసలు కనిపించదు. సంప్రదాయబద్ధమైన ప్రబంధ పద్ధతి లోనే ఆయన కవిత ప్రధానంగా సాగింది. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధం వంటివి కూడా ఆయన రచనావళిలో కనిపిస్తాయి. తరువాతి

కాలంలో ఆయన రచనా దృక్పథంలో చెప్పుకోదగిన మార్పు వచ్చింది.

శుద్ధద్రావిడమునే వాడాలనే పట్టుదల భారతిలో మృగ్యం. అలాంటి వాదాన్ని ఆయన సమర్థించలేదనడం సమంజసం. కవితలో కూడా వ్యావహారిక పద ప్రయోగానికి ఆయన పట్టం కట్టారు. పాంచాలీ శపథం అనే తన దీర్ఘ కావ్యానికి ఆయన వ్రాసిన మున్నుడి చదివితే, ఆయన ఆశయాలు స్పష్ట మవుతాయి. సంప్రదాయ ఛ్ఛందస్సులలో సాగిన రచన అది. ఇక ఆయన మున్నుడి నుంచి ఒక భాగం: 'సులభ మైన శబ్దాలు సులభమైన శైలి, సులభంగా అర్థం చేసుకోదగిన ఛందస్సు, సామాన్యులు అభిలషించే ధోరణి' - ఇవి గల కావ్యం ప్రస్తుతం సంత రించేవాడు తన మాతృభాషకు కొత్తజీవం ప్రసాదించగలడు.

ఒకటి రెండు సంవత్సరాల గ్రంథపరిచయం గల తమిళుల కంద రికీ చక్కగా అర్థమయ్యేలా వ్రాయడంతో పాటు, కావ్య గుణాలకు భంగం వాటిల్లని విధంగా కావ్యాన్ని నడిపించాలి. బారతి ఆశించింది సులభసుందరమైన శైలి, సామాన్యులు సైతం అర్థం చేసుకో గలిగిన కావ్యరచనా విధానం. కనుకనే ఆయన నేటికీ సజీవుడు!

ఆధునిక యుగంలో వచన రచనకు గల శక్తి సామర్థ్యాలను గ్రహిం చిన నవ్యులు వీరేశలింగం, భారతి కవివరేణ్యులు. పద్యరచనలో వారి ద్దరూ దిట్టలే అయినా, గద్యానికి గల శక్తి సంపన్నతను, దానికి గల ఆవశ్యకతను గుర్తించడం వల్ల వారు నవ్యులు కాగలిగారు. ఆనాళ్లలో అలా గుర్తించడమే ఒక విశిష్టత! మొదట్లో సంప్రదాయ బద్ధమైన పద్యాన్ని ఆదరించినా, సరళసుందరమైన రచనను ఆ తర్వాత వారనుస రించారు. అనుకరణ ప్రాయమూ అలంకారయుతమూ అయిన ఆనాటి కావ్య రచనా విధానాన్ని నిరసిస్తూ వీరేశలింగం రచించిన సరస్వతీ నారద సంవాదమనే ఖండకావ్యం ఆయన సాహిత్య దృక్పథాన్ని వ్యక్తం చేస్తుంది. సరళమైన వచన రచనే నలుగురినీ ఆకట్టుకోగలదన్న సత్యాన్ని గ్రహిం చారు. అయినా మొదట్లో ఆయన వచన రచన అంత సరళంగా సుందరంగా సాగలేదు. ఆ విషయాన్ని గుర్తించిన లోకజ్ఞుడు కందు కూరి. విషయప్రధానమూ సరళసుందరమూ అయిన వచనం ఆయన్ని బహుధా ఆకర్షించింది. అలాంటి రచనా విధానం స్వీకరించి గద్య తిక్క

నగా లబ్ధప్రతిష్ఠు లయ్యారు. అయినా ఆయన వ్యావహారికం వైపు మొగ్గలేదు.

భారతి అక్షరాలా నవ్యుడు. ప్రక్రియను గ్రహించడంలో మాత్రమే కాదు, తన్నిర్వహణకు గాను చేపట్టిన శైలిలోనూ ఆయన నవ్యుడు. భారతి వ్యావహారిక భాషా వాది. ఆనాటి పండితలోకం ఆదరించక పోయినా వాడుక భాషకే పెద్ద పీటవేశారు. ఈనాడు కూడా చాలా మంది తమిళ పండితులు గ్రాంధికాన్నే గౌరవించినా, రచయితలు మాత్రం భారతి శిష్యులుగా వ్యవహృతు లవుతున్నారు. ఇది గమనించదగిన అంశం. ఒక్క కవితలో మాత్రం వీరేశలింగం ప్రాచీనుడుగా కానవచ్చినా, కడమ విషయాలలో ఆయన నవ్యమానవుడు. అన్ని విషయాలలోనూ భారతి నవ్యుడు.

నవ్యభావాలు కలిగినవారైనా, వారిద్దరూ ఆస్తికులు. వీరేశలింగం గారు ఏకేశ్వరోపాసకులు. ప్రముఖ బ్రహ్మ సామాజికులు. భారతి రచన లలో బ్రహ్మసమాజం తాలూకు భావాలు ఉన్నట్లు కనిపిస్తుంది. అయితే ఆయన పరాశక్త్యుపాసకుడని స్పష్టంగా చెప్పవచ్చు. కృష్ణుడు మొదలైన దైవతాలను స్తుతించినా, ఆయన పరాశక్తి భక్తుడనడం సత్య సన్నిహితం. ఆయన దృష్టిలో పరాశక్తియే దైవం, దేశం, తల్లి, తండ్రి, శక్తియే ఆయనకి సర్వమూ. జగన్మాతగా భావించిన శక్తి ఆయనకి సంహారక శక్తిగా కాక సృజనశక్తిగా కూడా గోచరించింది. ఆ శక్తినే ఆయన కాళి, ముత్తుమారి, శివశక్తి అనే రకరకాల పేర్లతో వ్యవహరించారు. చివరికి రష్యన్ విప్లవ శక్తిలో కూడా ఆయన పరాశక్తినే దర్శించగలిగారు. బెల్జియం స్వతంత్రదేశ మైనప్పుడు, ఆ సందర్భాన్ని పురస్కరించుకుని బెల్జియం వర్ధిల్లాలి అంటూ ఆయన ఒక కవిత వెలయించారు. ఆయన కప్పుడు పరాశక్తి వీరరసం మూర్తీభవించిన ఒక మహిళగా గోచరించింది. శక్తికి ఆయన యిచ్చిన నిర్వచనం చిరస్మరణీయం.

దుఃఖ రహిత స్థితియే శక్తి
మూతవడని దృష్టియే శక్తి
ప్రేమగల కరుణయే శక్తి
పరిపూర్ణమౌ పౌరుష మే శక్తి

భావమందలి తీవ్రతయే శక్తి
కంటి ముందరి వృత్తియే శక్తి
మోక్ష మార్గపు కొసయే శక్తి
.... ..... ...... ..... .....
పతన నిరోధకమౌ పౌరుషమే శక్తి
గగన వైశాల్యాన్ని కనుగొన్నదే శక్తి
కర్మను తొలగించే ఉన్నతియే శక్తి
గుండెలో వెలిగే జ్యోతియే శక్తి.

భారతి భావించిన శక్తిలో ఇంత వైవిధ్య మున్నది! ఆయన సంతరించిన భక్తి గీతాలలో జాతీయ భావం నెలకొన్నట్లుగా, ఆయన రచించిన జాతీయ గీతాలలో భక్తి ప్రశంస కానవస్తుంది. ఆయన చేసిన కృష్ణస్తోత్రంలో ఈక్రింది పాదాలు అందాలు దిద్దుకున్నాయి.

ఎప్పుడు తీరు నీ స్వాతంత్ర్య దాహం
ఎప్పుడు మడియు మా అడియరి మోహం
ఎప్పుడు మా తల్లి సంకెల లూడిపోవు
ఎప్పుడు మా యిక్కటు లన్నీ తొలగిపోవు.

సుబ్రహ్మణ్య భారతి సుప్రసిద్ధ జాతీయవాది. స్వాతంత్ర్య సమర యోధుడు. కృష్ణస్తోత్రం కావించినా, పరాశక్తిని ప్రస్తుతించినా ఆయన మనస్సు స్వాతంత్ర్యం మీద కేంద్రీకృతమై ఉండేది. కనుకనే ఆయన చేసిన స్తోత్రాలలో కూడా స్వాతంత్ర్య ప్రశంస ప్రముఖంగా కానవస్తుంది.

వీరేశలింగం గారు స్వాతంత్ర్యం పట్ల విముఖులన్న ఒక అపప్రథ ఉన్నది. వీరేశలింగం విమర్శకు లీ విషయాన్ని పేర్కొని ఆయనకి స్వాతంత్ర్యం పట్ల సరి అయిన అవగాహన లేదని విమర్శిస్తారు. ఇలా పేర్కొనడం సమంజసం కాదనవచ్చు. ఆయన స్వాతంత్ర్యం పట్ల విముఖుడు కాడు. సౌశీల్యాది ఉత్తమ గుణాలకు ప్రాధాన్య మిచ్చిన ఆయన అభిప్రాయాలను సరిగా తెలుసుకోకపోవడం వల్లనే కువిమర్శకు ఆస్కారం ఏర్పడింది. కేవలం రాజ్యాంగపరమైన స్వాతంత్ర్యం ఆయనకి అంతగా నచ్చినట్లు కనిపించదు. ఐకమత్యలోపం, జాతిమత వైషమ్యాలు, స్త్రీల కష్టాలు, విద్యావిహీనత మొదలైనవి సమాజంలో విలయతాండవం

చేస్తుంటే పరిపూర్ణ స్వాతంత్ర్యం ఎలా సిద్ధిస్తుందని ఆయన ప్రశ్నించారు. జనసామాన్యంలో విద్యాభివృద్ధి కలగకపోతే ఏదేశమైనా అభివృద్ధి చెందినట్లు ఎలా భావించ గలమని ఆయన ప్రశ్నించారు. సామాన్య జనుల స్థితిగతులు మెరుగు పడకపోతే దేశానికి పట్టిన దుర్గతి తొలగదనీ, దురాచారాలను సమూలంగా ఛేదించనంత వరకు సద్గతి సిద్ధించదనీ, స్త్రీల కష్టాలు తొలగనంతవరకూ దేశక్షేమం కలగదనీ ఆయన విశ్వసించినట్లు చెప్పవచ్చు. స్థూలదృష్టికి ఈ మాటలు కటువుగా తోచవచ్చు కూడా. కాని సూక్ష్మంగా పరిశీలిస్తే, ఇన్ని దోషాలు మనలో తిష్ఠ వేసుకుని వున్నప్పుడు మనం పరిపూర్ణ స్వాతంత్ర్యానికి అర్హులమేనా? అనే అభిప్రాయం కలగకపోదు. నిజ మెప్పుడూ నిష్ఠురమే! ఇక వీరేశలింగం గారి అభిప్రాయాలను ఆయన మాటలలోనే తెలుసుకోవడం సముచితం.

'దేశమును మంచిదశకు తీసికొని వచ్చి లోకములో ప్రఖ్యాతి కెక్కెడు దేశములలో నొకదానిని చేయవలెనన్నచో మొట్టమొదట సామాన్య జనుల యొక్క స్థితిని బాగుచేయుటకు ప్రయత్నపడవలయును.'

'జనసామాన్యము నందు విద్యాభివృద్ధి కలిగిననే కాని యెప్పుడును నీ దేశమును మంచిదశయందున్నదని చెప్పవలను గాదు.'

'దేశాభిమాన మనగా దేశమునందలి దురాచారములను తొలగించి సదాచారములను ప్రతిష్ఠాపించి దేశమునకు క్షేమము కలిగించుటయే కాని యుక్తాయుక్త వివేచన లేక తొంటి యాచారముల నెల్ల నంధప్రాయముగా బలపరచు చుండుట కానేరదు.'

'కాబట్టి జాతిమత ద్వేషమూలములు గలిగి పెరుగుచున్న దురాచార వృక్షమును మూలచ్ఛేదము చేయుటకయి ప్రయత్నింపక రాజ్యాంగ విషయకములయిన స్వాతంత్ర్యములను పొందుటకయి లక్ష ప్రయత్నములు చేసినను వాని వలన సంపూర్ణమైన ఐకమత్యమును నిష్పాక్షిక దృష్టియు గలుగనేరవు.'

'క్రూరములయిన కులాచారములకు దాసుల మయి మన యింట నుండు స్త్రీల కష్టములను నివారింపలేని వారము రాజ్యాంగ స్వాతంత్ర్యములను పొంది వారి యొక్క కష్టముల నెట్లు నివారింప గలుగుదుము?

మత వైషమ్యమును వహించి, ఐకమత్యమును త్యజించి, యొండొరులను ద్వేషించుచు తగవులాడుచుండెడి వారము రాచరికపు సంబంధములయిన స్వాతంత్ర్యమును పొందినప్పుడు జాతిమత వైషమ్యములు విడిచి యెట్లు సర్వజన క్షేమమునకయి ఐకమత్యముతో పాటుపడగలము?'

'మనదేశము యొక్క ప్రస్తుత పరిస్థితిని బట్టి యట్టి పరిపూర్ణ స్వాతంత్ర్యము మనకు క్షేమకర మయినదియు గాదు;మనవారందరు నట్టి పరిపూర్ణ స్వాతంత్ర్యమును పొందుట కర్హులైయు నుండలేదు.'

1887లో మదరాసులో జరిగిన అఖిలభారత జాతీయ కాంగ్రెసు మూడవ సభలో వీరేశలింగం గారు ప్రతినిధిగా పాల్గొన్నారు. రాజమహేంద్రవరం పౌరుల్ని ఉద్దేశించి పంతులుగారు దేశీయ మహాసభ (నేషనల్ కాంగ్రెస్) అనే ఉపన్యాసం కావించారు. దేశాభిమానం గురించి రెండు వ్యాసాలు, దేశభాషలు గురించి ఒక వ్యాసం, దేశాభివృద్ధి సాధనం గురించి ఒక వ్యాసం ఆయన లేఖిని నుండి వెలువడ్డాయి.

'కందుకూరి వీరేశలింగం పంతులు దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం కావాలనే కాంగ్రెస్ డిమాండ్ వల్ల ఉత్తేజం పొంది 1890 దశకంలో మద్రాసు కాంగ్రెసు సభ తీర్మానాలను తెలుగులో తర్జుమా చేసి ప్రకటించారు కూడా.' అని ఆచార్య ఎన్.జి.రంగా గారు 'కాంగ్రెస్ సిన్స్ 1917' అనే శీర్షికతో 1985 మే 6 నాటి నేషనల్ హెరాల్డ్ ఇంగ్లీషు పత్రికలో ఒక వ్యాసం వ్రాయడం గమనించదగిన అంశం. (ఈ వ్యాసాన్ని ఆధారంగా చేసుకుని అమరజీవి పొట్టి శ్రీరాములు 90వ జయంతి విశేష సంచికలో జాతీయ రైతాంగ ఉద్యమం - ఆవిర్భావ వికాసాలు అనే వ్యాసం రూపొందించబడింది.) కనుక వీరేశలింగంగారు రాజకీయ స్వాతంత్ర్యానికి విముఖులన్న అభిప్రాయం సరికాదని చెప్పవచ్చు.

ఈనాటికీ మన పెద్దలు జాతిమత వైషమ్యాలు నిరసిస్తూను, స్త్రీ విద్యాభివృద్ధిని అభిలషిస్తూను, సామాన్య మానవుని స్థితిగతులు బాగుపడాలని కోరుతూను ఉపన్యాసాలు చేస్తున్నారు; ఉదాత్త రచనలూ చేస్తున్నారు. మరి, ఆనాళ్లలో వీరేశలింగం వంటి సాహితీవేత్త, సంస్కారప్రియుడు, నవ్యమానవుడు అలా భావించడం ఒక నేరం కాదు. అయితే, మనం స్వాతంత్ర్యానికి అర్హులమన్న భావం బ్రిటిషు ప్రభుత్వాధినేతలకు

ఏర్పడితే, వారే మనకు స్వాతంత్ర్యం ఇస్తారని ఆయన భావించడం మాత్రం అసమంజస మనక తప్పదు.

వీరేశలింగంగారి జీవిత కాలంలోనే ఆయన రచనలు కొన్ని యితరభాషలలోకి అనూదితము లయినాయి. ఈ అదృష్టం భారతికి మరణానంతరం లభించింది. నేడు కందుకూరి వారి రచనలకు పూర్వమున్నంత ప్రచారం లేకపోయినా, భారతి రచనలకు పూర్వ మెన్నడూ లేని ప్రచారం లభించింది. అంతేకాదు. మరణానంతరం భారతి శిలా విగ్రహాలు తమిళనాడులోనే కాక ఢిల్లీవంటి నగరాలలోనూ వెలిశాయి. ఆయన పేరు మీదుగా పాఠశాలలు మొదలైనవి ఏర్పడ్డాయి. చివరికి భారతి విశ్వవిద్యాలయం కూడా వెలిసింది. నా అభిప్రాయంలో మరణానంతరమే భారతి సజీవుడు! కాని వీరేశలింగంగారు మరణానంతరం విస్మృత వ్యక్తిగా మారుతున్నారేమో! పాపం శాంతం!

# 10. గరిమెళ్ల, భారతిదాసన్ కవులు

విప్లవ కవిగా ప్రసిద్ధి కెక్కిన భారతిదాసన్ ప్రభవించిన సంవత్సరం 1891. ఆయన శతజయంత్యుత్సవాలు తమిళనాడంతటా వైభవోపేతంగా జరిగాయి. సంగ్రహంగా చెప్పాలంటే, తమిళ సంఘాలు నెలకొన్న ప్రతిచోట ఆ కవిరాజు శతజయంతి కనుల పండువుగా జరిగింది.

జాతీయకవిగా చిరకీర్తి గడించిన గరిమెళ్ల సత్యనారాయణ జన్మించిన సంవత్సరం 1893. ఈ తెలుగు తమిళ కవులిద్దరూ సమకాలికులు. భారతిదాసన్‌కి రెండేళ్ల తర్వాత జన్మించిన గరిమెళ్ల తమిళ కవికి పన్నెండేళ్లు ముందుగా కాలధర్మం చెందాడు. భారతిదాసన్ 73 యేళ్లు జీవించగా, గరిమెళ్ల 59 సంవత్సరాలు మాత్రమే జీవించాడు. వారిద్దరూ తమ భాషా సాహిత్యాలకు ఎనలేని సేవచేసి, భారతీయ సాహిత్యంలో శాశ్వతమైన స్థానం సంపాదించారు; అన్యాయ కాలాన్ని నిరసించిన కవులుగా మిగిలిపోయారు.

భారతిదాసన్ విప్లవ కవి అయితే, గరిమెళ్ల పైకి కనిపించని విప్లవ కవి; కాని ముమ్మూర్తులా విప్లవ లక్షణాలు గల కవి. పైకి కనిపించని అని ఎందుకన్నానంటే, ఆయన ఎప్పుడూ తనని విప్లవకవిగా అభివర్ణించుకోలేదు. ఇతరు లేమో ఆయన్ని జాతీయ కవిగా గుర్తించినంతగా విప్లవకవిగా గుర్తించలేదు. అదీ కాక ఆయన వెలయించిన విప్లవగీతాలను జాతీయ గీతాలుగా పరిగణించి జాతీయ గీతములు అనే శీర్షిక గల పుస్తకంలో ప్రచురించడం జరిగింది.

విప్లవ కవిగా పేరు పెంపులు గడించినా, జీవితరంగంలో ప్రవేశించిన తొలినాళ్లలో భారతి శిష్యుడైన భారతిదాసన్ కూడా జాతీయభావాలు గల వాడే. అసలు ఆయన పేరు అది కాదు; కనకసుబ్బురత్నం. తమిళ నవయుగ ప్రవక్త సుబ్రహ్మణ్య భారతి ఆ రోజుల్లో పుదుచ్చేరిలో (పాండిచ్చేరి) ఉండేవాడు. ఆయన ప్రభావం యువకుడైన సుబ్బురత్నం మీద పడింది. భారతిలా కవిత చెప్పసాగాడు. అప్పట్లో ఆయన చెప్పిన యీ కవితను కనుక పరిశీలిస్తే, శక్త్యుపాసకుడైన భారతి ప్రభావం ప్రస్ఫుటంగా

కనిపిస్తుంది.

ఎచట పరికించినా ఆ శక్తియే తమ్ముడా!
ఏడు సముద్రాలూ ఆమె రూపమే
నెలకొన్న కోటి లోకములూ
వెలుగుచుండును ఆ తల్లి చేతు బంతుల్లా
ఒక్కసారి మేఘవితానం
గర్జించడం ఎరుగుదురా ఎవరైనా?
అదే ఆమె నవ్విన నవ్వడి
ఆమె దరహాస మచట మెరిసింది!

సుబ్బురత్నం వ్రాసిన మొదటి కవితను స్వదేశమిత్రన్ పత్రికకు పంపుతూ భారతి యిలా అన్నాడు. 'సుబ్రహ్మణ్య భారతి కవితా మండలానికి చెందిన కనకసుబ్బురత్నం వ్రాసినది.' ఆనాటి నుంచీ అయన భారతి దాసన్ (శిష్యుడు)గా వ్యవహృతు డయ్యాడు. చివరికి తలిదండ్రులు పెట్టిన పేరు తెరమరుగుకి చేరుకుంది. భారతిదాసన్ అన్న పేరే సాహిత్యలోకంలో స్థిరపడింది. ఆయన తొలి కవితాసంపుటి భారతిదాసన్ కవితైగళ్ అనే పేరున వెలువడింది.

చిన్ననాటి భారతిదాసన్ వలె, గరిమెళ్ల శక్త్యుపాసకుడు కాదు. కాని భగవద్విశ్వాసం కలవాడు. ఆయనకి అఖండ భారతమే జనని. ఆ భారతమాతను ఆయన ప్రస్తుతించిన తీరు హృద్యం.

వందన మిదె గైకొనుమీ భారత జననీ
భారత జననీ మాపాలిటి రాణీ
ముప్పది కోట్ల జనములకు మూల మాతవు
మూల మాతవూ - మా పాలి నేతవు
మూడు భాగ్యములకు నెల్ల మహితకర్తవు
మహితకర్తవూ - మా యఘవిహర్తవు
ఉపనిషత్తు లుద్భవించె యుదరమందున
ఉదరమందున - అవి నిదుర చెందునా?
యుద్ధశకము మాన్పునట్టి బుద్ధిశాలివి
బుద్ధిశాలివీ - అనిరుద్ధ ప్రజ్ఞవీ.

ఆయన మాతృస్తవం గీతంలోని కొన్ని పాదాలే పైవి. ఆయన భావించిన భారతజనని బుద్ధిశాలిని. కారణం ఆతల్లి యుద్ధశతాన్ని మాన్పు నట్టి ప్రజ్ఞాధురీణ. భారతిదాసన్ దృష్టిలో ప్రకృతియే పరాశక్తి! లేదా పరాశక్తి రూపమే ప్రకృతి మాత!

భారతిదాసన్ తన పద్దెనిమిదో యేట అధ్యాపక వృత్తిలో ప్రవేశిం చాడు. సుమారు నాలుగు దశాబ్దులపాటు తమిళ పండితునిగా పనిచేసి, 1946లో ఉద్యోగ విరమణ కావించాడు. కుయిల్ (కోయిల) అనే పత్రిక నడిపాడు. ఆయనకి తమిళ చలన చిత్రసీమతోనూ సంబంధం ఉండేది.

మొదటి నుంచీ గరిమెళ్ల స్వాతంత్ర్య ప్రియుడు. ఆ స్వాతంత్ర్య ప్రియత్వం వల్ల ఆయన ఏ ఉద్యోగంలోనూ చాలాకాలం పని చెయ్య లేక పోయాడు. బి.యే., అయిన తర్వాత ఆయన కొన్నాళ్లు గంజాం జిల్లా కలెక్టరు గారి కార్యాలయంలో గుమాస్తాగాను, తర్వాత విజయ నగరం ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయునిగాను ఉద్యోగం చేశాడు. ఆతర్వాత జాతీయోద్యమంలో పాల్గొని చెరసాలకు వెళ్లడంతో ఉద్యోగ వాంఛ అడుగంటింది. కారాగారం నుండి విముక్తుడైన తర్వాత, నవ్య భావబంధురములైన పుస్తకాలు ముద్రించాలనే మహోద్దేశంతో శ్రీ శారదా గ్రంథమాలను స్థాపించాడు. పుస్తక ప్రచురణ గాజులబేరం భోజనానికి సరి అన్నట్లుగా సాగింది. చివరికి జీవనోపాధి నిమిత్తం ఆయన 1933లో మదరాసు చేరుకున్నాడు. కొంతకాలం గృహలక్ష్మి పత్రికకు సంపాదకు డుగా పని చేశాడు. ఆంధ్రప్రభలో కొన్నాళ్లు సహాయ సంపాదక పదవి నిర్వహించాడు. ఎక్కడా స్థిరపడలేక పోయిన గరిమెళ్ల పత్రికా రచయి తగా దినదిన గండం నూరేళ్లాయుస్సుగా కాలం గడిపాడు. బ్రతికినంత కాలమూ పేదరికం అనుభవించాడు; పేదరికంలోనే కన్ను మూశాడు.

మరణానంతరం కూడా గరిమెళ్ల అదృష్టహీనుడే! ఆయన రచనలకు ప్రచారం తగ్గిపోయింది. ఆయన విస్మృత కవి అయ్యాడు. కాని కృత జ్ఞతా గుణం గల తమిళులు భారతదాసన్ స్మృతికీ ఆయన రచనలకూ బ్రహ్మరథం పడుతున్నారు. ఆయన రచించిన పిసిరాంద్రైయార్ అనే పద్యనాటకానికి సాహిత్య అకాడెమీ వారి మరణానంతర బహుమతి లభిం

చింది. 1968లో జరిగిన ద్వితీయ ప్రపంచ తమిళ మహాసభల సందర్భంగా మదరాసులో ఆయన శిలావిగ్రహం ఆవిష్కరించబడింది. ఆయన పేరుతో తిరుచిరాపల్లిలో ఒక విశ్వవిద్యాలయం స్థాపించబడింది. ఆయన పట్ల తమిళులకు గల ఆదరాభిమానాలను ఈ వివిధ విషయాలు వ్యక్తం చేస్తున్నాయి. కవిపూజ తమిళ సోదరులకు తెలిసినంతగా తెలుగువారికి తెలియదన్నా సాహసం కాదనుకుంటాను.

చివరిదాకా గరిమెళ్ల గాంధేయ కవిగా ఉండిపోయాడు. గాంధేయ వాదులైన సాహిత్యోపాసకు లెందరెందరో వట్టి కీర్తిశేషులుగా నిలిచి పోవడం చూస్తే, వారి పట్ల జాతీయ వాదులకు ఉండవలసినంత ఆదరభావం లేదేమో అనిపిస్తుంది!

కాలక్రమాన భారతిదాసన్‌లో జాతీయ దృష్టి లోపించింది; దృక్పథంలో చెప్పదగిన మార్పు వచ్చింది. పెరియార్‌గా వ్యవహృతు లవుతున్న ఈ.వి. రామస్వామిగారి మీది గౌరవభావం కొద్దీ, ఆయన ద్రావిడ కళగంలో చేరాడు. ఆ తర్వాత ద్రావిడ మున్నేట్ర కళగంతో సంబంధం ఏర్పడింది. ఏ రాజకీయ పక్షానికి చెందినా, ఆయన అభ్యుదయ భావాలు గల కవి. కుల నిరసన, మత భేదాల ఖండన, అందరికీ చదువు సంధ్యలు లభించాలనే ఉదాత్త ఆశయం, నవ సమాజ స్థాపన మొదలైన భావాలు ఆయన కవితలలో కానవస్తాయి. ఈ వివిధ గుణాలు గరిమెళ్ల గీతాలలోనూ కనిపిస్తాయి.

భారతిదాసన్‌లో స్వాతంత్ర్యేచ్ఛ ప్రబలంగా ఉన్న రోజులలో, పంజరంలోని చిలుకను చూసి ఆయన యిలా పేర్కొన్నాడు.

*తినుటకు పెట్టెదరు తీయని పళ్లు*
*ఎన్నెన్నో యిచ్చెదరు పప్పులు నీకు*
*అందాల కాలికి అంటూ పలికేరు*
*అవలోకించు ఒక్కసారి చిలకా!*

గరిమెళ్ల ఎంత స్వాతంత్ర్య ప్రియుడో, యీకింది వాక్యాలు చదివితే అవగత మవుతుంది.

'స్వాతంత్ర్య వాంఛ అను తేజస్సుతో మిళితములు కాని కవితా

శక్తియు సాహిత్యాభిమానమును కేవల వ్యసనములు; విద్యాభిమానము ఒక విలాస మాత్రమును దైవభక్తి యొక బూటకము.'

నవ జగతి నిర్మాణానికి, పానకంలో పుడకలులా, ప్రతిబంధకాలుగా ఉన్న జాతిమత భేదాల నిర్మూలనం అవసర మంటూ భారతిదాసన్ ఉద్బోధించిన తీరు ప్రశంసార్హం.

జాతిమత భేదాలతో మూఢ విశ్వాసాలతో
సతమతమై పోతున్న యీ కయ్యాల జగతిని
గాలిలో ధూళిలా ఎగరగొడదాము
ఆ పిదప నాశనం చేద్దాము
నిర్మిద్దాము నవ జగతిని
భేదభావ మెరుగని ఆ నవజగతిని
ఆత్మ గౌరవ జగతిగా వ్యవహరిద్దాము
పరికించు సంఘమా! మేము చెప్పినట్లు
పైకి వెళ్లు, పైకి వెళ్లు, పై పైకి.

గరిమెళ్ల చాలా గీతాలలో పెక్కు చోట్ల కుల నిరసన చేశాడు; నిమ్న జాత్యుద్ధరణను ఉద్బోధించాడు.

'బ్రాహ్మణా బ్రాహ్మణా - పంచమ బ్రాహ్మణ
భేదపు తెగలు మీకేల
మీ భేదాలు వడి కాల్పరేల
చెడ్డ బోధలకు లొంగిరేల
యీ మాధుకరపు వృత్తి మరగి నారది యేల?'

'నిమ్న జాతుల నెత్తుమోయి - వారు
నిరసించిన యెడల నిక నీకు గోయి.'

'పంచమ జాతిని జనులారా మన
పక్షము గొందము జనులారా
మత మనగను మన యాత్మోన్నతికే
మానవైక్యతను మాప నేర్పడదు.'

మరొక కవితలో భారతిదాసన్ తన భావాలను మరింత స్పష్టం

చేశాడు.

అమరిన సమత్వ శిఖరాగ్రాన నిలిచి
మానవులకు హితము గొలుపగా
నెలకొన్న వివేచనా దృష్టి సారించి
దిశలన్నీ నీవు విలోకించు

సమత్వ దృష్టికే, వివేచనా దృక్పథానికే ఆయన ప్రాధాన్యం ఇచ్చాడు.

వివేచనా దృష్టి అని గరిమెళ్ల స్పష్టంగా చెప్పక పోయినా, ఆయన ఆ అర్థం వచ్చేలా ఇలా పేర్కొన్నాడు.

వేద శాస్త్రములు ధర్మ శాస్త్రములు వేయి విధం
బుల చెప్ప ఉన్మాదత వీడి యెల్లరును
నొక్కటను మాన్య సూత్రమును నెరుగు -
సర్వసమానత బాదుకొల్పి యా జనములో
గలియండి -

సమత్వం అనే మాన్యసూత్రం గ్రహించండి అని గరిమెళ్ల ప్రబోధించాడు. రకరకాలుగా చెప్పే ధర్మసూత్రాల పద్ధతిని విడిచిపెట్టి, అందరూ ఒక్కటే అనే అమాన్య సూత్రం గ్రహించడమే ఆయన చెప్పిన వివేచనా దృష్టి.

తమిళ భాష, తమిళనాడు, తమిళజాతి - అని ఆవేశపూర్వకంగా కవితలు వెలయించిన భారతిదాసన్ విశ్వదృష్టి ప్రదర్శించాడు; సమతా దృక్పథం ప్రబోధించాడు. ఇందుకు 'లోకం నీది' అనే కవిత మంచి ఉదాహరణం.

'దేశంతో దేశం అనుసంధించి
గగన మంటే కొండ నధివసించి
పట్టు విడవకుండా పై పైకి ఎక్కి
అవలోకించు అన్నివైపులా
అవలోకించు ఈ భూప్రజని
అవలోకించు నీ మానవ జాతిని
అవలోకించు నీ తోబుట్టువుల్ని
మానవ మహా సముద్రం చూసి సంతసించు

మానవ సముద్రం నే నని చెప్పు
చీలిక లేదు, భేదం లేదు -
లోకం తినగా తిను, ధరించగా ధరించు
సంపద సర్వ జనులదంటూ
సమష్టి భావంతో సంచరించు...... .... '

ఇది శక్తిమంతమైన కవిత. గంభీర భావ బంధురమైన కవిత. సమష్టి భావానికి కవి ప్రాధాన్య మివ్వడం గమనించదగిన అంశం. సమష్టి భావం సమాజంలో నెలకొన్నప్పుడే సమత ఏర్పడుతుంది. ఈ ఉదాత్తభావాన్ని గరిమెళ్ల యిలా వ్యక్తీకరించాడు:

జను లెల్లరికి నేను జన్మభూమినిరా
ఛేదించవయ్యా అసమాన భేదములు
నీది నా దనెడి అన్యాయం వీడు
మనము మన దనెడి సద్గానంబు పాడు -

సమాజంలో అసమానతలకు దారితీస్తున్న నీది, నాది అనే భేదబుద్ధిని విడనాడి మనము, మనది అనే సమష్టి భావాన్ని అలవరుచుకోవాలని గరిమెళ్ల ప్రబోధించాడు. ఇది తరతరాల ఉపనిషద్వాణి. దీన్ని అభ్యుదయవాణి అన్నా సరే, విప్లవ వాణి అన్నా సరే ఏ పేరుతో పిలిచినా సరే! ఈ సమష్టి భావాన్ని ఆయన సద్గానం అన్నాడు.

మానవు డంటేనూ అతని శక్తి సామర్థ్యాలంటేనూ భారతిదాసన్‌కి నమ్మకం ఎక్కువ. శ్రమజీవికీ మిల్లు కార్మికులకూ చేనేత పారిశ్రామికులకూ ప్రాధాన్య మిస్తూ ఆయన కవితారచన చేశాడు. శ్రమైక జీవుల్ని ఉద్దేశించి ఆయన రచించిన యీ కవితను పరిశీలిద్దాము.

చక్కబరిచేందుకు మిమ్మల్ని
చక్కని తోటల్లారా!
సోదరు లెందరు నెత్తురు కార్చారో
మీ మీ వేళ్లల్లో!
ప్రతినిత్యం పరిశ్రమించగా
వరి యెంతో పండే పొలమా
మనుషు లెందరు నుదుటి చెమట కార్చారో

కనలేము కనలేము
తామరలు పూసిన తటాకము లారా
అమాయకులైన మా సోదరు లానాడు
మీకోసం కనుమూసిన విషయం
నుడువదరమా నేడు!
శ్రమజీవుల కష్టానికి, విశ్వమా
సాక్షివి నీవే గదా!
ఆకలి తీరితే ప్రాణం పోవుననే
శ్రీమంతుల నీతి సరేనా?
భయం తొలగి విజృంభిస్తారింక
యాచించరు శ్రామికు లింక
సొంత బలమున్నవారు మనెదరింక
ఈ మాటకు తిరిగు లేదింక!

సంఘంలో కానవచ్చిన అసమానతలు చూసి వ్యధా భరితుడైన గరిమెళ్ల సాంఘిక న్యాయం లోపించిన సమాజాన్ని ఘాటుగా విమర్శించడంలో ఆశ్చర్య మేమీ లేదు. ఆయన పేదవాడు కనుక, పేదవారి కష్టాలు ఆయనకి బాగా తెలుసు. ఆ రంపపు కోతను అనుభవించిన వాడు కావడం వల్ల మొగమోటమి లేకుండా -

పెద్దలకు లాభాలు బ్యాంకుల్ల నిండా
పేదలకు దుఃఖాలు హృదయాల నిండా

అనగలిగాడు ధైర్యంగా. అంతే కాదు -

భాగ్యవంతుల వైభవములంటె నాకు
బాధించు వ్రణమని బాగా తెలియండి-

అని కూడా పేర్కొన్నాడు.

భాగ్యవంతుల్ని చూసి ఆయన అసూయతో అనలేదు; కడుపుమండి అన్నాడు. ఆ కాలపు ఏకవీ యింత ఘాటుగా చెప్పలేదేమో! తాను దర్శించిన అన్యాయ కాలాన్ని ఆయన అభివర్ణించిన తీరు మరీ మరీ పరిశీలించదగింది.

'మాన్యాలు భోగాలు మనుజులందరి కబ్బు

మార్గాలు వెతకాలి రండి
ఏటి పొడుగున దున్ని యెరువేసి నీ రెట్టె నూర్చి
పండించేది మనవొంతా
గోటు సేయుచు బూతు కూతలు కూసి
కల కొట్టికొని పోవుటింకొక రొంతా

...... ...... ...... .....

సంఘంలో ఇలా సాంఘిక న్యాయం లోపించిందనే అంశాన్ని ఎత్తి చూపినవాడు గరిమెళ్ల. అందువల్ల ఆయన అన్నాడు గదా: కర్షకులు కార్మికులు కలవండి వేగ. కర్షక కార్మిక మైత్రి ధరిత్రి ప్రగతికి అత్యవసరమన్న క్రాంత దర్శి ఆయన!

నూతన జగతిని నిర్మిద్దాము
మంచి నశించిన జగతిని నిర్మూలిద్దాము

అని భారతిదాసన్ ఉద్బోధించాడు. ఇదే ఆయన సందేశ మన్నా అతిశయోక్తి కాదు.

గాంధీజీ భక్తుడైన గరిమెళ్ల లోకంలో శాంతి - ప్రేమ దీపాలు వెలగాలని ఆశించాడు.

ప్రేమ చేతనే పగతుని గెలుతుము
రక్తపాతములు రాక్షస మతమగు -
నా దృష్టిలో ఇదే గరిమెళ్ల సందేశం!

భారతిదాసన్ ద్రావిడ పక్షానికి చెందిన కవి కావచ్చు. గరిమెళ్ల సత్యనారాయణ కాంగ్రెసు పక్షానికి చెందిన జాతీయ కవి కావచ్చు. ఎవరి రాజకీయోద్దేశాలు వారివి! ప్రస్తుతం అది కాదు మనకు ముఖ్యం. వారి సందేశాలలో అందాలు దిద్దుకున్న లక్ష్యం అర్థం కావాలి మనకు. వారిద్దరూ ఆశించింది మంచిలోకం. అది పాత వ్యవస్థ నశించిన నవ జగతి కావచ్చు లేదా రక్తపాతాల రాక్షస మతం నశించిన శాంతి సౌఖ్యాల జగతి కావచ్చు!

# 11. తెలుగు మలయాళములు

తెలుగు మలయాళములు ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన భాషలు. కాని చారిత్రకంగాగానూ, సాంస్కృతికంగానూ పరిశీలిస్తే తెలుగువారూ మలయాళీలూ అంత సన్నిహితులు కారు. దూరపు బంధువులుగా కనిపిస్తారు. తెలుగువారికీ కన్నడిగులకూ, తెలుగువారికీ తమిళులకూ మధ్య నెలకొన్న దగ్గరి చుట్టరికం తెలుగు మలయాళ భాషలు వ్యవహరించే వారి మధ్య నెలకొనలేదనడం సత్య సన్నిహితం. ఈ భాషలు ప్రచారంలో ఉన్న ప్రాంతాలు భౌగోళికంగా దూరంగా ఉండడమే ఇందుకు ప్రధాన కారణం అనవచ్చు. అందువల్ల వీరి మధ్య రాకపోకలు లేవు. సంబంధ బాంధవ్యాలూ ఏర్పడలేదు. తెలుగుదేశానికి తమిళ, కన్నడనాడులు సరిహద్దు రాష్ట్రములు కావడం వల్ల, ఈ భాషలు వ్యవహరించే వారి మధ్య అతి ప్రాచీనకాలం నుంచి రాకపోకలు ఉండేవి. ఒక ప్రాంతంవారు మరొక ప్రాంతంలో స్థిరనివాసాలు కూడా ఏర్పరచుకున్నారు.

తెలుగు ద్రావిడ భాషయే అయినా, సంస్కృత భాషా సాహిత్యాల సహాయంతో అది పెరిగి పెద్ద దయింది. అలాగే మలయాళం కూడా. సంస్కృత సాహిత్యంలోని ప్రముఖ రచనలను ఈ రెండు భాషలూ తమ సొంతం చేసుకున్నాయి. అయినా శబ్దజాలం, వ్యాకరణాంశాలు పద్యరచన మొదలైన వాటిలో ఇవి తమ ప్రత్యేకతను కొంతవరకు నిలుపుకోకపోలేదు. తెలుగు మలయాళములలో ప్రయుక్తము లయ్యే విశేషణ రూపాలు సరూపములుగా కనిపించడం ఒక విశేషం.

ఉదా. తెలుగు - ఆ మనిషి
మలయాళం - ఆ మనుష్యన్
తమిళం - అన్ద మనిదన్
(అన్ద, ఇన్ద అని వ్యవహరించడం తమిళ సంప్రదాయం)

ఇక తెలుగు సాహిత్యంలో కానవచ్చే మలయాళ భాషా ప్రశంసను రేఖామాత్రంగా పరిశీలిద్దాము.

మలయాళమనే మాటను తొలిసారిగా ఉపయోగించినవాడు శ్రీనాథ కవిసార్వభౌముడు. భీమఖండం కృతిభర్త అయిన బెండపూడి అన్నమంత్రికి మలయాళం, గుజరాతీ మొదలైన పెక్కు భాషలతో పరిచయం కలదట! నిజంగానే యిది పేర్కొనదగిన అంశం. ఇక కవిసార్వభౌముని పద్యమునే చదువుకుందాము.

" అరబీ భాష తురుష్కభాష గజ
 కర్ణాటాంధ్ర గాంధార ఘూ
ర్జర భాషల్ మలయాళ భాష శక
 భాషా సింధు సౌవీర బ
ర్బర భాషల్ కరహాట భాష మరియున్
 భాషా విశేషంబు ల
చ్చెరువై వచ్చు నరేటి అన్ననికి
 గోష్ఠీ సంప్రయోగంబులన్."

(భీమఖండం, అవతారిక, 73వ పద్యం)

గజ కర్ణాటాంధ్ర ..... లోని గజ శబ్దం అర్థరహితం. ఇది వ్రజమై ఉండవచ్చునేమో. వ్రజ భాషలో (హిందీ) బిహారి సత్‌సఈ వంటి ఉద్గ్రంథాలు రచించబడినవి.

కళాపూర్ణోదయంలో పింగళి సూరన రెండుచోట్ల మల(ళ)యాళ శబ్దం ఉపయోగించాడు. అలఘువ్రతుడు మల(ళ)యాళపు బ్రాహ్మణుడట! అనంతశయనానికి (తిరువనంతపురం) సమీపంలో మృగేంద్ర వాహన శక్తి ఆలయం ఉన్నదనడం పురస్కరించుకొని చూడగా తెలుగు కవులలో సూరనకు కేరళతో కొంచెం పరిచయం ఉన్నట్టు భావించవచ్చు. కళాపూర్ణోదయ కథలో కేరళ వాతావరణం లీలగా కనిపిస్తున్నదేమోనని ఒక సందేహం.

ఇక ఆధునిక మలయాళ సాహిత్య జనకుడుగా భావించబడుతున్న ఎళుత్తచ్చన్ మహాకవిని గురించి ప్రస్తావించడం సముచితం. అధ్యాత్మ రామాయణ కర్త ఎళుత్తచ్చన్. మలయాళీలకు ప్రీతిపాత్రమైన రచన ఇది. దీని ఆవిర్భావం గురించి ముచ్చటిస్తూ సుప్రసిద్ధ మలయాళ విద్వాంసులు చేల్నాట్ అచ్యుతమీనన్ ఇలా అన్నారు:

ఒకసారి కాశి నుంచి వచ్చిన ఒక బ్రాహ్మణ సన్న్యాసి అంబలప్పూళ రాజుకి తెలుగు లిపిలో ఉన్న అధ్యాత్మ రామాయణపు ప్రతిని బహూకరించాడట. దాన్ని మేప్పతూర్ నంబూదిరిని చదవమన్నారు. కాని ఆయనకి తెలుగులిపి తెలియదు. అప్పుడు ద్రావిడ భాషా లిపులన్నీ తెలిసిన ఎళుత్తచ్చన్‌ని సమీపించారు. దాన్ని ఆయన మలయాళ లిపిలోకి మారుస్తూనే, పద్యకృతిగా అనువదించాడు కూడా. కనుక ఎళుత్తచ్చన్ మహాకవికి తెలుగులిపితో పరిచయం ఉందనవచ్చు.

బహుభాషా వేత్తయే కాక, సంగీత శాస్త్రజ్ఞుడూ అయిన స్వాతితిరునాళ్ మహారాజు తెలుగు భాషాభిజ్ఞుడు. త్యాగయ్య కృతులు విని ఆ మహారాజు ఆనందించాడు. ఆ తర్వాత ఆయన తెలుగులో పదములూ, కృతులూ వెలయించాడు. ఆ మహారాజు ప్రోద్బలంవల్ల కేరళ కళా రూపములలో ఒకటి అయిన మోహిని ఆట్టంలో తెలుగు వర్ణములు చోటు చేసుకొని ఉండవచ్చునని విజ్ఞుల అభిప్రాయం.

ఇలా కాలక్రమాన తెలుగువారికి, మలయాళీలకు మధ్య అనుబంధం ఏర్పడి బలపడి ఉండవచ్చు అయినా ఇది చాలదు. ప్రస్తుత పరిస్థితులలో దూర ప్రదేశాలు సైతం చేరువ కావడం వల్లను, ఒక ప్రాంతం వారు మరో ప్రాంతంలో నివసించడం వల్లను ఈ అనుబంధం దృఢతరం అవుతున్నది. ఏమైనా, సాహిత్యపరంగా తెలుగు, మలయాళీయుల మధ్య పటిష్టమైన అనుబంధం ఏర్పడడం ఎంతైనా అవసరం. అప్పుడే ఉభయుల మధ్య సదవగాహన ఇంకా ఎక్కువగా ఏర్పడుతుంది. ఇందుకు తెలుగులో గత శతాబ్దిలో పునాది వేయడం జరిగింది.

వచన రామాయణ కర్త అయిన దొడ్ల వెంకటరామిరెడ్డిగారు కళావతి అనే నవల వ్రాశారు. ఇది మలయాళంలో వెలసిన తొలి నవల ఇందులేఖకు ప్రశస్తమైన అనుకరణ. ఈ సాంఘిక నవలను వ్రాసిన రచయిత చందు మీనన్.

1954 తర్వాతనే మలయాళ రచనలు తెలుగులోకి రావడం మొదలయినట్లు చెప్పవచ్చు. కేంద్ర సాహిత్య అకాడెమీ, మదరాసులోని దక్షిణ భాషా పుస్తక సంస్థ, జాతీయ పుస్తక సంస్థ వంటి సాహిత్య సంస్థలు ఈ అనువాద కార్యక్రమాన్ని ప్రోత్సహించాయి. అయితే, ఈ

అనువాదాలలో కొన్ని మూల మలయాళం నుంచి కాక హిందీ, తమిళం అనువాదాల నుంచి వెలువడడం శోచనీయం. అసలే అనువాదం కార్బన్ ప్రతి వంటిది. మరి, కార్బన్ ప్రతి మరొక భాషకు మాతృక కావడం నిజంగా శోచనీయం! భాషాధ్యయనం పట్ల శ్రద్ధ కలిగిననాడే ఈ వింత పరిస్థితిలో మార్పు కలుగుతుంది.

కీర్తిశేషులు గన్నవరపు సుబ్బరామయ్య గారు (1890-1963) ప్రసిద్ధ నవలా రచయిత తగళి శివశంకర పిళ్లై గారి రంటిటంగళి (రెండు సేర్లు), చెమ్మీన్ (రొయ్యలు) నవలల్ని మూల మలయాళం నుంచే తెలుగు చేయడం పేర్కొనదగిన అంశం. ఇది ప్రశస్తమైనదని చెప్పవచ్చు. పుట్టపర్తి నారాయణాచార్యులు గారు తీరని బాకీ అనే పేరుతో కొన్ని మలయాళనాటికల్ని సమర్థంగా తెలుగు చేశారు. జొన్నలగడ్డ వెంకటేశ్వర శాస్త్రిగారు పి.కేశవదేవ్ వ్రాసిన ఓడయిల్ నిన్ను (మానవత్వం) అనే నవలను చక్కగా తెనిగించారు. కేశవదేవ్ ప్రసిద్ధ నవల కణ్ణాడి (అద్దం) తెలుగు సేత వెలువడింది. అనువాదకుడు పులిగడ్డ విశ్వనాధరావు గారు. ఇటీవలి కాలంలో మరికొన్ని నవలలు తెలుగులోకి వచ్చాయి.

ఆధునిక మలయాళ రచయితలలో ప్రముఖుడు వైకం మహమ్మద్ బషీర్. ఆయన నవలలలో ఎన్‌రుప్పుప్పకోరానెన్డార్ను (మా తాతయ్య కొక యేనుగుండేది) బహు ప్రసిద్ధ మయింది. చల్లా రాధాకృష్ణ శర్మ చేసిన యీ అనువాదం 1963లో ప్రచురించబడింది. ఆధునిక మలయాళ కవి త్రయమైన కుమారన్ ఆశాన్, ఉళ్ళూర్ పరమేశ్వర అయ్యరు, వళ్లత్తోళ్ నారాయణ మీనన్‌లు, మలయాళంలో రామకథా సాహిత్యం మొద లైన విషయాలు గురించి ఆయన వ్రాసిన వ్యాసాలు ప్రసిద్ధ పత్రికలలో వెలువడ్డాయి. కుమారన్ ఆశాన్ మొదలైన మలయాళ రచయితలకు సంబంధించిన ఏక విషయక గ్రంథాలు (మోనోగ్రాఫ్స్) సాహిత్య అకాడెమీ పక్షాన తెలుగు చేయబడ్డాయి. అలాగే పి.కె. పరమేశ్వరన్ నాయర్ గారి మలయాళవాఙ్మయ చరిత్రమును (ఆంగ్లం నుంచి) దివాకర్ల వేంకటావ ధాని గారు (1912-68) తెలుగు చేశారు. అంతకుముందు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు 1972లో ప్రచురించిన దక్షిణభారత సాహి త్యములు గ్రంథంలో చోటు చేసుకున్న కె.యం. జార్జిగారి వ్యాసాన్ని

(మలయాళ సాహిత్యము) చల్లా రాధాకృష్ణశర్మ తెలుగు చేశాడు (45 పుటలు). జొన్నలగడ్డ వేంకటేశ్వరశాస్త్రి ప్రకటించిన'మలయాళభాషా సాహిత్యాలు' కూడా మంచి రచనే.

పుట్టపర్తి నారాయణాచార్యులు గారి మలయాళ భాషా సారస్వత చరిత్ర అనే మంచి వ్యాసాన్ని తెలుగు భాషా సమితివారు తమ విజ్ఞాన సర్వస్వము విశ్వసాహితి (6వ సంపుటం)లో ప్రచురించారు. ఆయన తెలుగు మలయాళ సాహిత్యాలను పోలుస్తూ కొన్ని వ్యాసాలు ప్రకటించారు. ఈ రెండు సాహిత్యాలలో కానవచ్చే సాదృశ్యాలను యన్. భక్త వత్సల రెడ్డిగారు తమ వ్యాసాలలో తెలియజేస్తున్నారు. ఇటీవల ఆయన, దేశమంగలం రామకృష్ణలు కలిసి చేసిన ఆధునికాంధ్ర కవితా ఖండికల (1900-80) మలయాళ పరివర్తనాన్ని తెలుగు విశ్వవిద్యాలయం వారు ప్రకటించారు. మహా కవి జి.శంకర కురుప్ కవితలు కొన్నిటిని బి. వి.సింగరాచార్యగారు (1916-78) తెలుగు చేశారు.

హిందీ, ఇంగ్లీషుల నుంచి కొన్ని తెలుగు రచనలు మలయాళం చేయబడ్డాయి. వాటిలో కొన్ని: అడివి బాపిరాజుగారి నారాయణరావు (1970), వి.ఆర్.నార్లగారి వీరేశలింగం, వేమన (1970,71), వేదం వేంకటరాయశాస్త్రి గారి (మనమడు) వేదము వేంకటరాయ శాస్త్రి (1980), డి.ఆంజనేయులు గారి డాక్టర్ సి.ఆర్.రెడ్డి (1981), వి.ఆర్.నార్ల గారి గురజాడ (1986), వేంకటావధాని గారి పోతన (1979) మొదలైనవి. ఇంకా మరికొన్ని తెలుగురచనలకు మలయాళ అనువాదాలు వెలువడివుండవచ్చు. ఏమైనా ఈ అనువాదాల సంఖ్య అత్యల్ప మనక తప్పదు.

శోచనీయమైన యీ పరిస్థితి మారాలని అందరూ ఆశిస్తారు. ఆశించడం సమం~~ యం. ఆశించినంత మాత్రాన మార్పు రాదు కదా! అందుకు తగిన కృషి జరగాలి. ఈనాటికీ తెలుగు నుంచి మలయాళంలోకి గాని, మలయాళం నుంచి తెలుగులోకి గాని సమర్థంగా అనువాదం చేయగల రచయితలు పలువురు లేరన్నది సత్యం. ఈవిషయంలో మన విశ్వవిద్యాలయాలు కాని, రాష్ట్రప్రభుత్వాలు గాని, సాహిత్య సంస్థలు కాని ముందుకు వచ్చి, భాషాధ్యయనాన్ని ప్రోత్సహించాలి. రచయితలకు,

సాహిత్య విద్యార్థులకు అన్యభాషలు నేర్చుకునే సదవకాశాలు కల్పించాలి. ద్విభాషా (తెలుగు-మలయాళం, మలయాళం-తెలుగు) నిఘంటువులు వెలుగులోకి రావాలి. సమాలోచక గ్రంథాలు వెలువడాలి. అలా నిర్మాణాత్మకంగా కృషి జరిగినప్పుడు ఈ పరిస్థితిలో తప్పక మార్పు వస్తుంది. అంతవరకూ మనకు కార్బన్ ప్రతులే శరణ్యం!

# 12. తమిళ, మలయాళ రామాయణాలు

తమిళ మలయాళ సాహిత్యాలలో తలమానికంగా వెలుగొందుతున్న రసవత్కావ్యం రామాయణం. అంతేకాక ప్రచుర ప్రచారం గడించిన కావ్యాలలో రామాయణానికి పెద్ద పీట లభించింది. కాగా, ఈ రెండు భాషలవారికీ రామాయణం ప్రీతి పాత్రమైన కావ్యమని చెప్పడం సత్యసన్నిహితం.

తమిళ సాహిత్య సదనంలో మణిదీపిక వెలిగించిన మనీషి కంబ మహాకవి. ఆయన కవి చక్రవర్తి బిరుదువిరాజితుడు. అలాగే మలయాళ సాహిత్యోద్యానంలో కల్పవృక్ష సదృశమైన కావ్యాన్ని వెలయించిన కవి శేఖరుడు తుంజత్తు ఎళుత్తచ్చన్. ఆధునిక మలయాళ భాషాజనకుడుగా ఆయన పేరు పెంపులు గడించాడు. ఈ మహాకవు లిద్దరూ తమిళ మల యాళములలో ప్రసిద్ధ రామాయణ కర్తలు.

కంబకవి రచన కంబరామాయణంగా ప్రసిద్ధి కెక్కినప్పటికీ, ఆయన తన రచనకు పెట్టిన పేరు రామావతారం. ఎళుత్తచ్చన్ సంతరించిన రచన అధ్యాత్మ రామాయణం. రామకదై, కంబ నాటకం అనే నామాంతరములు కలిగిన కంబరామాయణం 42,276 పాదాలు కల బృహద్రచన. కంబరామాయణం ప్రక్షిప్తముల మయం అని సుప్రసిద్ధ విమ ర్శకు లయిన టి.కే.సి (టి.కె.చిదంబరనాథ ముదలియారు) అభిప్రాయం. ఆయన పరిష్కరించి ప్రకటించిన రామాయణంలో బాలకాండలో 167 పద్యములూ, అయోధ్యాకాండలో 550 పద్యములు మాత్రమే చోటు చేసుకున్నవి. కాని నేడు వాడుకలో ఉన్న కంబ రామాయణం ప్రతు లలో బాలకాండలో 1,420 పద్యములూ, అయోధ్యాకాండలో 1,210 పద్యములూ ఉన్నవి. అధ్యాత్మ రామాయణంలో సుమారు 13,200 పద్యాలు అందాలు దిద్దుకున్నవి. కంబన్ ఎంత గొప్పకవి అంటే, ఆయన యింటి కట్టుకొయ్య కూడా కవిత చెప్పగలదట! (కంబన్ వీట్టు క్కట్టుత్తరియుం కవి చొల్లుం). ఎళుత్తచ్చన్ మాత్రం సామాన్యుడా? ఎళుత్తచ్చన్ అనే మాటకు అక్షరాచార్యుడని అర్థం. 'తుంజన్ పరం బిలె మణ్ణు విద్యారంభత్తినె విశేషం' అని జనశ్రుతి! తుంజన్ యింటి

ఆవరణలోని యిసుక అక్షరాభ్యాసానికి శ్రేష్ఠమైనదని దీని అర్థం. అంతే కాదు, ఆ ఆవరణలోని చెట్టు ఆకు సైతం చేదుగా ఉండదు అనే జనశ్రుతి కూడా వాడుకలో ఉన్నది. (అ పరందిలె కాంజిన మరత్తినై యిలకైప్పిల్ల) ఈ విధంగా ఈ కవిద్వయం ఈనాటికీ ప్రజల నాలుకల మీద నిలిచివుండడం గమనించదగిన యింకొక అంశం. అయితే వీరు ఏక కాలానికి చెందినవారు కారు. కంబన్ క్రీస్తుశకం 9వ శతాబ్దానికి చెందిన వాడని కొందరు భావిస్తున్నారు, మరి కొందరి దృష్టిలో ఆయన త్యాగవినోదన్ బిరుదాంకితుడైన మూడవ కులోత్తుంగ చోళుని సమకాలికుడనీ, అనగా 12 వ శతాబ్ది ఉత్తరార్థంలోనూ 13వ శతాబ్ది ప్రారంభంలోనూ జీవించినట్లు తెలియవస్తున్నది. ఏమయినప్పటికీ, కంబ మహాకవి చాలా ప్రాచీను డనీ, ఆయన సంతరించిన రామాయణం దేశ భాషలలో వెలసిన రామాయణాలలో మొట్టమొదటి దనీ నిస్సంశయంగా పేర్కొనవచ్చు. ఈ మహాగౌరవాన్ని తమిళ భాషకు చేకూర్చిన ఘనుడు కంబడు. కాని ఎళుత్తచ్చన్ అంత ప్రాచీనుడు కాడు. ఆయన 16వ శతాబ్ది ఉత్తరార్థంలో జీవించాడు. ఈ మహాకవుల రచనలకు ముందూ వెనకా తమిళ మలయాళములలో రామకథా సంబంధములైన రచనలు కొన్ని వెలువడక పోలేదు. కాని వాటికి ప్రచారం నానాటికి తీసికట్టు నాగంభట్టు అయింది.

తమిళ సాహిత్యానికి శ్రీకారం చుట్టిన సంగయుగంలోనే రామకథా ప్రశంస చేయబడటం పేర్కొనదగిన విషయం. సంగయుగపు కాలమును గురించి అభిప్రాయ భేదాలున్నప్పటికీ, అది క్రీస్తుశకం తొలి మూడు శతాబ్దులలో వర్థిల్లినట్లు భావించవచ్చు. సంగకాలపు సంకలన కృతులలో ఒకటయిన అగనానూరులో చిత్రించబడిన యీ అద్భుత సన్నివేశాన్ని పరికించండి: ధనుష్కోటిలో ఒక రావిచెట్టు నీడను ఆసీనుడై రామ చంద్రుడు తన సహచరులతో సమాలోచన జరుపుతున్నాడు, దశకంఠుని మీదికి ఎలా దండెత్తి వెళ్లాలా అని. అప్పుడు చెట్టుమీది పక్షులు చెవులు చిల్లులు పడేలా గోల చేస్తున్నాయి. వాటి వంక రాముడు ఒక్కసారి చూశాడు. అంతే, పక్షుల ఘోల్లకు తాళాలు పడ్డాయి. అనగా, పిట్టలూ పులుగులూ సైతం రాముడి పక్షం వహించినట్లు ఈ సన్నివేశంలో

చమత్కరించబడింది.

పరిపాడల్ అనే మరో కృతిలో అహల్యకథను సంగ్రహంగా తెలియజేసే ఒక పద్యం కానవస్తున్నది. తమిళనాడులో ఉన్న కథకు అనుగుణంగా, ఇంద్రుడు పిల్లి రూపంలో గౌతమాశ్రమం నుంచి నిష్క్రమించినట్లు అందులో ఉదాహరించబడింది.

ఇలా రామకథా సంబంధములైన సన్నివేశాలు కొన్ని కనిపించడమే కాక, అతి ప్రాచీనమైన సంగయుగంలోనే వెణ్బా ఛందస్సులో (అగవల్ ఛందస్సని కొందరి మతం) ఒక రామాయణం వ్రాయబడినట్లూ, క్రీస్తు శకం 650 ప్రాంతాలలో అది వెలుగు చూచినట్లూ, ప్రాచీన కాలంలో రామాయణమును సీరామకదై (శ్రీరామకథ) అని వ్యవహరించేవారనీ తమిళ పండితుల అభిప్రాయం.

తమిళ కావ్యపంచకంలోని సిలప్పదికారం, మణిమేఖల కృతులలో కూడా రామకథా ప్రశంస చేయబడింది. సిలప్పదికారం (మంజీర గాథ) కావ్య నాయకుడైన కోవలుడు, కొన్ని కారణాలవల్ల, స్వస్థలమైన పుహార్ నామాంతరం కల కావేరీ పూం పట్టణమును విడిచిపెట్టి మధురా నగరానికి వెళ్లవలసి వస్తుంది. తత్కావ్యకర్త యీ విషయాన్ని ఇలా వ్యక్తం చేశాడు. 'కోవలన్ వెళ్లిపోయిన తర్వాత పుహార్ పట్టణం రాముడు లేని అయోధ్య వలె ఉన్నది' అని. మధురా నగరం సరిహద్దులు చేరుకున్న పిమ్మట కోవలుడు తనభార్య కణ్ణకిని కౌంతి అనే సన్న్యాసినికి ఒప్పజెప్పాడు. పూర్వం భార్యావియోగంవల్ల రాముడు, నలుడు మున్నగువారు బాధ పడ్డారనే విషయాన్ని అప్పుడు కౌంతి తన అనునయ వాక్యాలలో కోవలుడికి గుర్తు చేసింది.

పెద్ద పెద్ద కొండలను సముద్రంలోకి విసిరివేసి ఆవిధంగా వానర వీరులు సేతునిర్మాణంలో రాముడికి తోడ్పడిన విషయం మణిమేఖలలో పేర్కొనబడింది. ఈ సందర్భంగా ఉదాహరించబడిన సేతువు కన్యాకుమారి అని సుప్రసిద్ధ తమిళ విద్వాంసులు ము.రాఘవయ్యంగారు విశ్వసించారు. కన్యాకుమారి వద్ద ఉన్నది ఆదిసేతు వనీ, ధనుష్కోటి వద్ద ఉన్నది మధ్యసేతు వనీ ఆయన అభిప్రాయం. ఇది సహేతుకంగా ఉన్నట్లు నేను విశ్వసిస్తున్నాను. ఎందుకంటే, ప్రాచీన కాలం నుంచీ

కన్యాకుమారి పవిత్ర యాత్రాస్థలంగా భావించబడుతున్నది. ఇందుకు తమిళ సాహిత్యం సాక్ష్య మిస్తున్నది. పైగా ఆసేతు హిమాచలం అన్న సంస్కృత పద బంధానికి సమానార్థకమైన తమిళ పదబంధం 'కుమరి ముదల్ ఇమయం వరై'. ఇక్కడ ప్రయుక్తమైన కుమరి శబ్దానికి సేతువని అర్థం.

తమిళంలో జైనకవి ఒకరు రామాయణం రచించినట్లు తెలియ వస్తు న్నది. భక్తకవులైన ఆళ్వారులూ, నాయన్మారులూ వెలయించిన భక్తి గీతాలలో రామప్రశంస కానవస్తున్నది. వాల్మీకి చిత్రించిన ఆదర్శ మానవుడు రాముడు ఆళ్వారుల కాలంనాటికి విష్ణ్వంశ సంభూతుడుగా వినుతి కెక్కాడు; రసవత్కావ్యమైన రామాయణం శరణాగతి కావ్యంగా ప్రసిద్ధికెక్కింది. 12వ శతాబ్ది వాడయిన పెరియవాచ్చాన్ పిళ్లై అనే వైష్ణవాచార్యుడు పాశురప్పడి రామాయణం అనే ఒక లఘుకృతిని సంకలనం కావించాడు. ఇందులోని విశిష్టత యేమిటంటే: ద్రావిడ వేద మని ప్రసిద్ధి కెక్కిన నాలాయిర దివ్య ప్రబంధంలోని పదబంధాలతోనే యీ పాశురప్పడి రామాయణం సంతరించబడింది.

18వ శతాబ్దిలో జీవించిన అరుణాచల కవి రామాయణ కీర్తనై అనే గ్రంథం వెలయించాడు. కీర్తనల రూపంలో వెలసిన రామకథ యిది. ఈ కీర్తనలు నేటికీ ప్రచారంలో ఉన్నవి. ఆధునికులలో కొట్టైయూర్ సుబ్రహ్మణ్య అయ్యర్, ఆళవందార్, వేంకట కృష్ణయ్యంగార్ ప్రభృతులు రామాయణం సంతరించారు. ఇక రామకథా సంబంధములైన జానపద గేయాలు ఎన్నెన్నో. నేటికీ వాల్మీకి రామాయణం, కంబరామాయణం తమిళనాడులో పెక్కు చోట్ల పురాణంగా చెప్పబడుతూ వుండడం, కంబరామాయణానికి వ్యాఖ్యలూ మొదలైనవి బహుళంగా వెలువడుతూ వుండడం రామాయణానికి గల ప్రచారానికి ప్రబల సాక్ష్యములు. కనుక, అతి ప్రాచీన కాలం నుంచీ రామకథ తమిళులకు సుపరిచితమైన కథ అనీ, కంబకవికి పూర్వమే తమిళంలో రామాయణం ఒకటి వెలసి వుండ వచ్చుననీ, అయితే ఆ రచన కంబ రామాయణం వెలుగులోకి వచ్చిన తర్వాత మరుగున పడిపోయిందనీ భావించడంలో విప్రతిపత్తి లేదు. అనగా, తమిళనాడులో రామకథా తంతువు అవిచ్ఛిన్నంగా అనుశ్రుతంగా

వస్తున్న దనడం నిర్వివాదం.

కంబకవికి పూర్వం తమిళంలో రామాయణం ఒకటి వెలసిన ట్లుగా, మలయాళంలోనూ అధ్యాత్మ రామాయణానికి ముందు రామకథా సాహిత్యం వెలిసింది.

మలయాళంలో వెలిసిన తొలి రామకథా కావ్యం 'రామచరితం'. ఇది సీరామ కవి కృతం. ఇది 13వ శతాబ్దిలో వెలుగులోకి వచ్చింది. కేవలం యుద్ధకాండ కథనే అభివర్ణిస్తున్న యీ కావ్యానికి అభినందుని సంస్కృత రామచరిత కావ్యానికీ సాదృశ్యం ఏమీ లేదు. రామ పట్టాభిషేకంతో ముగిసిన మలయాళ రామచరిత కావ్యం వాల్మీకమునకు సన్నిహితంగా కనిపిస్తుంది.

15వ శతాబ్దికి చెందిన కణ్ణశ్శ పణిక్కర్ రచించిన రామాయణం మలయాళంలో వెలసిన రెండవ రామకృతి. ఈ కణ్ణశ్శ రామాయణం గరీయః ప్రతిభులైన ఎళుత్తచ్చన్ వంటి మహాకవుల్ని కూడా ప్రభావితుల్ని చేసింది. కణ్ణశ్శ రామాయణంలోని కవిత కమనీయమైనదే కాని, భాష మాత్రం కృతక మైనది. అనగా, అందులో తమిళపు పాలు ఎక్కువ. తొలి రామాయణమైన రామచరితంలోని కవిత అంత ప్రశస్త మైనది కాదనీ, భాష యేమో సంస్కృత పద భూయిష్టమనీ పండితుల విశ్వాసం. కాగా, మలయాళంలో వెలసిన యీరెండు రామాయణాలు కేరళీయుల్ని అంతగా ఆలరించలేకపోయినవి.

15వ శతాబ్దిలోనే మరి రెండు రామాయణాలు వెలువడ్డాయి. అయ్యపిళ్లి ఆశాన్ రామకథా పాట్టు వెలయించాడు. ఇందులోనూ తమిళపు పాలు ఎక్కువ కావడం చేత, దీన్ని మలయాళీలు మలయాళ కృతిగా అంగీకరించడానికి మీనమేషాలు లెక్కిస్తారు. పుణం నంబూదిరి అనే ఆయన రామాయణ చంపు వెలయించాడు. దీనికి మలయాళ సాహిత్యంలో ఉన్నతమైన స్థానం లభించింది. 20 భాగాలుగా వ్రాయబడిన యీ చంపూరచన చక్కని మణిప్రవాళ శైలిలో తీర్చిదిద్దబడింది.

ఎళుత్తచ్చన్ రంగంలో ప్రవేశించిన తర్వాత మలయాళ భాషా చరిత్ర జిగిబిగీ సంతరించుకుంది: నవశకంలో అడుగిడింది. అంతవరకూ ఆధి

పత్యం చెలాయించిన తమిళ భాషా ప్రభావం అంతరించింది. ప్రాచీన ద్రావిడ ఛందస్సులనూ మనోహరమైన మణి ప్రవాళమునూ మేళవించి ఒక నూతన శైలిని సృష్టించిన కవిశేఖరుడు ఎళుత్తచ్చన్. ఆయన శైలి మలయాళీలను బహుధా ఆకర్షించింది. ఆధునిక మలయాళంలో ప్రామాణికమైన శైలిని నెలకొల్పినవాడు ఆయనే. అదే ఆయన శైలి లోని విశిష్టత. ఆయన రామాయణ రచనలోనూ ఒక విశిష్టత లేకపోలేదు.

ఇతర భాషా రామాయణాలకు వాల్మీకం మాతృక. కాని ఎళు త్తచ్చన్ కృతికి మాతృక వాల్మీకానికి చాలా కాలం తరువాత, అనగా పదమూడో పద్నాలుగో శతాబ్దిలో వెలసిన అధ్యాత్మ రామాయణం. ఇలా అధ్యాత్మరామాయణాన్ని మాతృకగా చేసుకుని అద్భుతమైన కృతిని సృష్టించిన ప్రాంతీయ భాషాకవులలో తుంజత్ ఎళుత్తచ్చన్ ప్రముఖుడే కాదు, ప్రధముడు కూడా! పైగా ఆయన అనువాదం మూలానికి అతి సన్నిహితంగా సాగింది. కాని యుద్ధకాండను మాత్రం వాల్మీకి కృతిని అనుసరించి ఆయన రచన కావించాడు. ఆయన రామాయణంలో సుభాషితాలు చుబ్బనచూరలు.

ఎళుత్తచ్చన్ రామాయణం పండిత పామర రంజకమైన రచన. కేక, కాకళి, కళకాంచి మొదలైన దేశిచ్ఛందస్సులలో సాగిన యీ రచన సామాన్యుల్ని సైతం బాగా ఆకర్షించింది. నిజం చెప్పవలసివస్తే, ఎళుత్తచ్చన్ రామాయణానికి సామాన్య ప్రజలలో లభించినంత ప్రచారం కంబరామాయణానికి లభించలేదేమో అనిపిస్తుంది. ఎళుత్తచ్చన్ రామా యణం పారాయణ గ్రంథం. ఈ గ్రంథంలోని కొన్ని భాగాలు చదివితే కన్యలకు మంచి భర్తలు లభిస్తారని కేరళీయుల విశ్వాసం. సాయంకాలం దీపం పెట్టగానే ఎళుత్తచ్చన్ రామాయణంలోంచి కొన్ని పద్యాలు చదవడం మొన్నమొన్నటి వరకూ కేరళలో కనిపించిన ఆచారం. ఈ సందర్భంలో చేల్నాట్ అచ్యుతమీనన్ అన్న మాటలు ఉట్టంకించదగినవి:

'The practice which enjoins on the people the reading of Ezuthachan's Ramayana everyday as a matter of obligatory religious duty still lingers in the nooks and corners of Malabar, inspite of the temptaions of critical thought.'

ఇంత ప్రచారం ఎళుత్తచ్చన్ కృతికి కలగడానికి కారణం ఏమిటి? ఆయనకి ముందు వెలువడిన రామాయణాలకు ప్రచారం లభించకపోవడానికి కారణం ఏమిటి? ఇందుకు ఎళుత్తచ్చన్ కమ్మని కవిత ఒక కారణమైతే, మరో కారణం ఆయన తన రచనలో నిక్షిప్తం చేసిన అద్వైత వేదాంత సుధ, అప్పటమైన భక్తి భావమూను. ఈ వేదాంతసుధ ఇతర మలయాళ రామాయణాలలో కనిపించదు. ఎళుత్తచ్చన్ మాటలలోనే ఈ విషయం తెలుసుకుందాము.

"పాద సేవక నాయ భక్తనాందాసన్ బ్రహ్మ
పాదజన్ అజ్ఞానినాం ఆద్య నాయుళ్లోరు జాన్
వేద సమ్మితమాయ్ మున్నుళ్ల శ్రీరామాయణం
బోధహీనన్‌మార్ కరియాంవణ్ణం చొల్లీర్‌టున్నె."

పాద సేవకుడను భక్తదాసుడను బ్రహ్మ పాదజుడను అజ్ఞానులలో ఆద్యుడను అయిన నేను వేదసమ్మతంగా వెలసిన రామాయణమును జ్ఞానహీనులకు తెలిసేలా వివరిస్తాను - అని ఎళుత్తచ్చన్ సహజవినయం తొణికిసలాడగా పేర్కొన్నాడు. అధ్యాత్మ రామాయణాంతర్గతమైన జ్ఞానమును, అనగా వేదాంత విజ్ఞానమును, నలుగురికి తెలిసేలా వివరిస్తానని ఆయన పేర్కొన్నాడు; కృతకృత్యు డయ్యాడు.

ఎళుత్తచ్చన్‌లా కంబకవి కూడా బ్రాహ్మణేతరుడు; మూర్తీభవించిన వినయం. వాల్మీకి అంటే కంబ కవికి కల ఆదరభావం నిరుపమానం. వాల్మీకి రామాయణం వ్యాప్తిలో ఉండగా, తనవంటి వాడు రామాయణం వ్రాయడం పాలసముద్రము నంతా తాగివేయాలని తలచిన పిల్లి ఆశవంటిదని ఆయన తన రచన మొదట్లో తెలియజేశాడు. ఇది కంబన్ సహజ వినయానికి తారకాణ మాత్రమే. నిజానికి కంబరామాయణం తమిళ సాహిత్యాకాశంలో ప్రతిభాసించే ధ్రువతార. వి.వి.యస్. అయ్యర్ వంటి ప్రసిద్ధ తమిళ విద్వాంసుల దృష్టిలో కంబని కృతి వాల్మీకి రచన కన్న గొప్పది. అయ్యరు గారి యీ మాటలు పరిశీలనాత్మకాలు.

'In the Ramayana of Kamban, the world possesses an epic which can challenge comparison not merely with the Iliad and the Aeneid, the Paradise Lost and the

Mahabharata but with its origin itself, namely the Ramaya-na of Valmiki.'

దేశభాష అయిన సంస్కృతంలో ముగ్గురు (వాల్మీకి, వసిష్ఠుడు, బోధాయనుడు - అని కొందరి మతం; వాల్మీకి, వ్యాసుడు, అగస్త్యుడు - అని కొందరి మతం) రామాయణం వెలయించినా, తాను వాల్మీకి కృతిని ఆధారం చేసుకుని రచన చేశానని కంబకవి స్పష్టం చేశాడు. (తేవ పాడైయిన్ ఇక్కదై చెయ్‌దవర్ మూవర్ ఆనవర్.)

కంబరామాయణంలోని కొన్ని సొగసులను తెలుసుకునేందుకు పూర్వం, మలయాళంలో అధ్యాత్మరామాయణం ఆవిర్భవించిన తీరుని సంగ్రహంగా మనవి చేస్తాను. తెలుగువారమైన మనకు ఇది ఆసక్తిదాయకమైన విషయం.

ఆ నాళ్లలో నేటి అంబలపూళ అనే చంపకశ్శేరిని (కొచ్చినుకి 80 కిలోమీటర్ల దూరంలో ఉన్నది) దేవనారాయణుడనే నంబూద్రి బ్రాహ్మణుడు పరిపాలించే వాడు. కేరళం పరుశురామ క్షేత్రం కదా! కనుకనే బ్రాహ్మణ ప్రభువు. ఆయన కొలువు కూటానికి ఒకనాడు ఉత్తర దేశం నుంచి ఒక బ్రాహ్మణుడు వచ్చాడు. ఆయన రాజుకి సంస్కృత భాషలోని అధ్యాత్మ రామాయణపు తాళపత్ర గ్రంథం బహూకరించాడు. కాని లిపి మాత్రం తెలుగు. అప్పుడు ఆ కొలువు కూటంలోనే ఉన్న మహాపండితుడూ, నారాయణీయం కర్తా అయిన నారాయణ భట్టతిరి ఒక్క ఎళుత్తచ్చన్‌కి తప్ప మరెవ్వరికీ తెలుగు లిపి తెలియదనీ, కనుక ఆయనచేత అధ్యాత్మ రామాయణాన్ని మలయాళ లిపిలో వ్రాయించడం మంచిదనీ సూచించాడు. ఆ సూచన రాజుగారికి నచ్చింది. ఆ తర్వాత రాజాజ్ఞ ప్రకారం అధ్యాత్మ రామాయణాన్ని లిప్యంతరం చేయడమే కాకుండా అనువదించాడు కూడా, ఎళుత్తచ్చన్ మహాకవి.

వాల్మీకిని అనుసరించి కంబకవి రచన సాగించినా, ఆయన రామాయణంలో అవాల్మీకాంశములు ఎన్నో చోటు చేసుకున్నవి. అయితే ప్రధాన కథలో మార్పులు చెయ్యలేదు. పాత్రచిత్రణలోనే కంబడు చేసిన మార్పులు కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి. అందులోనూ ఆయన స్త్రీపాత్ర చిత్రణ ఉదాత్తమైనది. కాని ఆమహాకవి చేసిన కొన్ని వర్ణనలు కొండవీటి చేంతాళ్ళు. రామదర్శనానంతరం సీత చెందిన విరహం కంబరా

మాయణంలో సుమారు నలభై పద్యాలలో వివరించబడింది. వాల్మీకంలో ఒకటి రెండు శ్లోకాలలో దశరథుడు మిథిలా ప్రయాణం చెయ్యగా, ఆ మహా రాజు ప్రయాణం కంబని కృతిలో సుమారు మున్నూరు పద్యాలలో సాగింది.

కంబరామాయణంలోని వర్ణనలు దీర్ఘము లనక తప్పదు. ఒక్కొక్క సారి యీ వర్ణనలు మోతాదును మించినట్లు కనిపిస్తాయి. కనుకనే కాబోలు కంబరామాయణం 'దీర్ఘమైన వర్ణనకు' పర్యాయపదంగా వాడ బడుతున్నది 'ఏమిరా కంబరామాయణం మాట్లాడుతున్నావు' అని చిత్తూరు జిల్లావారు మాటల మధ్య వ్యవహరించడం గమనించదగిన అంశం.

వివాహాత్పూర్వమే సీతారాములు ఒకొరినొకరు ప్రేమించుకొనుట, పిల్లి రూపంలో ఇంద్రుడు గౌతమాశ్రమంనుంచి నిష్క్రమించుట, దశరథుని కోరిక ననుసరించి శత్రుఘ్నుడు ఆయనకు అంత్యక్రియలు జరుపుట, అగస్త్యమహర్షిని తమిళ విద్వాంసునిగా చిత్రించుట, పర్ణశాలా సహితంగా సీతను రావణాసురుడు అపహరించుట, కైకేయిని రాముడు దూష ణోక్తు లాడకుండుట, వాలి మరణానంతరం తారను విరక్తమనస్కగా చిత్రించుట, భ్రాతృప్రేమ కల సోదరునిగా కుంభకర్ణుని అభివర్ణించుట, యుద్ధరంగంలో మృతుడై పడివున్న భర్తను చూచి మండోదరి అక్కడిక క్కడే మరణించుట, విభీషణుడు రావణునికీ-మండోదరికీ అంత్యక్రియలు జరుపుట, మాయాజనక పాత్రను సృష్టించుట, కంబకవి పోషకుడైన శడయప్ప ముదలి పూర్వులు ఇచ్చిన కిరీటమును వసిష్ఠుడు రాముని శిరసున ఉంచుట - మొదలైనవి కంబరామాయణంలో కానవచ్చే కొన్ని మార్పులు. ఇటువంటి మార్పులు ఎళుత్తచ్చన్ రామాయణంలో కని పించవు.

కంబరామాయణంలోని రమణీయ సన్నివేశములలో ఒకటి సీతారా ముల ప్రణయోదంతం. జనకుని అంతఃపురంలోని ఒక మేడ మీద నిల బడివున్న సీతను రాముడు చూస్తాడు. ఆ తర్వాత సీత రాముని చూస్తుంది. (అణ్ణలుం నోక్కినాన్ అవళుం నోక్కినాళ్) అలా యిద్దరూ ఒకరి నొకరు చూసుకున్నారు. అవి ప్రేమైక వీక్షణాలు. వియోగా

నంతరం కలుసుకున్న ప్రేయసీ ప్రియుల ప్రణయం వర్ణనాతీత మనీ, సీతారాములు లక్ష్మీనారాయణులనీ కంబకవి వివాహపూర్వ ప్రణయాన్ని సమర్థించాడు. రాముడు కావించిన శివధనుర్భంగమును 'ఎడుత్తదు కండ నర్, యిట్రదు కేట్టార్' అని ముక్తసరిగా తెలియజేశాడు. రాముడు వింటిని పైకెత్తుట చూశారు, అది విరిగిన సవ్వడి విన్నారు - అని పైదానికి అర్థం. అంత అవలీలగా, కనురెప్పపాటులో, 5,000 మంది బలాఢ్యులు తీసుకువచ్చిన ధనుస్సుని రాముడు విరిచినాడు - అని అర్థం చేసుకోవాలి.

సీతారాముల వివాహాన్ని వర్ణిస్తూ, సీత రెండు దండలు వేసిందని ఎళుత్తచ్చన్ పేర్కొన్నాడు. ఒకటేమో చూపులదండ (నేత్రోత్పలమాల); మరొకటేమో పెండ్లిదండ (వరణార్థమాల). సాలంకృత అయిన సీతనూ, ఆమె అర్పించిన దండలనూ మనమీ పద్యంలో దర్శిద్దాము.

"సొర్ణవర్ణత్తె పూండ మైథిలి మనోహరి
సొర్ణ భూషణంగళు మణిఞు శోభయోటె
సొర్ణ మాలైయుం ధరిచ్చాదరాల్ మందం మందం
అర్ణోజ నేత్రన్ మున్బిల్ సత్రపం వినీతయాయ్
వన్నుడన్ నేత్రోత్పల మాలైయుం ఇట్టాళ్ మున్నే
పిన్నాలే వరణార్థ మాలైయుం ఇట్టీడినాళ్."

మరొక సన్నివేశం:

శూర్పణఖ తన వికృత రూపంలో రాముడి వద్దకు వచ్చినట్లు వాల్మీకంలో పేర్కొనబడింది. కంబమహాకవి శూర్పణఖ అలా రాలేదు. అందాలబరిగా, లావణ్య లతికగా వచ్చింది. పేరు కామవల్లి! ఆ వికృత రూపిణికి కంబడు మనోహరమైన రూపమునే కాక మనోజ్ఞమైన పేరు కూడా ప్రసాదించాడు. ఆ లావణ్య లతికను ఆ మహాకవి ఇలా వర్ణించాడు:

'వంజి ఒళిర్ వింజుకులిర్ ప్పల్లవం అనుంగ
చెంజెవియ కంజనిమిర్ సీరడియళ్ ఆగి
అంజోల్ యిళమంగై యెన అన్నమెన మిన్నుం
మంజియెన నంజమెన వంజమగళ్ వన్దాళ్-"

(పల్లవమును ఎఱ్ఱ ప్రత్తి సిగ్గుగొనగ,
హంస యనగ కేకి యనగ గరళ
మనగ తీగ యనగ అడుగుదమ్ములు వైచి
ఆ పలుకుల కొలికి అరుగుదెంచె)

ఆమె తీగవలె సన్నగా రెపరెపలాడుతూ ఉన్నది. నడక యేమో హంస నడక. సోయగంలో నెమలి వంటిది. పలుకు లేమో తియ్యనివి. కాని మనస్సు మాత్రం విష పూరితం. శూర్పణఖను ఇలా బంగారు బొమ్మగా వర్ణించడంలో కంబకవి ఆంతర్యం స్పష్టమే. వికృత రూపిణిని ఎవ్వరూ ప్రేమించరు. కాగా సుందరుడైన రాముణ్ణి తన వలలో వేసుకునే నిమిత్తం కామరూపిణి అయిన శూర్పణఖ సౌందర్యతిలకగా రూపు దాల్చింది. ఎంత అందాల కొలికి వచ్చినా, రాముని ఏకపత్నీ వ్రతానికి భంగం వాటిల్లదని తెలియజేయడానికి కంబకవి శూర్పణఖకు మనోహరాకృతి కల్పించి వుండవచ్చు.

శూర్పణఖ రాముణ్ణి సమీపించడం, తర్వాత లక్ష్మణుణ్ణి సమీపించడం, ఆ తర్వాత జరిగిన కథ అందరికీ తెలిసిందే. అయితే, యితర రామాయణాలలో వలె కాక, కంబరామాయణంలోని లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు చెవులతోపాటు ఆమె వక్షోజములు కూడా ఖండించాడు. ఆమెను వికృత రూపిణిగా చేసేందుకే ఘూ కఠినచర్య అవలంబించబడింది. ఎళుత్తచ్చన్ రామాయణంలో కూడా ఇలాగే చెప్పబడడం గమనించదగిన విషయం. ఆయన అన్నాడు గదా: '...... కాదుం ములైయుం మూక్కుం ఎల్లాం చేదిచ్చనేరం అవళ్ అలరి.' (చెవులు, స్తనములు, ముక్కు అన్నీ ఛేదించినప్పుడు ఆమె రోదించింది). కంబ రామాయణపు ప్రభావం ఎళుత్తచ్చన్ మీద కనిపించదు. సంస్కృత అధ్యాత్మ రామాయణంలోనూ ఈ విషయం కనిపించదు. మరి వక్షోజ విచ్ఛేదనానికి మూల మేదో తెలియరాలేదు.

ఇక సీతాపహరణం గురించి రెండు మాటలు:

వాల్మీకంలో లేకపోయినప్పటికీ, పర్ణశాలా సహితంగా సీతను రావణుడు అపహరించి తీసుకుపోయినట్లుగా కంబకవి ఎందుకు వ్రాయవలెను?

కావ్య విమర్శ చేసేటప్పుడు, ఆ కావ్యం వెలుగులోకి వచ్చినప్పటి దేశ కాల పరిస్థితుల్ని గుర్తుంచుకోవడం చాలా అవసరం.

కంబకవి కాలంనాటికి సీతారాములు లక్ష్మీనారాయణుల అవతార మనే విశ్వాసం వాడుకలో ఉండేది. ఈ విషయాన్ని ఆయన తన రచనలో పదే పదే ఉదాహరించాడు. పైగా, ఆయన కావ్య నామం రామావతారం. కాగా, సాక్షాత్ లక్ష్మీదేవి అవతారమైన సీతను రావ ణుడు, అందులోనూ మలినమనస్కుడై వచ్చిన రావణుడు, స్పృశించడం వాంఛనీయం కాదని భావించి కంబకవి యిలా పేర్కొని వుండవచ్చు. పూర్వపు శాపమును స్మరణకు తెచ్చుకొని రావణుడు సీతను స్పృశిం చలేదని ఆయన ఒక కారణం కూడా చెప్పాడు. అదీకాక, పతివ్రత అయిన సీతను కుటిలచిత్తుడైన పరపురుషుడు తాకడం ఆనాటి ప్రజల దృష్టిలో అవాంఛనీయమే కాక మన్నింపరాని విషయం కూడా. కనుకనే, లోకజ్ఞుడైన కంబన్ బుద్ధిపూర్వకంగానే ఈ మార్పు [illegible]వుంటాడు. ఆయన చేసిన మార్పులు కథాగౌరవాన్ని ఇనుమడింప జేసేవే కాని అన్యములు కావు. కాగా, ఆ మార్పులు సమర్థనీయములని చెప్పవచ్చు. ఈ దృష్టితో చూచినప్పుడే తార విషయంలో కంబకవి చేసిన మార్పు కూడా సమర్థనీయ మనిపిస్తుంది.

కంబరామాయణం ప్రకారం, వాలి మరణానంతరం అతని భార్య తార సుగ్రీవుని వలపునేస్తం కాక విరక్తమనస్కగా ఉండిపోయింది. ఇది కూడా కంబన్ కాలంనాటి విశ్వాసాలకు అనుగుణంగా ఉన్నది. ఎందు కంటే, పంచకన్యలలో తార ఒకతె. కడమవారు - అహల్య, ద్రౌపది, సీత, మండోదరి ప్రభృతులు. పైగా, తారను ప్రవేశపెట్టిన తీరు హృద్యం. అది కంబకవి పాత్రపోషణ కౌశలమునకు కర్పూర నీరాజనం పడుతున్నది.

వానరోజులు వెనుక పట్టినవి. అయినా అనుకున్న ప్రకారం సుగ్రీవుడు యుద్ధసన్నాహాలకు దిగలేదు. అది రాముడికి కోపకారణ మయింది. లక్ష్మ ణుడు కిష్కింధకు ప్రయాణ మైనాడు, అసలు విషయం తెలుసుకోడానికి. ఉగ్రమూర్తి యై వస్తున్న ఆ లక్ష్మణమూర్తిని చూచి వానరవీరులు భయ భ్రాంతులైనారు. అప్పుడు సుగ్రీవుడు మద్యపానరక్తుడై మన లోకంలో లేడు. కాగా, స్త్రీజన పరివృతయై తార రామానుజుని సమీపించింది.

వారిని చూసేసరికి అగ్నిపర్వతం వంటి లక్ష్మణుడు శాంతమూర్తియై, లజ్జాభారంతో తల వంచుకున్నాడు. అప్పుడు తార, "మీ రాకతో మా భవనం పునీత మయింది. రాముణ్ణి ఒంటరిగా విడిచి మీరు యిక్కడికి రావడం విడ్డూరంగా ఉంది. మీ కోపాన్ని చూచి మా వానరులందరూ భయభ్రాంతులైనారు. ఇంతకూ మీ రాకకు కారణం?" అని అడిగింది. తీయనికంఠంతో తార పలికిన ఆ మృదూక్తులు లక్ష్మణుని ఆశ్చర్యంలో ముంచివేశాయి. ఎవరా యీ వానరభామిని? అని లక్ష్మణుడు తల పైకెత్తి చూశాడు. అంతే. అతని హృదయం శోకార్ణవ మయింది. ఎదుట నిలబడిన తార శ్వేతవస్త్రధారిణి. నుదుట కుంకుమ లేదు. మెడలో మాంగల్యాది పవిత్ర భూషణాలు లేవు. ఆమెను చూడగానే, అదే ఆకృతిలో అయోధ్యలో ఉన్న తన తల్లులు గుర్తుకి వచ్చారు లక్ష్మణుడికి. కనుకనే అతని గుండె దుఃఖంతో నిండిపోయింది.

ఈ సన్నివేశాన్ని పరికించిన తర్వాత, కంబని విమర్శకులు సైతం ఆ మహాకవి ప్రదర్శించిన అనల్పకల్పనా చాతురికి కైమోడ్పు ఘటించక తప్పదు!

కంబకవి వలె, ఎళుత్తచ్చన్ కూడా సీతారాముల్ని దైవస్వరూపులుగా భావించాడు. ఆయన కవితా ప్రతిభ రచన అంతటా కానవస్తున్నప్పటికీ, సుందరకాండంలోని ఒక సన్నివేశం ఎళుత్తచ్చన్ ప్రతిభకు దర్పణం పడుతున్నది.

అశోకవనంలో చింతాక్రాంతయై ఉన్న సీతను సమీపించి రావణుడు ఇరవై పాదాలలో రాముణ్ణి గురించి చేసిన నిందాస్తుతి అవశ్యపఠనీయం. కళకాంచి వృత్తంలో సాగిన యీ నిందాస్తుతి లోంచి నాలుగు పాదాలను మాత్రం ప్రస్తుతం పరిశీలిద్దాము:

"భవతి తవ రమణ మపి దశరథ తనూజనె
ప్పార్త్రాల్ చిలర్క్కు కాణాం చిలప్పోళెడో
వలనమయం అఖిలదిశి నన్నాయ్ తిరగిలుం
భాగ్యవతా మపి కణ్ణు గిట్టా వరం."

రాముడు నీ భర్త అయినా, దశరథ తనూజుడే అయినా, అతనిని కొందరు మాత్రమే కొన్ని వేళల్లో చూడగలుగుతారు. అనగా, రాముడు సన్న్యాసివలె ఊరూరు తిరుగుతున్నాడు కనుక, అతనిని అందరూ అన్ని వేళల్లోనూ చూడలేరనీ కొందరు మాత్రమే కొన్ని వేళల్లోనే చూడగలుగుతున్నారనీ భావం. అతడు పరమాత్ముడు కనుక, చివరికి అతని భార్య కాని జనకుడు కాని అతనిని దర్శించలేరని అంతరార్థం. రాముడు అన్నిదిక్కులా సంచరిస్తున్నప్పటికీ, సర్వ వ్యాపకుడైనా కూడా, కొందరికి మాత్రమే అతని దర్శన భాగ్యం లభిస్తున్నది. ఋషులు కూడా ఆ పరమాత్ముని సందర్శించలేరని అంతరార్థం.

చివరికి కామవివశుడైన రావణుని చేత ఇలా పలికిస్తాడు ఎళుత్తచ్చన్: "సుముఖి! తవ చరణనలిన దాసోస్మ్యహం" అని. నేను నీయందు బద్ధానురాగుడనై వున్నాను; ఇక నీవే నాకు దిక్కు - అన్నది మామూలు అర్థం. కాని అసలు అర్థం ఏమిటంటే, ఇక నీ చరణములే నాకు శరణ్యం; నేను నీ చరణ దాసుణ్ణి. ఇక్కడ శరణాగతి భావం ధ్వనిస్తున్నదని విజ్ఞుల అభిప్రాయం.

కంబన్, ఎళుత్తచ్చన్ మహాకవుల మాతృభాషాభిమానం బహుధా ప్రశంసార్హం. దేశీయ ఛ్ఛందస్సు లలో స్వచ్ఛమైన మణిప్రవాళమును పొందుపరిచి, ఎళుత్తచ్చన్ కేరళీయులకు చక్కని చిక్కని మలయాళ శైలిని ప్రసాదించి చిరస్మరణీయు డైనాడు.

ఇక కంబన్ మాతృభాషాభిమానం పలుచోట్ల ఆయన రచనలో ప్రదర్శిత మయింది. ఆయన చేసిన అయోధ్యానగర వర్ణన చదువుతుంటే, ఆ నగరం కావేరీ తీరాన ఎక్కడో ఉన్నట్లు అనిపిస్తుంది. గోదావరిని కావేరితో సరిపోల్చడం మనం చూడవచ్చు. ఉత్తమ కవిత గౌతమీ ప్రవాహం వలె ఉంటుందని ఆయన అభిప్రాయం. తమిళభాషా స్వభావం అనుసరించి కొన్ని పేర్లలో కొద్దిపాటి మార్పులు చేయబడినవి. కౌసల్య - కౌచలై; దశరథుడు - దయరతన్; మహాపార్శ్వుడు - పెరుంపాక్కన్; ధూమ్రాక్షుడు - పుగైనిరక్కణ్ణన్ - మొదలైనవి యిందుకు ఉదాహరణాలు. ఇందువల్ల కంబన్ సంస్కృత భాషాభిమాని కాడని అనుకున్నట్లయితే, అది పొరపాటు తప్ప మరొకటి కాదు.

ఆయన సంస్కృత భాషాభిజ్ఞుడు. వాల్మీకి అన్నా, రామకథ అన్నా ఆయనకి గల భక్తి ప్రపత్తులు అనిర్వచనీయములు.

కంబరామాయణంలో వర్ణించబడిన సర్వమానవ సౌభ్రాత్రం ముఖ్యంగా పేర్కొనదగిన విషయం. ఇదే కంబకవి మనకు ప్రసాదించిన సందేశ మని అభిజ్ఞులు అభిప్రాయం. ఆటవికుడైన గుహుడు ప్రదర్శించిన భక్తికి మెచ్చుకుని, "అయోధ్యలో మేము నలుగురం అన్నదమ్ములం; కాని యిప్పుడు అయిదుమంది అయినాము" అని రాముడు అంటాడు. అలాగే వానరుడైన సుగ్రీవుని చూచి "యిప్పుడు మేము ఆరుగురము" అని రాముడు అన్నాడు. రాక్షసుడైన విభీషణునితో చెలిమి యేర్పడిన తర్వాత "యిప్పుడు మేము ఏడుగురం అన్నదమ్ములం" అని తన హర్షం ప్రకటిస్తాడు రాముడు. ఈవిధంగా కంబరామాయణంలో వివిధ వర్గము లవారి నడుమ సోదరభావం స్థాపించబడింది.

ఎళుత్తచ్చన్ సహజంగా భక్తిభావం కల మహాకవి. ఒక్కొక్కసారి భక్తి పారవశ్యంతో ఆయన ప్రతి కాండం మొదట్లోనూ రాముని గురించి కాని కృష్ణుని గురించి కాని కవితాగానం చేశాడు. అద్వైత వేదాంత సౌరభమునూ ఆత్మవిచార ప్రాముఖ్యమునూ కేరళీయులకు వ్యక్తం చేసిన మహనీయుడు ఎళుత్తచ్చన్! ఆయన రామాయణం మల యాళీలమీద చెరగని ముద్ర వేసింది. అందుకు నిదర్శనం "భారతం చదివితే ఉమ్మడి కుటుంబం నశిస్తుంది, రామాయణం చదివితే మోక్షం లభిస్తుంది" (భారతం వాయిచ్చాల్ తరవాడి ముడియుం,రామాయణం వాయిచ్చాల్ మోక్షం కిట్టుం) అనే నమ్మకం వారిలో కలగడమే.

మొత్తంమీద కంబరామాయణం, ఎళుత్తచ్చన్ రామాయణం ఒక్క తమిళులకూ మలయాళీలకే కాక సహృదయులైన సాహితీవేత్తల కందరికీ రసగుళికలు! రసవత్తరములైన యీ రచనలు నేటికీ ప్రచుర ప్రచా రంలో ఉండడం గమనించదగింది. ఇవి ప్రజల కావ్యములు!

# 13. తెలుగు - తమిళ సంస్కృతులు

సంస్కృతిని ఇదమిత్థమని నిర్వచించడం అనుకున్నంత సులభం కాదు. ఆచార వ్యవహారాలను కొందరు సంస్కృతి అనగా, మరికొందరు నాగరకతను సంస్కృతిగా పేర్కొన్నారు. మానవుడు మానసికంగానో ఆధ్యాత్మికంగానో సాధించిన అభివృద్ధియే సంస్కృతి అవుతుందని కొందరి అభిప్రాయం. ఇవన్నీ సంస్కృతిలోని వైవిధ్యాన్ని వ్యక్తం చేస్తున్నవే కాని, ఆ మాటకు గల సమగ్రమైన అర్థాన్ని మాత్రం స్పష్టం చెయ్యడం లేదు. ఒక జాతి జీవన విధానాన్ని అభివ్యక్తం చేసేది సంస్కృతి అని స్థూలంగా చెప్పవచ్చు. ఆచారవ్యవహారాలు, వేష భాషలు, ఆటపాటలు మొదలైన వన్నీ జీవన విధానంలోకి వస్తాయి. సంస్కృతి జాతిని బట్టి మారుతూ వుంటుంది. సమాన ధర్మాలు గల మానవ సమూహాన్ని జాతి అనడం సమంజసం. విభిన్న జాతు లున్నట్లుగానే, విభిన్న సంస్కృతులూ ఉన్నాయి. ఈ విభిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శించిన మహనీయులు భారతీయులు. సంస్కృతులు విభిన్నంగా కానవచ్చినా, సూక్ష్మంగా కనుక పరిశీలిస్తే వాటిలో ఏక వాక్యత గోచరించకపోదు. అందువల్లనే ఇన్ని భేదాల మధ్య కూడా భారతీయులు ఒకటిగా మనగలుగుతున్నారు. అనగా సాంస్కృతికంగా వారిని ఏకం చేస్తున్న సూత్రం ఒకటి ఏదో ఉన్నదని అవగత మవుతుంది. అది ఆధ్యాత్మికం కావచ్చు; మరొకటి కావచ్చు. సుప్రసిద్ధ తత్త్వవేత్త సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు సహనమే సంస్కృతి అన్నారు. బహుభాషలకూ సంస్కృతులకూ నిలయమైన మన దేశానికి ఈ నిర్వచనం సరి అయినదే కాక శిరోధార్యం కూడా. కయ్యాలకు ఆటపట్టుగా మారుతున్న ఆధునిక జగతికే యిది శిరోధార్యమన్నా సాహసం కాదు. తమిళంలో సంస్కృతిని పణ్బాడు అంటారు.

భారతీయులలో సర్వసాధారణంగా కానవచ్చే సహన స్వభావం తెలుగువారిలోనూ తమిళులలోనూ కనిపిస్తుంది. సూక్ష్మంగా చూచే కొద్దీ యీ ఉభయ జాతులలోనూ కొన్ని భేదాలు కొట్టవచ్చినట్లు గోచరిస్తాయి. తెలుగువారి వేషధారణ వేరు తమిళులు వేషపు తీరు వేరు. ఒకరికి పంచకట్టు ప్రీతిపాత్రం. మరొకరికి గూడకట్టు. ఇపుడిపుడు గూడకట్టు

తెలుగు లోగిళ్లలో సహజమై పోయినా, శుభాశుభ కార్యాలలో నలుగురి లోకి వచ్చినప్పుడు పంచకట్టు కట్టడం తెలుగువారి సంప్రదాయం. ఆచార వ్యవహారాలు త్వరితగతిని మారిపోతున్నా, శుభా శుభ కార్యాలలో ఆయా జాతులకు ఉద్దిష్టమైన ఆచారాలు కళ్లకు కట్టినట్లు కనబడతాయి. తెలుగుల భోజన సంప్రదాయానికీ తమిళుల ఆహార విధానానికీ మధ్య తేడా ఉంది. తెలుగు వారు పప్పు, కూర మొదలైనవి కలుపుకుంటారు. తమిళులకు కూర నంచుకోవడం అలవాటు. తెలుగువారిది ముద్దపప్పు; తమిళులది జారు పప్పు. తెలుగువారికి పచ్చళ్లు, ఊరుగాయలు లేకపోతే ముద్ద దిగదు. రామ పట్టాభిషేక సందర్భంలో రంగనాథరామాయణ కర్త

'వరుగులు వడియముల్ వాంఛఁ బుట్టించు
కూరలుఁ బచ్చళ్లుఁ గొమరొందు సిగర
లూరుఁగాయలు..... ...... ..... '

మొదలైనవాటిని విస్మరించలేదు. తమిళులకు పులుసు చారులు నియతిగా ఉండాలి. నంచుకోవడానికే ఊరుగాయ. ఎవరి రుచి వారిది! పరిహసించడం తగదు. 'చవులు జాత్యన్న సమమె'.

తెలుగువారు చాంద్రమానం పాటిస్తారు. అనగా, వారి పంచాంగ గణనకు చంద్రుని గతి ప్రధానం. కనుకనే సర్వ సాధారణంగా తెలుగువారి వివాహ శుభముహూర్తాలు ఏ రాత్రివేళనో తెల్లవారు జామునో ఉంటాయి. తమిళులు సౌరమానం పాటిస్తారు. వారికి సూర్యగతి ప్రధానం. వారి వివాహముహూర్తాలు పగటి వేళ (ఉదయం) ఉంటాయి. తెలుగువారి వివాహాలలో వరుడి ఎడమవైపున వధువు కూర్చుంటుంది. తమిళులలో వధువు కుడి ప్రక్కన కూర్చుంటుంది. స్త్రీల పమిటలలో కూడా తెలుగువారికీ తమిళులకూ భేదం కనిపిస్తుంది. తెలుగు వైదిక బ్రాహ్మణ స్త్రీల కట్టుకీ, తమిళ బ్రాహ్మణ స్త్రీల కట్టుకీ భేదం స్పష్టంగా కని పిస్తుంది. ముఖ్యంగా తమిళ శైవ, వైష్ణవ స్త్రీలకట్టుని బట్టి వారే తెగకు చెందినవారో చెప్పవచ్చు. ఇపుడిపుడు ఈ భేదాలు అంతరిస్తూ ఉండడం గమనించదగిన అంశం. ఆధునిక కాలంలో మహిళ లందరూ, తెలుగువారైనా తమిళులైనా, గూడకట్టునే అభిలషిస్తున్నారు.

చైత్రమాసం (చిత్తిరై) తోనే తెలుగువారికీ తమిళులకూ కొత్తసంవత్సరం ప్రారంభ మవుతుంది. చైత్ర శుద్ధ పాడ్యమి తెలుగు వారికి ఉగాది. ఉగాదికి తరువాత సుమారు పదిరోజులలో తమిళులకు 'వరుష ప్పిరప్పు'. వారి నూతన సంవత్సరం మేష విషువత్తుని అనుసరించి వస్తుంది. అనగా మేషరాశిలో సూర్యుడు ప్రవేశిస్తాడు. తెలుగు ఉగాది పండుగ. అభ్యంగన స్నానం, నూతన వస్త్రధారణం ఎంత ముఖ్యమో, తెలుగువారికి ఉగాది పచ్చడిని అరగించడం అంతే ముఖ్యం. జీవితంలోని సుఖదుఃఖాలకు సంకేతమే యీ పచ్చడి. పంచాంగ శ్రవణం కూడా చాలా ముఖ్యం తెలుగువారికి. పండగ రోజున కొత్తబట్టలు ధరించడం తమిళులకూ సంప్రదాయమే. కాని వారికి పంచాంగశ్రవణం ముఖ్యం కాదు. ఆనాడు తమిళ బ్రాహ్మణులు తర్పణం విడుస్తారు. అనగా వారికి పర్వదిన మన్న మాట!

ఉగాదికి తర్వాత వచ్చే ముఖ్యమైన పండుగ శ్రీరామ నవమి. తెలుగుజాతికి రాముడు ఇలువేలుపు అన్నా సాహసం కాదు. చైత్రశుద్ధ పాడ్యమి మొదలు రామనవరాత్రోత్సవం జరుపుతారు కొందరు. మరి కొందరు నవమి నుండి తొమ్మిది రోజులు ఉత్సవం జరుపుతారు. ఈనాటికీ తెలుగుదేశంలోని ముఖ్యపట్టణాలలో రామనవమి పందిళ్లు రామాయణ పురాణ కాలక్షేపాలు, హరికథలు మొదలైనవి జరుగుతూ వుండడం గమనించదగిన అంశం. రామనవమినాడు రాముణ్ణే పూజించడం, వడపప్పు పానకాలు మొదలైనవి సేవించడం తెలుగువారి సంప్రదాయం. మొత్తం మీద తెలుగుదేశం రామనవమి నాడు సందడిగా ఉంటుంది. ఈ సందడి తమిళనాడులో కనిపించదు. కంబ రామాయణం ఈనాడు ప్రచుర ప్రచారం గడించినా, రామనవమి తమిళులకు ముఖ్యమైన పండుగ కాదనిపిస్తుంది. పల్లె పట్టులలో భారతానికే ఎక్కువ ప్రచారం ఉన్నదన్నా సాహసం కాదు. ద్రౌపది అమ్మవారి గుళ్లల్లో ఉత్సవాలు ఉత్సాహంగా జరుపుతారు. భారత కథల్ని వీధినాటకాలుగా ప్రదర్శిస్తారు.

ఏరువాక పున్నమ, నాగుల చవితి, కృష్ణాష్టమి, వినాయక చవితి, అట్ల తదియ మొదలైనవి తెలుగువారు అనాదిగా చేసుకునే పండగలు. ముఖ్యంగా ఏరువాక పున్నమ రైతుల పండగ. ఆనాడు దుక్కి

(దున్నడం) మొదలవుతుంది. అలాగే శ్రావణ పూర్ణిమనాడు ద్విజులు జంధ్యాలు మార్చుకుంటారు. తెలుగునాడులో కంటే తమిళదేశంలో (ఆవణి ఆవిట్టం) శ్రావణ పూర్ణిమ శ్రద్ధాసక్తులతో నిర్వహించబడు తుంది. తమిళనాడులో ఎంతో ఉత్సాహంగా జరిగే పండగలలో ఒకటి పిళ్లైయార్ చవితి. వీధి కొక పిళ్లైయారు గుడి కనిపిస్తుందంటే అతి శయోక్తి కాదు. వినాయకుని ప్రతిమ కనిపిస్తే చాలు, పొట్టి గుంజిళ్లు తీయడం తమిళులకు అలవాటు.

దేవ్యారాధన తెలుగు తమిళనాడులలో కనిపించే ఒక సామాన్యాచారం. ఆస్తికులు నవరాత్ర పూజలు జరుపుతారు. ఓపిక లేనివారు నవరాత్రులలో ముఖ్యమైన నవమినాడు దేవీపూజ జరుపుతారు. కామాక్షి, మీనాక్షి మొదలైన దేవతలకు ఎంత ప్రాధాన్య మిస్తున్నారో, అంతే ప్రాధాన్యం ఒకనాడు గ్రామదేవతలుగా భావించబడిన మారియమ్మ (మారెమ్మ) కరు మారియమ్మ, ముత్తు మారియమ్మ మొదలైన వారికి కూడా యివ్వబ డడం పేర్కొనదగిన విషయం. బ్రతుకమ్మ జాతరను తెలంగాణలో ఎంత ఉత్సాహంగా జరుపుకుంటారో, నెల్లూరు జిల్లాలో చెంగాళమ్మ ఉత్సవం ఎంత వైభవంగా జరుగుతుందో అంత ఉత్సాహంతోనూ తమిళనాడులో ఈ గ్రామ దేవతలకు ఉత్సవాదులు జరుగుతున్నాయి. ఈ ఆలయాలలో బ్రాహ్మణేతరులే పూజారులు. ఈ అమ్మవార్లకు ఆషాఢ మాసంలో (ఆడినెల) ఉత్సవాలు వైభవంగా జరుగుతాయి. మీనాక్షి అయినా సరే, కరుమారి అమ్మ అయినా సరే ఈ వేలుపు లందరూ శక్తి స్వరూ పిణులే అన్న భావం ప్రచారంలోకి రావడం హర్షించదగిన విషయం. ఇటీవలి కాలంలో తమిళనాడులో ముప్పత్తమ్మ, మారియమ్మ మొదలైన దేవతలకు కొత్త ఆలయాలు వెలిశాయి. నవరాత్రుల సందర్భంగా తమి ళులు బొమ్మల కొలువులు పెడతారు. మధుర మీనాక్షి ఆలయం, తంజావూరు బృహదీశ్వరాలయం వంటి ప్రసిద్ధ ఆలయాలలో కూడా కనులపండువుగా బొమ్మలకొలువు పెట్టడం, దేవతామూర్తుల్ని సర్వాంగ సుందరంగా అలంకరించడం మొదలైనవి జరుగుతాయి. సంక్రాంతి సంద ర్భంగా తెలుగువారి యిండ్లలో బొమ్మల కొలువు కనిపిస్తుంది. తమిళ సంప్రదాయం అనుసరించి, మదరాసు తత్పరిసరాలలో నివసించే తెలుగు

వారు నవరాత్రులలోనే బొమ్మల కొలువు పెడతారు. మహర్నవమినాడు ఆయుధపూజ జరపడం ఆచార మయింది. ఆనాడు వివిధ వృత్తులవారు తమతమ పనిముట్లను అలంకరించి పూజలో ఉంచడం అలవాటు.

నవమి తర్వాత వచ్చే దశమి మామూలు దశమి కాదు; విజయ దశమి. దసరా అని కూడా వ్యవహరిస్తారు. తెలుగుదేశంలో ఇది నిజంగా సరదా గొలిపే పండగ. ఉపాధ్యాయుడు వెంట నడవగా, విద్యార్థులు విల్లంబులు చేత పుచ్చుకుని దసరా పద్యాలు పాడుకుంటూ ఇంటింటికీ వెళ్లడం, ఉపాధ్యాయుణ్ణి గృహస్థు సత్కరించడం, విద్యార్థుల్ని పప్పు బెల్లాలతో తృప్తిపరచడం తెలుగుదేశంలో ముఖ్యంగా పల్లె పట్టు లలో, కనిపించే ఒక ఆచారం. నవనాగరకత ఎక్కువయ్యే కొద్దీ ఈ ఆచారం ప్రచారాన్ని కోల్పోయిందన్నా తప్పు కాదు! దసరా పద్యాలు ఆకాశవాణిలో వినిపించడమే తప్ప నిత్య జీవితంలో వినిపించడం లేదు. ఈ దసరా హడావిడి తమిళనాడులో కనిపించదు కాని విచిత్ర వేష ధారణ చేసుకుని కొందరు వ్యక్తులు వీధులలో కనిపించడం ఉభయ ప్రాంతాలలోను సర్వసాధారణమే. దసరా అనేసరికి మైసూరులో జరిగే కార్యక్రమ నిర్వహణ, ఢిల్లీలో జరిగే రామలీలలు స్ఫురణకు రావడం పరి పాటి. ఇంత కోలాహలం తెలుగు, తమిళ ప్రాంతాలలో లేదు.

దీపావళినాడు టపాకాయల చప్పుళ్లతో యావద్దేశం ప్రతిధ్వనిస్తుంది. బహుశః యింత సందడి యితర పండగవేళల్లో కనిపించదన్నా సాహసం కాదు. తెలుగువారు దీపావళిని రెండు రోజులూ, తమిళులు ఒకరోజు జరుపుకుంటారు. మొదటి రోజు నరక చతుర్దశి అయితే రెండవరోజు దీపావళి అమావాస్య. తమిళులకు రెండవరోజే చాలా ముఖ్య మయింది.

నరక చతుర్దశినాడు తెలుగువారు అభ్యంగనం తర్వాత, టపా కాయలు అవీ కాలుస్తారు. పూర్వం నరక దహనం కావించేవాళ్ళు! అమావాస్యనాడు ప్రమిదెలలో దీపాలు పెట్టడం అలవాటు. ఈ దీపో త్సవం కనుల పండువు గొలుపుతుంది. తమిళనాడులో టపాకాయలు అవీ కాల్చడం అలవాటే కాని, సాయంకాలం ప్రమిద దీపాలు పెట్టడం ప్రచారంలో లేదు. కార్తిక దీపం రోజున తమిళులు నియతిగా దీపాలు పెడతారు. ఆనాడు వారికి దీపోత్సవం! తెలుగుదేశంలో కార్తిక పౌర్ణమి

నాడు శివాలయాలలో దీపాలు పెడతారు; ఇళ్లల్లో కొందరు పెట్టరు. కార్తిక పౌర్ణమినాడు తిరువణ్ణామలైలోని అణ్ణామలై ఆలయంలో (అరుణాచలేశ్వరుడు) కన్నుల కైలాసంగా దీపాలు పెడతారు. అది చూడ వలసిన దృశ్యం! దీపావళినాడు తమిళులు నూతన వస్త్రధారణ చేస్తారు. నిరుపేద లైనా సరే కొత్త బట్టలు కట్టుకుంటారు. మధుర, తంజావూరు మొదలైన ప్రాంతాలలో దీపావళి అంటే నూతన వస్త్రధారణ మనవచ్చు. కొత్త అల్లుళ్లను తీసుకువచ్చి సత్కరిస్తారు. తలై దీపావళి (మొదటి దీపావళి) వైభవోపేతంగా జరుగుతుంది. దీపావళి ఉత్తరాది వారి పండగ అనే నెపంతో, ఇపుడిపుడు కొందరు రాజకీయ వాదులు పొంగలినాడే నూతన వస్త్రధారణ చేస్తారు. మొత్తం మీద దీపావళి పేద సాదులకూ పెద్దలకూ ఉత్సాహమిచ్చే పండగ అనవచ్చు. దీపావళి వెళ్లిన అమావాస్యనాడు కేదారగౌరీ వ్రతం చేస్తారు. ఇది తమిళనాడులో చాలా ప్రచారంలో ఉన్నది. దీనికి తెలుగుదేశంలో అంత ప్రచారం లేదు.

తెలుగువారికి గాని తమిళులకు గాని మకర సంక్రాంతి పెద్ద పండుగ. సంక్రాంతిని తమిళులు పొంగల్ అని వ్యవహరిస్తారు. ఇది మార్గశిర పుష్య మాసాలలో వస్తుంది. పుష్యమాసం తెలుగువారికి శూన్య మాసం. కనుక తెలుగువారు వివాహాది శుభకార్యాలు ఆ నెలలో చేయరు. పుష్యాన్ని తమిళంలో తైనెల అంటారు. తమిళులు తైనెల ఎపుడెపుడు వస్తుందా అని ఎదురు చూస్తారు. తై పిరన్దాల్ వళి పిరక్కుం - అన్నది ప్రసిద్ధమైన సామెత. అనగా తైనెల పుడితే దారీ తెన్నూ ఏర్పడతాయని అర్థం. పూర్వం తమిళులు పొంగల్ రోజునే సంవత్స రాదిగా భావించేవారని తెలియవస్తున్నది. అనగా తైనెలలోనే వారికి ఉగాది వచ్చేది. నూతన సృష్టికి నాంది పలికే సంక్రాంతిని ఉగాదిగా భావించడం సమంజస మనిపిస్తుంది. మధుర, తంజావూరు ప్రాంతాలలో పొంగల్‌నాడు ఇళ్లముందర ద్వారబంధాలకు కణ్ణుప్పూలై అనే ఒక పూలమొక్కను జొనుపుతారు. ఈ ఆచారం ఇతర ప్రాంతాలలో కనిపించదు. అలాగే తత్పరిసరాలలో జల్లిక్కట్టు అనే ఎడ్లపందెం జరుపుతారు. (ఈ పందెం స్పెయిన్‌లో వాడుకలో ఉన్నట్లు తెలియవస్తున్నది) పొగరు

గిత్తని అదుపులోకి తీసుకురావడం ఈ పందెంలోని పోటీ అంశం. ఇది అనుకున్నంత సులభం కాదు. ఒక్కొక్క సారి పందెంలో పాల్గొనేవారు ప్రమాదాలకు పాల్పడుతూ వుంటారు. ఈ ఎడ్ల పందెం చూడడానికి విదేశీయులు కూడా సంక్రాంతి వేళకు జల్లికట్టు జరిగేచోటు చేరుకుంటారు. తెలుగు నాడులో కొన్ని ప్రాంతాలలో కోడి పందాలు, ఎడ్ల పందాలు జరుగుతూ వుంటాయి. ఇవి అంత భీకరమైనవి కావు.

సంక్రాంతి మూడు రోజుల పండుగ. మొదటిది భోగి, రెండవది మకర సంక్రాంతి, మూడవది కనుము. భోగినాడు ఇళ్ల ముందు భోగిమంటలు వేయడం అలవాటు. పనికిరాని వస్తువులు ఈ మంటలలో వేస్తారు. సాయంకాలం పూట చిన్నపిల్లలకు భోగి పళ్లు పోస్తారు. చెరకు ముక్కలు, రేగిపళ్లు, బంతిపూలు, చిన్న నాణాలు మొదలైనవి కలిపి పోస్తారు. వాటిని ఏరుకోవడం పిల్లలకు ఆచారం. కనుము పండుగ రైతుల పండుగ. పశువుల్ని అలంకరించడం, ఎడ్ల పందాలు, కోడి పందాలు మొదలైనవి నిర్వహించడం అలవాటు. కనుమునాడు మినుప గారెలు భుజించడం సంప్రదాయం. ఆరోజు ప్రయాణాలు చెయ్యడం శ్రేయస్కరం కాదనే విశ్వాసం ఒకటి ఉంది. కనుము తరువాతి రోజుని ముక్కను మని వ్యవహరిస్తారు. ఈనాడు కూడా పశువుల్ని దూడల్ని అలంకరించడం వాటి సంబరం చేయడం సంప్రదాయం. అసలు సంక్రాంతికి ముందునుంచే, అనగా ధనుర్మాసం నుంచే, పండగ హడావిడి ప్రారంభ మవుతుంది. ఆ ముప్పయి రోజులూ హరిదాసులు తళతళ మెరిసే రాగిపాత్రలు తల మీదుంచుకుని కమ్మని పాటలు పాడుతూ ఇంటింటికీ వెళ్లి యాచన చేసినా అది యాచనగా తోచదు. ఒక సంబరంగా కనిపిస్తుంది. అలాగే గంగిరెద్దు వారు, బుడబుక్కలవారు ప్రభృతులు యాచనకోసం బయలు దేరుతారు. ఇల్లు వాకిళ్లు శుభ్రం చేసుకునే హడావిడిలో స్త్రీలు నిమగ్నులై ఉంటారు. బాలికలు గొబ్బెమ్మలు తయారు చేసి వాటిని పసుపుకుంకుమలతోనే కాక బంతి చేమంతి గుమ్మడిపూలతో కనుల పండువుగా అలంకరిస్తారు. అవి వట్టి పేడ ముద్దలు కావు; అందమైన గొబ్బెమ్మలు. ఆ తర్వాత వాటిని గోడలకు కొడతారు. దేవాలయాలలో పూజలు పురస్కారాలు జరుగుతాయి;

పులగం (పొంగలి) నైవేద్యం పెడతారు. ఒక్కమాటలో చెప్పాలంటే సంక్రాంతినాడూ సంక్రాంతికి ముందు నుంచీ తెలుగు దేశపు గ్రామాలలో అంతులేని సంబరం నెలకొంటుంది. తెలుగు పట్టణాలలో కూడా కొద్దిగానో గొప్పగానో ఈ సంబరం కనిపిస్తుంది. హరిదాసుల పాటలు గాని, గొబ్బివేడుకలు గాని తమిళులలో కనిపించవు. ఈనాడు కొందరు పొంగల్ పండుగను తమిళర్ తిరునాళ్ అని వ్యవహరిస్తున్నారు.

తమిళనాడులో కూడా పొంగల్ మూడురోజుల పండగే. భోగి, పొంగల్, మాట్టుప్పొంగల్ అని వ్యవహారం. కాని భోగినాడు చిన్నపిల్లలకు భోగి పళ్లు పోసే సంప్రదాయం లేదు. పొంగల్‌నాడు పాలతో అన్నం పొంగించి సూర్యుడికి నైవేద్యం పెడతారు. ఆ పాలు పొంగేటప్పుడు అక్కడ చేరిన బంధుమిత్రాదులు 'పొంగలో పొంగల్' అని కేకలు వేయడం సంప్రదాయం. అది నిజంగా సంబరం గొలిపే దృశ్యం. ఆ తరువాతి రోజు మాట్టుప్పొంగల్. ఆ రోజు పశువులకు సంబరం చేస్తారు. ఆ మరునాడు కాణ్ పొంగల్ లేక కాణం పొంగల్. ఆరోజు బంధుమిత్రుల యిళ్లకు వెళ్ళి వారి యోగక్షేమాలు విచారిస్తారు. ప్రస్తుతం ఈ పండుగను పొంగల్, తిరువళ్లువర్ రోజు, కర్షకుల రోజు (ఉళవర్ దినం) అని జరుపుతున్నారు. తమిళనాడు ప్రభుత్వం వారి సెలవు రోజులు ఈవిధంగా ప్రకటించబడుతున్నాయి. కనుక భోగి పండుగకు ప్రచారం తగ్గినట్లు భావించవచ్చు.

పొంగలి అనగానే తెలుగు సాహిత్యంతో ఏమాత్రం పరిచయం కలిగిన వారికైనా చేమకూర వెంకటపతి (17వ శతాబ్ది) రచించిన విజయ విలాస ప్రబంధంలోని యీ క్రింది ప్రసిద్ధ పద్యం వెంటనే స్ఫురణకు వస్తుంది (3-41). అలాగే తుమ్మలపల్లి వెంకటరత్నంగారు 'పొంగలి' అనే శీర్షికతో వ్రాసిన పద్యాలు కొందరికి గుర్తుకి రావచ్చు.

*'అంగన గుబ్బ చన్మెరుగుటందవు మేలిపసిండి కుండలం*
*బొంగదొడంగె జొబ్బిలగ పూసిన గంధము తావవహ్ని - "సం*
*వంగి కటారి వీరునకు పాలును బియ్యము లేని పొంగలో*
*పొంగలి" యంచు నయ్యలరు బోడులు పారెకు గేలి సేయగన్'*

కుండలోని పాలూ బియ్యం పొంగేటప్పుడు, 'పొంగలో పొంగల్'

అని ఆనందోత్సాహాలతో కేకలు వేయడం తమిళులకు అలవాటని యితః పూర్వం పేర్కొనబడింది. ఆ సంప్రదాయాన్ని ధ్వన్యనుకరణంతో సహా చేమకూర కవి గ్రహించి యథోచిత రీతిని వాడుకున్నాడు. సుభద్ర స్తన ములకు పూయబడిన గంధం విరహాగ్నికి పెటిలి రాలిపోవడం పొంగుతున్న పొంగలిగా కనిపించిందట ఆమె చెలికత్తెలకు. అది చూచి ఆ సఖులు పొంగలో పొంగలి అని గేలి చేశారట! ఒక ప్రాంతపు ఆచారాన్ని కథకు తగినట్లుగా తెలియజేసి తన వర్ణనా నైపుణిని వ్యక్తం చేసిన ఆ కవిరాజు నిశిత దృష్టి ప్రశంసార్హం!

పొంగళ్లు పెట్టడం తెలుగువారికి కొత్త కాదు. అయినా రథ సప్తమి నాడు (మాఘ శుద్ధ సప్తమి) నియతిగా పొంగలి వండి సూర్యుడికి నైవేద్యం పెడతారు. ఆరోజు జిల్లేడాకులతో స్నానం చేసి, చిక్కుడుకా యల రథం తయారు చేసి, ధనుర్మాసపు గొబ్బెమ్మ పిడకల నిప్పుమీద పాలూ బియ్యం కలిపి పొంగలి వండి చిక్కుడాకులలో సూర్య భగవా నుడికి నైవేద్యం పెడతారు. ఇది తెలుగువారు అనాదిగా జరుపుకొనే పొంగలి పండుగ. రథ సప్తమినాడు పొంగలి పెట్టడం తమిళనాడులో ప్రచారంలో లేదు.

మొత్తంమీద సంక్రాంతి లేక పొంగల్ తెలుగువారికీ తమిళులకూ పెద్ద పండుగ అనడం అతిశయోక్తి కాదు. కనుము నాడు కాకి అయినా మునుగుతుందనీ, కనుమునాడు కాకి అయినా కదలదనీ రుచిక రములైన సామెతలు తెలుగులో ఉన్నాయి. తెలుగువారు కనుమునాడు రాకపోకలు సాగించడం మంచిది కాదనుకున్నారు. కాని తమిళులు ముక్క నుము నాడు (కాణుం పొంగల్) బంధువుల యిళ్లకి పని కట్టుకుని వెళ్లి వారి యోగక్షేమాలు కనుక్కుంటారు. సంప్రదాయాలు విచిత్రమైన వని చెప్పడానికి ఇది మంచి నిదర్శనం. సంక్రాంతి శోభ తెలుగు తమిళ కవి లోకాన్ని బహుధా ఆకర్షించడం ఒక వింత కాదు. సంక్రాంతిని అభివర్ణిస్తూ ఎన్నెన్ని కవితలు వెలువడ్డాయో! ఒక తెలుగు కవిత.

*రకరకాల రమ్య రంగవల్లుల లోన*
*వీధులన్ని కనుల విందు చేసె;*
*చలికి వణుకు పుట్ట వెలుగులు చిమ్ముచు*

ఎండదొర రయమున ఏగుదెంచె!

నవ్య ధాన్యలక్ష్మి నట్టింట కులుకంగ
ఎదను ధైర్యలక్ష్మి యిల్లు కట్టు
కొనగ, తలపు లందు కూర్మి ఒలుకగ సం
క్రాంతి లక్ష్మి వచ్చె రమణ మీర!

బంతి పూవు వోలె భావాలు కలిగి, చే
మంతి పూవువోలె మంచి మనసు
కలిగి సంచరింప వలెను లోకమ్ము, సం
క్రాంతి శోభ కపుడె రామ రక్ష!

సంస్కృతుల్ని పరిశీలించేటప్పుడు పరిహాస దృష్టి పనికిరాదు. గడప గడపకు ఆచారాలు మారుతున్నప్పుడు, ఒకరి ఆచారం మరొకరికి వింతగా కనిపించడం ఆశ్చర్యం కాదు. ఆని, ఆడి మాసాలలో (జ్యేష్ఠ, ఆషాఢాలు) తమిళులు ఇళ్లు కూడా మారరు. కాని తెలుగువారికి ఈ పట్టింపు లేదు. అలాగే తమిళులకు అమావాస్య మంచిరోజు. తెలుగు వారికి గొడ్డురోజు. తమిళులకు రాహుకాలం పట్టింపు ఎక్కువ. రాహుకాలం లేకుండా చూసి వారు బయలుదేరుతారు. తెలుగువారికి ఈ పట్టింపు లేదు. కాని, వర్జ్యం చూస్తారు. రాహుకాల, వర్జ్యాలు రెండూ అప్రశస్తములే అయినా, రాహుకాలం ఆయా రోజులలో ఒకే సమయానికి వస్తుంది. అనగా సోమవారమయితే ఉదయం 7-30 నుంచి 9 గంటలవరకు రాహుకాలం. ఆ తరువాతి సోమవారం కూడా రాహుకాలం అప్పుడే ఉంటుంది. వర్జ్యం అలా కాక ప్రతిరోజూ మారుతూ వుంటుంది. మంగళవారం నాడు తమిళులు ఏ మంచి పనీ మొదలు పెట్టరు. కాని ఆ సాయంకాలం రాహుకాలంలో, అనగా 3 నుంచి 4-30 లోగా, దుర్గాదేవి సన్నిధిని దీపాలు పెట్టడం శ్రేయస్కరమని మహిళలు భావిస్తారు. ఈ ఆచారం తెలుగునాడులో లేదనవచ్చు. బుధవారం తమిళుల దృష్టిలో ప్రశస్తమైన రోజు. బంగారం లభ్యమైనా బుధవారం లభ్యం కాదనే సామెత ఈ విశ్వాసాన్ని బలపరుస్తున్నది (పొన్ కిడైత్తాలుం బుదన్ కిడైక్కాదు.)

ప్రాచీనాంధ్ర సాహిత్యంలో స్వతంత్ర కావ్యాలు తక్కువే అయినా,

బమ్మెర పోతన, శ్రీకృష్ణదేవరాయలు, శ్రీనాథుడు, అయ్యలరాజు నారాయణా మాత్యుడు, కదిరీపతి ప్రభృతులు సందర్భానుసారంగా తెలుగువారి ఆచార వ్యవహారాలు, తిండి తీర్థాలు - అనగా సంస్కృతిని - యథోచితంగా అభివర్ణించారు. పోతన రచించిన శ్రీమహాభాగవతంలో గోప బాలురు కృష్ణునితో కూడి చల్దులారగించిన ఘట్టాన్ని విస్మరించలేము. కడుపున దిండుగా గట్టిన వలువలో.... ..... అనే పద్యంలోని (దశమ స్కంధం, 496వ పద్యం) యీ కింది పాదాలు పరమ రమణీయాలు.

'మీగడ పెరుగుతో మేళవించిన చల్ది
ముద్ద డావలి చేత మొనయ నునిచి
చెలరేగి కొసరి తెచ్చిన యూరుగాయలు
వ్రేళ్ల సందులను దా వెలయ నిఱికి.'

అలాగే, శ్రీనాథుని చాటువులు చిరస్మరణీయాలు. దక్షిణ దేశంలో పర్యటించినప్పుడు, ఆ కవి సార్వభౌముడు చెప్పిన పద్యాలు తమిళుల సంస్కృతికి అద్దం పడుతున్నవి. వారి భోజన విధానాన్ని ఆయన చవి చూశాడు. లేకుంటే యీ క్రింది పద్యం చెప్పివుండలేడు.

'తొలుతనే వడ్డింత్రు దొడ్డ మిర్యపుఁ జారు
చెవులలోఁ బొగవెళ్లి చిమ్మిరేఁగ
వలు తెఱంగుల తోడఁ బచ్చళ్లు చవిగొన్న
బ్రహ్మరంధ్రము దాఁకఁ బారు నావ
యవిసాకు వేఁచిన నార్నెల్లు వసి లేదు
పరిమళ మెంచినఁ బండ్లు సొగచు
వేపాకు నెండించి వేసిన పొళ్లను
గంచానఁ గాంచినఁ గ్రక్కవచ్చు.'

పరిశీలించే కొద్దీ, యిలా తెలుగు తమిళ సంస్కృతుల్ని గురించి ఎన్నో విషయాలు చెప్పవచ్చు. సంస్కృతిని నిర్వచించడం ఎంత కష్టమో, సంస్కృతిని గురించి చెప్పడమూ అంతే కష్టం!

శ్రీనాథుడు వైష్ణవ బ్రాహ్మణుల యింట్లో భోజనం చేసి వుంటాడు. పూర్వాచార పరాయణులు నేటికీ కారం ఎక్కువగా ఉపయోగించరు. దానికి బదులుగా మిరియాలు వాడతారు. ఎండు మిరపకాయలు విశ్వా

మిత్ర సృష్టి అని వారి నమ్మకం. కనుకనే ఎండు మిరపకాయలు నిషిద్ధం. ముఖ్యంగా వారు చారులో మిరియాలు వాడుతారు. ఆ మిర్యపుచారునే శ్రీనాథుడు వర్ణించాడు. తెలుగు బ్రాహ్మణులు కూడా శ్రాద్ధం రోజున మిర్యపు చారునే ఉపయోగిస్తారు. దీన్ని తద్దినం చారని చెప్పడం అలవాటు.

తమిళులకు ఆడి (ఆషాఢం) శుక్రవారాలు, ఆడి కృత్తిక, ఆడి అమావాస్యలు చాలా ముఖ్యమైనవి. ఆడి కృత్తికనాడు మురుగన్ దేవాలయాలలో ప్రత్యేక పూజలు జరుగుతాయి. ముఖ్యంగా పళని, తిరుత్తణి తిరుప్పరం కుండ్రం వంటి క్షేత్రాలలో కావళ్లు మోసుకుంటూ భక్తులు ఆలయాలు సందర్శిస్తారు. ఆడి శుక్రవారాలలో మీనాక్షి మొదలైన అమ్మవారి ఆలయాలలో ప్రత్యేక పూజలు జరుగుతాయి. అలాగే తైనెలలో పూసం (పుష్యమి) కూడా శివభక్తులకు ముఖ్యమైన రోజు. తెలుగు వారు ఆషాఢమాసాన్ని శూన్యమాసంగా భావించకపోయినా, శుభకార్యాలు నిర్వర్తించరు. ఆషాఢం తరువాత వచ్చే శ్రావణం తెలుగు మహిళలకు ముఖ్యమైన రోజులు. శ్రావణ శుక్రవారాలు చాలా ముఖ్యమైనవని వేరే చెప్పనవసరం లేదు.

తమిళులు కూడా ఆడి మాసంలో శుభకార్యాలు నిర్వర్తించరు. అంతే కాదు. నూతన గృహ ప్రవేశాలు జరగవు. చివరికి ఇల్లు కూడా మారరు. అప్పుడు ఇల్లు ఖాళీచేసే సమస్య కూడా ఏర్పడదు. కాని ఆడి నెలలోని 18వ రోజు మాత్రం పండగరోజు. దీన్ని పదినెట్టాం పెరుక్కు అనీ, ఆడి పెరుక్కు అనీ అంటారు. తమిళనాడులోని అన్ని ప్రాంతాల వారికి ఇది పండగరోజు కాదు. తమిళనాడుని సస్యశ్యామలం చేస్తున్న కావేరిలోకి ఆరోజు నీళ్లు వదులుతారు. అందువల్ల జలసమృద్ధమై కావేరి పూర్ణకుంభంలా ఉంటుంది. ఆ నదీమతల్లిని తమిళులు పూజిస్తారు. కనుక ఈ ఆడిపెరుక్కు తంజావూరు, తిరుచ్చిరాపల్లి ప్రాంతాలకే పరిమితం. అయినా తమిళుల కృతజ్ఞతా గుణాన్ని సూచించే పండగ యిది.

కృతజ్ఞతా గుణం గల తెలుగువారు కూడా జ్యేష్ఠశుద్ధ పున్నమను ఏరువాక పున్నమ అని వ్యవహరిస్తారు. ఇది కర్షకుల పండుగ. ఆనాడు దుక్కి ప్రారంభ మవుతుంది కనుక, రైతులు ఎద్లను శుభ్రంగా కడిగి అలంకరించి పొంగలి పెడతారు. సాయం సమయం నాగలిని పూజించి పొలం దున్నడం (దుక్కి) ప్రారంభిస్తారు. పొలం పనులు నిర్విఘ్నంగా సాగాలన్నదే హాలికుల ఆశయం. తమిళులు కావేరిని పూజిస్తే తెలుగువారు దుక్కిని పూజిస్తారు. ముఖ్యంగా రైతులోకానికి, ఆ విధంగా నలుగురికీ, ఈ రెండూ పూజార్హము లవుతున్నాయి. హాలికు డంటే అన్నదాత గదా మరి!

# 14. తులనాత్మక సాహిత్యం

భారతదేశం వైవిధ్యానికి కొలువుకూటం. ఎవరి సంస్కృతి వారిది. ఎవరి ఆచార వ్యవహారాలు వారివి. ఎవరి తిండితిర్థాలు వారివి. ఎవరికి వారే యమునా తీరే — అన్నట్లుగా వారు పైకి గోచరిస్తారు. మనదేశంలో వ్యవహృతము లయ్యే భాషలు, మాండలికాలు విభిన్నాలు. అలాగే సాహిత్యాలు కూడా వేర్వేరు. ఇంత వైవిధ్యంలోనూ ఏకత్వం కనిపించడమే మనదేశంలోని ప్రత్యేకత. అలా అని భాషా కలహాలో మతకలహాలో లేవని కాదు అర్థం. ఈ కలహాలూ కావేశాల మధ్య మనం ఏకంగా ఉండగలుగుతున్నామంటే, అందుకు హేతువు మన జాతీయ దృక్పథం అనవచ్చు. భాష, మతం, సంస్కృతి కూడా ఏకత్వానికి దారి తీసే శక్తులే. కాని పరిమిత ప్రయోజనం కలవి. వీటికి అతీత మైనది జాతీయత.

వివిధ భాషా సాహిత్యాలు ప్రచారంలో ఉన్నా, సాహిత్యపరంగా మనం ఏకం కావడానికి సంస్కృత భాషాసాహిత్యాలు ప్రాచీన భారతంలో ఎంతగానో సహకరించాయి; ముఖ్యంగా రామాయణ మహా భారతాలు. సంస్కృతం పండిత భాషయే అయినా, అది సేతువు మొదలుకొని హిమాచలం దాక గల పండితలోకాన్ని ఏకం చేయగలిగింది. భాషా సాహిత్యాల శక్తి అమోఘం!

ఎన్నో భాషా సాహిత్యాలు ప్రచారంలో ఉన్నా, మన విశ్వవిద్యాలయాలలో తులనాత్మక పరిశీలనం ఒక అధ్యయనశాఖగా రూపొందకపోవడం శోచనీయం. ఉదాహరణానికి రామాయణాన్నే పరిశీలిద్దాము. సంస్కృతంలో వాల్మీకి రామాయణమే కాక అధ్యాత్మాది రామాయణాలు ఉన్నాయి. రామాయణ నాటకాలు ఉన్నాయి. ఇక దేశభాషలలోనూ రామాయణ రచనలు పరశ్శతంగా ఉన్నాయి. జానపదుల రామకథలూ ఉన్నాయి. రామకధ ఒకటే అయినా, వివిధభాషాకవులు, ముఖే ముఖే సరస్వతి అన్నట్లుగా, బహువిధాలుగా ఆ కధను వివరించారు. వాగ్గేయకారులు కూడా రామకధను తమకు తోచిన విధంగా కీర్తించారు.

వర్ణచిత్రం, శిల్పం మొదలైన కళలలో కూడా రామకథ చోటు చేసుకుంది. తాము నేర్చిన విద్య ద్వారా వారు రామకథను చిత్రించినా, వారూ ఏదో ఒక సాహిత్యాన్ని స్వీకరించినవారే. ఇలా హనుమంతుని తోకలా పెరిగి పోయిన రామకథాసాహిత్యాన్ని తులనాత్మకంగా పరిశీలించడం అవసరం. ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే, ఒక్క వాల్మీకి రామాయణాన్ని పురస్కరించుకునే ఎన్నో తులనాత్మక పరిశీలనలు చెయ్యవచ్చు. అనగా వాల్మీకి - భాస్కర రామాయణాలు, వాల్మీకి - కంబ రామాయణాలు, వాల్మీకి - కృత్తివాస రామాయణాలు, భాస్కర - కంబ రామాయణాలు, భాస్కర - కృత్తివాస రా మాయణాలు ......... 15 ప్రధాన భాషలలోని రామాయణాలకు 225 (15 X 15) తులనాత్మక పరిశీలనాలు వెలువడే అవకాశం ఉంది. ఇలాగే వివిధ భాషలలోనూ వెలువడిన జానపద రామాయణాలను గురించి కూడా పరిశీలనం చెయ్యవచ్చు. భారతరాజ్యాంగం 15 భాషలు గుర్తించినా, సాహిత్య అకాదెమీ 24 భాషల్ని గుర్తించింది. రామకథా సాహిత్యం అనంతకం అన్నట్లుగా, ఈ తులనాత్మక పరిశీలనల సంఖ్యను కూడా నిర్ణయించడం అంత సులభం కాదు. మరి, ఆగ్నేయాసియా దేశాలలో కూడా రామకథ వ్యాప్తిలో ఉన్నది. కనుక ఆయాదేశాలలోని రామకథకూ వాల్మీకి చెప్పిన కథకూ గల తారతమ్య పరిశీలనం వాంఛనీయ మనిపిస్తుంది.

అలాగే మహాభారతకథ, పంచతంత్రకథలు మొదలైనవి కూడా వివిధ భాషలలోనూ విభిన్న ప్రక్రియలలోనూ అందాలు దిద్దుకున్నాయి. వీటి పరిశీలనం కూడా అవసరమే. తులనాత్మక సాహిత్యాధ్యయనానికి గల పరిధి ఇంతా అంతా కాదని చెప్పడం సత్య సన్నిహితం.

తులనాత్మక సాహిత్యం భారతీయులకు కొత్త కాదు. తెలుగుకి సంబంధించినంతవరకూ తులనాత్మక పరిశీలనం కొత్త కానేకాదు. నిన మొన్నటిదాక తెలుగు పండితులు ఉభయభాషా ప్రవీణులు. కనుక వారి వ్రాతలలో తులనాత్మక పరిశీలనం ఎలాగో చోటు చేసుకునేది. తులనాత్మక పరిశీలకుడు బహూభాషాభిజ్ఞుడై ఉండాలి; వెనుకటివారు సంస్కృతాంధ్రాలు నేర్వగా, నేటి రచయితలలో పలువురు ఆంగ్లం హిందీ బెంగాలీ మొదలైన భాషలు నేర్చిన వారున్నారు. కనీసం రెండు భిన్నబాషలలో

అతడు నిష్ణాతుడై ఉండడం అవసరమే కాదు అభిలషణీయం కూడా. ఇక తులనాత్మక సాహిత్యం ఎలా పెరిగిందో, పెరుగుతున్నదో ఆ వైనం సంగ్రహంగా పరిశీలిద్దాము.

19వ శతాబ్దిలో తులనాత్మక సాహిత్యం పారిస్ తత్పరిసరాలలో వికసించసాగింది; అప్పట్లో ఫ్రాన్సు పుట్టిల్లుగా ఉండేది. తులనాత్మక సాహిత్యాన్ని ఫ్రెంచివారు ఒక ప్రత్యేక విషయంగా గ్రహించి అధ్య యనం చేయసాగారు. అయితే వారి దృక్పథం సంకుచితం. ఇతరుల సంస్కృతుల కంటే తమ సంస్కృతియే మిన్న అని వారి అభిప్రాయం. అందువల్ల ఫ్రెంచి పండితులు ఐరోపీయ సాహిత్యాల మీద ఫ్రెంచి సాహిత్య ప్రభావాన్నే ప్రధానంగా పరిశీలించేవారు. ఇతర సాహిత్యాలను వారు గణనలోకి తీసుకోలేదు. కనుకనే వారి పరిశోధన సంకుచితమై పోయింది.

జర్మనీలో హిట్లరు అధికారానికి వచ్చేంతవరకు తులనాత్మక సాహిత్య విషయంలో ఫ్రెంచి వారిదే పైచెయ్యిగా ఉండేది. యూదు జాతీయు లంటే (జూ) హిట్లరుకి తగని ద్వేషం. అందువల్ల యూదు పండితులు ఐరోపా విడిచిపెట్టి అమెరికన్ విశ్వవిద్యాలయాల్ని ఆశ్రయించారు. వారిలో పలువురు తులనాత్మక సాహిత్య పరిశీలకులు. తత్ఫలితంగా తులనాత్మక సాహిత్యం అమెరికాలో అభివృద్ధి చెందసాగింది.

కాలం గడిచేకొద్దీ ఫ్రెంచి, అమెరికన్ పండితుల దృష్టిలో కొట్టవ చ్చినట్టుగా భేదం కనిపించింది. తులనాత్మక సాహిత్యం సాహిత్యాలనే పరిశీలించేదిగా ఉండాలని ఫ్రెంచివారి వాదం. అమెరికనులు తద్భిన్నంగా వాదిస్తారు. మతం, మనస్తత్వ శాస్త్రం, దర్శన శాస్త్రం, సంగీతం వంటి ఏ విషయంతోనైనా సరే సాహిత్యాన్ని పరిశీలించి తారతమ్యం గ్రహించవచ్చునన్నదే అమెరికనుల వాద సారాంశం. ఈ ప్రధానభేదం రెమక్ అనే జర్మను పండితుని అభిప్రాయంలో ప్రతిబింబిస్తుంది. తులనా త్మక సాహిత్యాన్ని ఆయన రెండు ప్రధానాంగాలుగా విశ్లేషించాడు. (1) రెండు గాని అంతకు మించిగాని సాహిత్యాల తారతమ్య పరిశీలనం. (2) ఏ విషయమునైనా సరే పరిశీలనకు గ్రహించి దాన్ని సాహిత్యంతో సరిపోల్చవచ్చు. కాగా, ఆయన ఫ్రెంచి అమెరికన్ పండితుల భిన్నవా

దాలను గుర్తించిన సమన్వయవాది అయ్యాడు. మొత్తం మీద, రెండు సాహిత్యాల తారతమ్య పరిశీలనమే తులనాత్మక సాహిత్యంగా గ్రహించబడిందని స్థూలంగా చెప్పవచ్చు.

బహు భాషలకూ బహు సంస్కృతులకూ నిలయం కావడం వల్ల, మనదేశంలో తులనాత్మకసాహిత్యానికి ఉజ్జ్వలమైన భవిష్యత్తు కలదనే అంశాన్ని అందరూ గుర్తించారు. కొన్ని విశ్వవిద్యాలయాలలో తులనాత్మక సాహిత్యాధ్యయనం ప్రోత్సహించబడడం గమనించ దగిన అంశం. అయితే రెండు భిన్నసాహిత్యాల మధ్య జరిగే తులనాత్మక పరిశీలనమే తులనాత్మక సాహిత్య మని కొందరు భావించగా, ఒకే సాహిత్యానికి చెందిన యిద్దరు కవులనో లేక రెండు కావ్యాలనో లేక రెండు ప్రక్రియలనో పరిశీలించడం కూడా తులనాత్మక సాహిత్య మవుతుందని మరికొందరు భావిస్తున్నారు.

ఈ సందర్భంగా ఒకసారి జార్జి బెర్నార్డ్‌షా ఛలోక్తిగా అన్న విషయాన్ని గుర్తు చేసుకోవడం సముచితం. ఒకే భాష వ్యవహరించినా, ఆ భాష వల్లనే ఇంగ్లండు అమెరికా ప్రజలు భిన్నజాతులవా రయినారు — అని అన్నాడు. ఇందులో నిజం లేకపోలేదు. అమెరికన్ ఇంగ్లీషు బ్రిటిషు ఇంగ్లీషు విభిన్నములుగా వినిపిస్తాయి. కనుక విభిన్నములైన రెండు సంస్కృతులు కూడా ఏర్పడ్డాయి. సంస్కృతిలో గోచరించే భేదం వల్ల, భాష ఒకటే అయినా అమెరికన్లూ బ్రిటిషువారూ భిన్న జాతులవారుగా భావించబడుతున్నారు. తెలుగు దేశంలో భిన్న మాండలికాలు గోచరించినా, అలాగే తమిళనాడులోనూ మాండలిక భేదాలు కనిపించినా వారి సంస్కృతులలో ఏకత్వం ఉండడం వల్ల తెలుగువారందరూ తెలుగువారుగానూ, తమిళు లందరూ తమిళులుగానూ పరిగణించబడుతున్నారు. ఈ అంశం వివిధ భారతీయ భాషలవారికీ వర్తిస్తుంది. ఈషద్భేదాలున్నా, భారతీయ సంస్కృతిలో ఏకత్వం కనిపిస్తుంది.

ఈనాళ్లలో తులనాత్మక సాహిత్య విషయాలుగా అయిదంశాలు గుర్తించబడ్డాయి. అవి:- ప్రభావ పరిశీలన, సాహిత్య చరిత్ర పరిశీలన, వస్తు పరిశీలన, ప్రక్రియా పరిశీలన, అనువాదం.

ప్రభావ పరిశీలన : ప్రభావ మనే మాటకు - పలుకుబడి అని అర్థం చెప్పవచ్చు. ఒక రచయిత ప్రభావం మరొక రచయిత మీద ఉండవచ్చు. ఉదాహరణానికి రామకథ అనగానే వాల్మీకి మహర్షి స్ఫురణకు రావడం పరిపాటి. ఎవరు ఏవిధంగా చెప్పినా, అసలు కథను ఆయన చెప్పినట్లుగా చెప్పడం వాడుక. వాల్మీకిని అనుసరించి కథాకధనం చెయ్యడం వల్ల ఆయన ప్రభావం రామకథను అభివర్ణించే వారిమీద నియతిగా గోచరిస్తుంది.

తులనాత్మక సాహిత్యం ప్రారంభ మైన తొలినాళ్లలో ఈ ప్రభావం మీదనే ఫ్రెంచి, అమెరికన్ పండితులు తమ దృష్టిని కేంద్రీకరించారు. తరువాతి కాలంలో ప్రభావ మన్నది అమూర్త మని, స్పష్టంగా నిర్వచించలేమని అమెరికన్ పండితులు భావించారు; ప్రభావంలో గంభీరమైనది గంభీరం కానిది అనే రెండు భేదా లున్నాయని పేర్కొన్నారు. గంభీరమైనది ప్రభావ మవుతుందనీ, కానిది స్వీకరణ మాత్రమే ననీ భావించారు. కనుక ఒక కవి మరొక కవిని అనుసరించిన మాత్రాన అది ప్రభావం కాదని వారి అభిప్రాయం. ఈ దృష్టితో చూసినప్పుడు, రంగనాథ రామాయణకర్త వాల్మీకిచే ప్రభావితుడైనా, ఆయన తెలుగుకవి రచనారీతిని మార్చలేకపోయాడు. అలాగే, విశ్వకవి టాగూరు ప్రభావం కృష్ణశాస్త్రి మీద గోచరించినా, రచనారీతి మాత్రం కృష్ణశాస్త్రిదే. తమిళ కవి సుబ్రహ్మణ్య భారతి టాగూరుని క్షుణ్ణంగా అధ్యయనం చేసిన వారిలో ప్రముఖుడు. అయినా ఆయన రచనా రీతి ఆయనదిగానే ఉండిపోయింది. కనుక టాగూరు ప్రభావం భారతి మీద గంభీరమైనది కాదని భావించడం యుక్తం.

ఒక్కొక్కసారి ఇద్దరు కవుల మధ్య సామ్యం కనిపించవచ్చు. సామ్యం ఉన్నంత మాత్రాన ఒక కవి మరొక కవి ప్రభావానికి పాల్పడినట్లుగా అనుకోకూడదు. ఎందుకంటే ప్రభావ సామ్యాలు విభిన్నాలు. సాధారణంగా పోలికలు బట్టి సామ్యం నిర్ణయించబడుతుంది. తమిళకవి తిరువళ్లువర్ కురళులో

కనిన యప్పటికంటె, జనని హర్షించు
తన కుమారుడు ఘనుడని విన్న పిదప

అని పేర్కొన్నాడు. ఇది వినగానే తెలుగువారికి సుమతీ శతక పద్యం స్ఫురణకు వస్తుంది.

పుత్రోత్సాహము తండ్రికి
బుత్రుడు జన్మించినపుడె పుట్టదు, జను లా
పుత్రుని గనుగొని పొగడగ
బుత్రోత్సాహంబు నాడు పొందుర సుమతీ.

భావం ఒకటే అయినా, తెలుగుకవి తండ్రి అన్నాడు, తమిళ కవి తల్లి అన్నాడు. ఈ భావసామ్యాన్ని పురస్కరించుకుని సుమతీ శతక కర్తపై తిరువళ్లువర్ ప్రభావం ఉన్నదని చెప్పగలమా? తెలుగు తమిళకవులు ఇంచుమించు ఒకే సంస్కృతికి చెందినవారు కనుక, వారి భావనలో సామ్యం గోచరించడంలో ఆశ్చర్యం లేదు. ఒక్కొక్కసారి విభిన్న సంస్కృతులకు చెందిన ఆంధ్రాంగ్ల కవుల మధ్య భావ సామ్యం గోచరించవచ్చు.

ఇలా సంవాదాత్మక పరిశీలనం చేసేటప్పుడు భర్తృహరి సుభాషితాల వంటి రచనలు స్ఫురణకు రావడం పరిపాటి. ఒకే సన్నివేశాన్ని ఇద్దరు కవులు ఒకే విధంగా చెప్పడం కనిపిస్తుంది. భర్తృహరిని అనువదిస్తూ ఏనుగు లక్ష్మణ కవి 'గ్రాసము లేక స్రుక్కిన జరా కృశమైన..... కేసరి జీర్ణ తృణంబు మేయునే' అన్నాడు. ఆ భావం గౌరన హరిశ్చంద్రోపాఖ్యానంలో ఇలా రూపు దాల్చింది.

ప్రబల మత్తేభ కుంభస్థల మాంస
కబళ మహోల్లాస కంఠీరవంబు
ముదిసిన ఆకొన్న ముట్టజిక్కినను
పొదలు మాంసము డించి పులు మేయు జనునే?

సాహిత్య చరిత్ర పరిశీలన : ఇది కూడా తులనాత్మక సాహిత్యంలోని ఒక ముఖ్యాంశం. వివిధ ప్రక్రియలు గల రెండు సాహిత్యాలను తులనాత్మకంగా పరిశీలించడం దీని ధ్యేయం. ప్రక్రియలతో పాటు ఆ సాహిత్యసంప్రదాయాలను కూడా పరిశీలించడం అవసరం. ఈనాడు సాహిత్య చరిత్రకారులు కొందరు ప్రారంభదశ నుంచి సాహిత్య చరిత్రను

చెప్పడానికి ఉత్సహించడం లేదు. అలాగే సాహిత్య చరిత్రను శతాబ్దుల వారీగా విభజించడానికి కూడా ఇష్టపడడం లేదు. ఎందుకంటే, ఫలానా శతాబ్దితో ప్రబంధ యుగం ముగిసిందని ఖచ్చితంగా చెప్పలేము. ఒక శతాబ్దిలో ప్రారంభ మైన ప్రబంధ యుగం ఆ తరువాతి శతాబ్దిలో కూడా కొనసాగవచ్చు. నేటికీ తెలుగులో ప్రబంధాలు సకృత్తుగా నైనా వెలువడుతున్నాయి. అంతమాత్రాన ఇది ప్రబంధ యుగ మనడం హాస్యాస్పదం. కనుక విశ్లేషణ విధానం కంటె నియమిత కాల విభజన పద్ధతి శ్రేయస్కరం. అనగా శతక యుగం, ప్రబంధ యుగం అనడం కంటే తిక్కన యుగం, శ్రీనాథ యుగం అనడం సమంజసం.

ఆ కాలంలో ఆ కవిది పైచేయిగా ఉంటుంది. ఆ యుగం లోని కవులు పలువురు ఆ ప్రముఖకవికి శిష్యులుగానో అభిమానులుగానో ఉండవచ్చు. ఆ నియమిత కాలం ముగిసిన తర్వాత మరొక కవిది పైచేయి కావచ్చు. నియమిత కాలమూ యుగమూ పర్యాయపదాలుగా మనం వాడుతున్నా, యుగం దీర్ఘకాలిక మని గుర్తించడం సబబు.

వస్తు పరిశీలన : తులనాత్మకపరిశీలకులు నిన మొన్నటిదాక వస్తువు లేక ఇతివృత్తం అని అర్థ మిచ్చే ఆంగ్లశబ్దం థీమ్‌ని వాడేవారు. దీనికి సమానార్థకమైన జర్మన్ శబ్దం స్టాఫ్. ఇపుడిపుడు ఈ శబ్దమే సరి అయినదని చెపుతున్నారు. థీమ్‌కి గల అర్థం స్పష్టంగా లేదని వారి వాదన. స్టాఫ్ అన్న మాటకు సారమని అర్థం చెప్పవచ్చు. ఏది ఎలా ఉన్నా, మనలో వస్తువనే మాట వాడుకలో ఉన్నది. ఒక భాష నుంచి మరొక భాషకు ఇతివృత్తం, భావం మొదలైనవి వ్యాపిస్తూ వుంటాయి. దీనినే వ్యాపక సిద్ధాంత మనీ వ్యవహరిస్తారు. తమిళదేశపు నాయన్మారులు కొందరు శ్రీశైలాది తెలుగుదేశపు క్షేత్రాలు సందర్శించారు. అలా సందర్శించి భక్తిగీతాలు వెలయించారు. తరువాతి కాలంలో భక్తసంఘాల ద్వారా ఆ ప్రాచీన భక్తవరేణ్యుల కథలు తెలుగుభక్తులకు తెలియడం జరిగింది. కాలక్రమాన అవి తెలుగునాడులోను ప్రచారం గడించుకున్నాయి. శివభక్తుల కథలు గల తమిళ పెరియ పురాణం చదవక పోయినా, వారి కథలు తెలుగువారికి పరిచితము లైనాయి. జీవిస్తే వారిలా జీవించాలని ఒక తెలుగు కవి 'అరయుగ పిన్న

నాడు సిరియాళుడనై, యెలబ్రాయుమందు సుందరు డను నంబినై......'
అనే పద్యం చెప్పాడు. పాల్కురికి సోమనాథుడు ప్రస్తుతి కెక్కిన బసవని చరితను

చెప్పితి భక్తులచే విన్న మాడ్కి
దప్పకుండగను యథాశక్తి జేసి-

అని తెలియజేశాడు. అలాగే పన్నిద్దరాళ్వారుల కథలు కూడా తెలుగు దేశంలో ప్రచారంలోకి వచ్చాయి.

ఇలా భక్తుల కథలతోపాటు కొన్ని భావాలు కూడా ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి పయనించాయి. కనుకనే వాల్మీకి చెప్పని ఉడుతకథ, గడ్డతో సహా సీతను రావణుడు అపహరించిన వృత్తాంతం మొదలైనవి తెలుగు తమిళ నాడులలో వ్యాప్తి పొందాయి. తత్ఫలితంగా ఆ యాభాషలలో మూలానికి కొంచెం భిన్నంగా ఉండే కథలు వాడుక లోకి వచ్చాయి. తమిళ సంస్కృతికి అనుగుణంగా కంబకవి రామకథను తీర్చిదిద్దాడు. తెలుగువారి పచ్చళ్లు మొదలైనవి రంగనాథ రామాయణంలో కానవస్తాయి. మూలానికి విధేయంగా ఉంటూనే కవులు తమ తమ సంస్కృతులకు కూడా స్థానం కల్పించారు. ఏ కవీ కూడా స్థానిక మైన ఆచార వ్యవహారాలను అభివర్ణించకుండా వుండలేదు.

ప్రక్రియా పరిశీలన : వస్తువు వంటిదే ప్రక్రియ కూడా. గమన శీలం కలది. ఆంగ్లసాహిత్య పరిచయ ఫలితంగా భారతీయ సాహిత్యంలో భావగీతం, నవల, ఆత్మకథ మొదలైన నూతన ప్రక్రియ లెన్నో చోటు చేసుకున్నాయి. ఈ ప్రక్రియలు లేని ఆధునిక సాహిత్యం లేదనవచ్చు. వీటి పరిశీలన వల్ల భారతీయ సాహిత్యానికి పుష్టి ఏర్పడడమే కాక దాని విస్తృతి కూడా అవగత మవుతుంది. తెలుగు కన్నడ నవలలు, తెలుగు మలయాళ నవలలు మొదలైనవి ఆసక్తికరములైన తులనాత్మక పరిశీలనలు కాగలవు.

అనువాదం : తులనాత్మక సాహిత్య పరిశీలనలో రెండు భాషల మధ్య వారధి వంటి అనువాదం చర్చనీయాంశం కావడం శోచనీయం. భాషల మధ్య మధ్యవర్తిగా అనువాదాన్ని కొందరు అభివర్ణించారు. ఈ

మధ్యవర్తిత్వం నచ్చనివారు ఒక గ్రంధాన్ని మూలభాషలోనే చదవడం మంచి దన్నారు. అయితే యిది అయ్యేపని కాదు. ముఖ్యంగా బహు భాషానిలయ మైన మనదేశంలో ఆయా మూలభాషలలోనే ఆయా రచనలు చదవాలని ఆశించడం అవివేక మనిపించుకుంటుంది. బహు భాషాభిజ్ఞులు కూడా తాము నేర్చిన అన్ని భాషలలోనూ నిష్ణాతులు కాలేరు. పరిచయమూ పాండిత్యమూ వేర్వేరు. నేటికీ అనువాదం ఒక విశిష్టకళ అని గుర్తించలేని వారున్నారు. యాంత్రికానువాదాల వల్ల ఆశించినంతగా లాభం కలగదు. పైగా మూలభాషకు న్యాయం కల గక పోవచ్చు. చేసిన అనువాదం పఠనయోగ్యంగా ఉండక పోవచ్చు. అనువాదానికి మూలవిధేయత పఠనయోగ్యత ఆవశ్యకము లనడం చర్వి తచర్వణం. అనువాదం మూలానికి అంత సన్నిహితంగా లేకపోయినా, అందులో పఠనయోగ్యత కొరవడినా మనకు అనువాదాలు తప్పనిసరి! భాషాధ్యయనానికి తగినన్ని వసతులు లేకపోవడంవల్ల, అస్సామీ నవలను హిందీ మాతృకను ఆధారంగా చేసుకొని తెలుగు చేసి చదువుతున్నాము. కాగా తెలుగు అనువాదం మూలానికి ఎంత దూరమై పోయిందో వేరుగా చెప్పనవసరం లేదు. అలాగే అస్సామీ వారు కూడా హిందీ నుంచి అనువదించుకుని తెలుగు నవలను చదువుతున్నారు. ఈ పరిస్థితిలో మార్పు స్వాతంత్ర్యానంతరం కూడా రాకపోవడం చింత్యం. ఒకరిని తప్పు పట్టడం కంటె, స్వాతంత్ర్యానంతరం విరివిగా అన్ని భాషల లోనూ అనువాదాలు వెలువడుతున్నాయని హర్షించాలి. ఎప్పటికైనా మూలభాషనుంచే అనువదించగల మంచిరోజులు రాగలవని ఆశించవచ్చు. అనువాదం గురించి ఎలాంటి అభిప్రాయా లున్నా, తులనాత్మక పరిశీల నానికి మంచి అనువాదం దోహదం చేస్తున్నదని చెప్పవచ్చు.

గుడ్డిలో మెల్ల! సంస్కృతగ్రంధాలను ఆ భాషనుంచే మన అనువా దకులు తమ తమ భాషలలోకి పరివర్తించారు. అందువల్ల సంస్కృతాన్ని ప్రత్యేకంగా అభ్యసించక పోయినా అపారమైన సంస్కృతవాఙ్మయం అంద రికీ అందుబాటులోకి వచ్చింది. కొందరు కవులు మూలంలోని ఛందస్సునే అనువాదానికి కూడా స్వీకరించారు. వాల్మీకి రామాయణాన్ని మల యాళ మహాకవి వళ్లత్తోళ్ నారాయణ మీనన్ (1878 - 1958)

అనుష్టుప్పు లోనే అనువదించారు. శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారు (1790 - 1880) తులసీదాసు రామచరిత మానస్‌ని దోహా ఛందస్సులోనే తెలుగు చేశారు(సుందర కాండం మాత్రమే ముద్రితం). ఈ మహనీయుల కృషి కొనియాడదగింది. ఈ కోవకు చెందిన అనువాదాల వల్ల మూలంలోని సొగసులను తెలుసుకోవచ్చు. నిజానికి ఇవి తులనాత్మక సాహిత్య పరిశీలకులకు పెట్టని కోటలు!

భాషాద్వేషం తెలియని స్వభాషాభిమానం తెలుగువారిది. ప్రతి సాహిత్యాన్ని స్వాయత్తం చేసుకోవాలనే ఉదారాశయులు వారు. తొలి రోజుల్లో సంస్కృత ప్రాకృతాలను ఆదరించారు. ఈ రోజుల్లో బెంగాలీ హిందీ మొదలైన భారతీయ భాషలను సరిసమానంగా ఆదరిస్తున్నారు. వివిధభాషా సాహిత్యాలనే కాక విభిన్న సంస్కృతులను వారు ఆదరించారు. ఒక్క మాటలో చెప్పాలంటే, తెలుగువారు సమైక్యవాదులు. ఈ సమైక్య ధోరణిని 1985లో అవతరించిన తెలుగు విశ్వవిద్యాలయంవారు తమ తులనాత్మక సాహిత్యబోధనంలో ప్రదర్శించడం ప్రశంసార్హం. ఈ అంశాన్ని గంగిశెట్టి లక్ష్మీనారాయణ గారు తమ వ్యాసంలో వివరించారు (తెలుగువాణి మూడవ అఖిల భారత తెలుగు మహాసభల ప్రత్యేక సంచిక, పుటలు 43 - 48).

మొదటినుంచీ భారతీయ సాహిత్యరంగానికి గల ఆదర్శం విశ్వజనీనత. భారతీయ సంస్కృతికి ఉత్తమ ప్రతినిధిగా వరలిన నన్నయభట్టు విశ్వజనీనమై వెలసిన మహాభారతాన్ని జగద్ధితంగా తెలుగు చేసి, ఆ మహోదాత్తదృష్టికి వారసు డయ్యాడు. అలాగే మరొక ప్రముఖ ప్రతినిధి అయిన విశ్వకవి రవీంద్రుడు తులనాత్మక సాహిత్యాన్ని విశ్వసాహిత్యమని సహేతుకంగా వ్యవహరించారు. ఆయన 1907 లో ఆ సాహిత్యశాఖను దృష్టిలో ఉంచుకుని చేసిన ప్రసంగం చిరస్మరణీయం. ఆయన అన్నారు గదా: 'సంకుచిత మైన యీ ప్రాంతీయతత్త్వం నుంచి మనం విముక్తులం కావాలి. ప్రతివ్యక్తి కార్యాన్ని పరిపూర్ణంగానూ, ఆ పరిపూర్ణతను మానవుని విశ్వజనీనసృష్టి భాగంగానూ, ఆ విశ్వజనీనతత్త్వపు ఆవిర్భావాలను విశ్వసాహిత్యం ద్వారా దర్శించేందుకు మనం ప్రయత్నించాలి. అలా చేసేందుకు తగిన తరుణ మిది.'

రవీంద్రుడు ఆశించిన యీ విశ్వ జనీనత మనం వాడుతున్న తులనాత్మకసాహిత్యం అన్న పదబంధంలో స్పష్టంగా వ్యక్తం కావడం లేదని ఒక విమర్శ లేకపోలేదు. నిజానికి రెండు సాహిత్యాల మధ్య గల సామ్యాన్ని ప్రదర్శించడమే కాదు తులనాత్మక సాహిత్య లక్ష్యం. అది సమగ్ర అవగాహనకు దోహదం చెయ్యాలి; సాహిత్యాంశాల మధ్య ఏకత్వాన్ని చూసేందుకు తోడ్పడాలి.

ఈ సందర్భంగా 1954, మార్చి 12న సాహిత్య అకాదెమీని ప్రారంభిస్తూ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారు చెప్పిన మాటల్ని మననం చేసుకోవడం సముచితం. 'సాహిత్య అకాదెమీ అన్న పదబంధంలో రెండు మాట లున్నాయి. సాహిత్యం సంస్కృత శబ్దం. అకాదెమీ గ్రీకు మాట. ఈ పేరు మన విశ్వజనీన దృక్పథాన్ని, ఆశయాన్ని సూచిస్తున్నది.' విభిన్న భాషలలో సంతరించబడినా, భారతీయ సాహిత్యం ఒకటే — అని కూడా ఆయన అన్నారు.

ప్రస్తుత పరిస్థితులలో విశ్వవిద్యాలయాలలో తులనాత్మక సాహిత్యానికి సంబంధించిన సిద్ధాంత వ్యాసాలు కొన్ని అయినా వెలువడడం పేర్కొనదగిన అంశం. ఈ విషయంలో జరగవలసినంత కృషి జరగలేదని భావించబడుతున్నది. ఇందుకు ప్రధాన కారణం, ద్విభాషా పరిజ్ఞానం గల పరిశోధకులూ పర్యవేక్షకులూ తగినంతమంది లేకపోవడం. రెండు భారతీయ భాషల్ని కలుపుతూ కూర్చబడిన ద్విభాషా నిఘంటువులుగాని బహుభాషానిఘంటువులు గాని లేవు. వివిధ సాహిత్యాంశాలను సాధికారంగా తెలియజేసే రచనలు లేవు. సమగ్ర సాహిత్య చరిత్రగ్రంథాలూ లభ్యం కావడం లేదు. ఈ శాస్త్ర సాంకేతికయుగంలో భాషాధ్యయనం పట్ల మక్కువ కూడా తక్కు వవుతున్నది. అయినా ఒక విషయం మాత్రం స్పష్టంగా చెప్పాలి. పూర్వం కంటె నేడు వివిధ భారతీయ భాషలలోనూ ఆధార గ్రంథాలు ప్రామాణిక మైనవి లభిస్తున్నాయి; అనువాదాల పట్ల ఆదరాభిమానాలు అధిక మైనాయి. అందువల్ల తులనాత్మకసాహిత్య పరిశోధనకు బంగారం లాంటి భవిష్యత్తు

తులనాత్మక సాహిత్యం

ఉన్నదని భావించవచ్చు.

ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాదెమీ వారు 1983లో ప్రచురించిన 'తెలుగులో పరిశోధన' ను (రజతోత్సవ సంచిక) ఆధారంగా చేసుకుని మన విశ్వవిద్యాలయాలలో పిహెచ్.డి., పట్టములు పొందిన పరిశోధకుల్ని వారి సిద్ధాంతవ్యాసాలను ఒక పట్టికగా ఇవ్వడం అప్రస్తుతం కాదు.(ఇది సమగ్రం కాదు.)

1. అప్పారావు, గంధం : వేమన - సర్వజ్ఞులు - తులనాత్మక పరిశీలన, 1972 .
2. గురవయ్య, మల్లెల : ప్రబోధ చంద్రోదయ విమర్శ - తులనాత్మక పరిశీలన, 1976.
3. గోపాలకృష్ణ రావు, టి : తెలుగు కన్నడాలలో రామాయణ జానపద గేయాలు( ఆంగ్లం), 1982.
4. జగన్నాధాచార్యులు, ఎం : తిక్కన కుమారవ్యాసుల భారతము - తులనాత్మక పరిశీలన, 1983.
5. జయలక్ష్మి, చెన్నాప్రగడ : విశ్వనాథ శ్రీమద్రామాయణ కల్పవృక్షం, కువెంపు శ్రీరామాయణదర్శనం తులవాత్మకానుశీలనం, 1982.
6. తిరుపతిరావు, సి : పారిజాతాపహరణం, జగన్నాధ విజయం - తులనాత్మక పరిశీలన, 1974.
7. దామోదర నాయుడు, గార్లపాటి : తెలుగులో అవధానకవిత, చాటుకవిత - తులనాత్మక పరిశీలన, 1970.
8. నిర్మల, డి : తెలుగు - తమిళ జానపదసాహిత్య తులనాత్మక పరిశీలన, 1981 .
9. భారతి, ఎన్. ఏ : క్రీ. శ. 1900 వరకు తమిళంలో తెలుగులో వచన వికాసం, 1982.

10. భావనారాయణ, బిట్రా : తెలుగు, కన్నడ ఛందస్సుల తులనాత్మక పరిశీలన, 1982 .

11. మహాలక్ష్మి, జి : పాల్కురికి సోమనాథునిపై బసవేశ్వరుని ప్రభావం, 1982 .

12. రత్నావళి, బయ్యా : పంప నన్నయల భారతం - తులనాత్మక పరిశీలన, 1980 .

13. రాధాకృష్ణశర్మ, చల్లా : తెలుగు తమిళ రామాయణాలు - తులనాత్మకాధ్యయనం(ప్రధానంగా రంగనాథ, కంబ రామాయణాలు, ఆంగ్లం), 1968.

14. రామబ్రహ్మం, బేతవోలు : తెలుగు వ్యాకరణాలపై సంస్కృత ప్రాకృత వ్యాకరణాల ప్రభావం, 1982.

15. వీరభద్రరావు, కొత్తపల్లి : తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం, 1956 .

16. వెంకట సుబ్బరాయుడు, జంగా : తెలుగులో ద్విపద రామాయణాలు - తులనాత్మక పరిశీలన, 1979.

17. వెంకట సూర్యనారాయణ, బయ్యా : తెలుగు హిందీ సాహిత్యాలలో 19వ శతాబ్ది వరకు పొందిన గద్య వికాసం - తులనాత్మక పరిశీలన, 1970.

18. వెంకటేశం, బి : భారతీయ - పాశ్చాత్యసాహిత్యదర్శనము ఆనందవర్ధనుడు - అరిస్టాటిల్, 1982.

19. వేంకటాచార్యులు, గుండి : రంగనాథ - వాల్మీకి రామాయణాల తులనాత్మక పరిశీలనము, 1981.

20. వేంకటేశ ఆచార్య, కంబాళూరు : మహాభారతం - పెరుందేవనార్, పంప, నన్నయులు - తులనాత్మక పరిశీలనం(ఆంగ్లం), 1979.

21. వేణుగోపాలరావు, పప్పు : సంస్కృతాంధ్ర భారత భాగవతములు - సదృశ కథాంశ వివేచనం, 1981.

22. సర్వోత్తమరావు, కావేరిపాకం : దాక్షిణాత్య దేశి ఛ్ఛందోరీతులు - తులనాత్మక పరిశీలన, 1977.

23. సుందరం, ఆర్వీయస్ : తెలుగు కన్నడ జానపదగేయాలు - తులనాత్మక పరిశీలన, 1973.

24. సుజాతారెడ్డి, ముదిగంటి : మను, వసు చరిత్రల తులనాత్మక పరిశీలన, 1977.

25. సుబ్రహ్మణ్యం, పి.యస్ : ద్రావిడభాషాక్రియా నిర్మాణం తుల నాత్మక పరిశీలన, 1964.

26. సూర్యకాంతం, వేదుల : వాల్మీకి రామాయణం, రంగనాథ రామాయణం - తులనాత్మక పరిశీలన, 1975.

27. స్వరాజ్యలక్ష్మి, వి : తెలుగు భాష మీద ఉర్దూ ప్రభావం, 1976.

ఈ సందర్భంగా నిడుదవోలు వేంకట రావు గారి ఆంధ్రకర్ణాటక సారస్వతములు(1962), జి. వి. సుబ్రహ్మణ్యంగారి ఆంధ్ర సాహిత్య విమర్శ - ఆంగ్ల ప్రభావం (1983), వి.యస్. రాఘవన్‌గారి తమిళాంధ్ర భారతముల తులనాత్మక పరిశీలనము, ఎస్. గంగప్ప గారి అన్నమాచార్య, ప్రముఖవాగ్గేయకారులు - తులనాత్మక అధ్యయనం(1992) మొదలైన తులనాత్మక పరిశీలనల్ని పేర్కొనవచ్చు. ఆచార్య కొర్లపాటి శ్రీరా మమూర్తి షష్టిపూర్తి అభినందన సంచిక (1989)లోని తులనాత్మక సాహిత్య విభాగం కూడా పేర్కొనదగిందే.

పై పట్టికను అలవోకగా పరిశీలించినా, ఆంధ్రేతర ప్రాంతాలలోని విశ్వవిద్యాలయాలలో తులనాత్మక సాహిత్య పరిశోధన ఎక్కువగా జరిగి నట్లు చెప్పవచ్చు. ఆంధ్రప్రదేశ్‌లోని విశ్వవిద్యాలయాల హిందీ శాఖలలో తులనాత్మక పరిశీలనం ఎక్కువగా జరిగిందని తెలియవస్తున్నది.

# 15. అవీ - ఇవీ

## 1

## దేశ మంటే మనుషు లన్న ప్రాచీన తమిళ కవయిత్రి

ఏ ప్రాంతంలో నివసించినా,ఏ భాష వ్యవహరించినా మహాకవులు మహా కవులే! వారు ప్రకటించే ఉదాత్తభావాలలో ఆశ్చర్యం గొలిపే ఏకవాక్యత గోచరిస్తుంది.

తెలుగు దేశపు తపః ఫలమైన గురజాడ వెంకట అప్పారావు గారు మున్ముమ్మూర్తులా మానవతావాది. 1913 లో ప్రచురితమైన ఆయన దేశభక్తిగేయం అందరికీ శిరోధార్యం. ఏ భాష వారయినా, ఏ దేశం వారయినా అరమరికలు లేకుండా ఆ గేయరాజాన్ని పాడుకుని ఆనందించవచ్చు.

దేశ మంటే మట్టి కాదోయ్
దేశ మంటే మనుషులోయ్-

అని ఆ మహనీయుడు దేశాని కొక కొత్త నిర్వచనం చేశాడు. నదీ నదాలు, కొండలు కోనలు మొదలైన వాటిని దేశంగా భావించడం పరిపాటి. ఇవి దేశం లోని అంతర్భాగాలే కాని, దేశ మంటే మనుషులే అనే అసలు విషయాన్ని స్పష్టం చేసిన ఘనుడు గురజాడ— పైకి కనిపించని దేశభక్తుడు!

దేశంలో జాతీయోద్యమం సాగుతుండిన రోజు లవి. ఆ ఉద్యమ ఫలితంగా దేశమును మాతగా భావించడం జరిగింది. ఉదాత్త భావన! చిత్తశుద్ధి లోపించిన కపట నాయకుల శుష్కోపన్యాసాలు గురజాడను రంపపుకోత పెట్టి వుండవచ్చు. కనుకనే ఆయన దేశ మంటే మనుషు లన్న విషయాన్ని నలుగురికీ గుర్తు చేస్తూ, విశ్వశ్రేయస్సుకి అందరూ నడుము బిగించాలని భావించి వుండవచ్చు. ఏ మయితేనేం, ఆయన చెప్పిన విషయం ప్రత్యక్షర సత్యం!

దేశ మంటే మనుష్లు లన్న అంశం కొత్తగా కనిపించవచ్చు గాని, ఆ ఉదాత్త భావన మన దేశంలో పరోక్షంగానైనా ప్రచారంలో ఉండే

దని చెప్పడానికి ప్రాచీన తమిళ కవయిత్రి అవ్వైయారు చెప్పిన పద్యం సాక్ష్యం. క్రీస్తుకి పూర్వం వర్ధిల్లినట్లు భావించబడుతున్న సంగ(ఘ) యుగంలో, పూర్వాజ్యురా లని గణించబడిన ఆ కవయిత్రి నివసించింది. అనగా సుమారు రెండువేల యేండ్లనాటి ముచ్చట యిది.!

ఇక అవ్వైయారు పద్యాన్ని పరికిద్దాము. ఇది పురనానూరు అనే ప్రశస్త సంకలన కావ్యంలో చోటు చేసుకుంది.

*నాడాగ ఒన్డ్రో కాడాగ ఒన్డ్రో*
*అవలాగ ఒన్డ్రో మిశైయాగ ఒన్డ్రో*
*ఎవ్వళి నల్లవర్ ఆడవర్*
*అవ్వళి నల్లై వాళియ నిలనే!*

దేశ మైనా సరే, అరణ్యమైనా సరే, ఎగుడు దిగుడు భూభాగ మైనా సరే, ఎక్కడ ఆడవర్ (పురుషులు) సజ్జనులై ఉంటారో అక్కడ నేల (భూమి) మంచికి నెలవై ఉంటుంది— అని పై పద్యానికి అర్థం. పురుషు లనే మాటను మనుషు లనే అర్థంలో గ్రహించాలని తమిళ పండితులు భావిస్తున్నారు. మనుష్యుల గుణగణాలను బట్టి వారు నివసించే భూభాగం వెలుగొందు తుందని భావం. అనగా, మనుష్యుల గుణం బట్టి భూ భాగానికి మంచిసెబ్బరలు కలుగుతాయిగాని, ఆ భూ భాగం వల్ల ఆ ప్రాంతానికి పేరు పెంపులు కలగవు. మనిషే ప్రధానం కాని భూభాగం కాదని ఆమె భావించింది.

ఆ ప్రజాకవయిత్రి తమిళ పద్యానికి నా తెలుగు సేత:

*నాడయినా సరే కాడయినా సరే*
*పల్లమయినా సరే మిట్ట అయినా సరే*
*ఎక్కడ కలదో మనుషుల్లో మంచితనం*
*అక్కడ వర్ధిల్లు నేల మంచికి నెలవై.*

గురజాడ వారు కూడా తమ గీతాలలో మంచికి ప్రాధాన్య మిచ్చిన అంశం సర్వవిదితం.

దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా - అనీ

మంచి చెడ్డలు మనుజు లందున
యెంచి చూడగ రెండె కులములు
మంచి యన్నది మాల యైతే
మాలనే అగుదున్ - అనీ

ఆయన పేర్కొన్నారు. మంచి గతమున కొంచెమే నోయి — అని అన్నా, మంచిని పెంచడం అత్యవసర మనీ, మానవుల్లో రెండే కులా లున్నాయనీ అవి మంచి చెడ్డలనీ ఆయన నొక్కి చెప్పారు. గురజాడ సూక్తులు సార్వకాలికాలు!

గురజాడ వలె, అవ్వైయారు కూడా మనుష్యులలో రెండు జాతు లున్నట్లే గుర్తించడం గమనించవలసిన అంశం. అయితే ఆమె గుర్తించిన జాతులు మంచి చెడ్డలు కావు!

జాతు లసలు లేవు, రెండు తప్ప
ఇడెడు వారొకరు, ఇడని వారొకరు
ఇడెడు వారు అభిజాత్యులు
ఇడని వారు హీన కులజులు
ఇదియె పో సత్యము!

దానధర్మాలు చేసేవారు ఇచ్చేవారు; చెయ్యనివారు ఇవ్వనివారు. ఈ యిరుపక్షాల వారినే కాక, ఆమె మంచి చెడులను కూడా గుర్తించింది.

తొలి జన్మల చేసిన మంచియే
ఇలను రూపొందును సంపదగా
మంచివి చేయుము, చెడును వీడుము
సర్వ మత సారాంశ మిదియె!

జాతులు రెండని తెలియజేసిన అవ్వైయారుని ప్రస్తుతించిన మహా కవి భారతి పద్యాన్ని ఉదాహరించడం అప్రస్తుతం కాదు.

జాతులు రెండే రెండని చాటిన
అవ్వ పలుకులనే అమృత మనేము
నీతిని పాటిస్తూ పరులకు తోడ్పడుతూ
నివసిస్తే పైవారు; ఇతరులు కిందివారు.

## 2

# తెలుగుల పొలం తమిళుల పులం

పెళ్లికొడుకు ఆస్తి పాస్తులు గురించి విచారించేటప్పుడు, పొలమూ పుట్రా ఏమన్నా ఉందా? అని అడగడం తెలుగువారి వ్యవహారం. అలాగే తమిళులు నిలం పులం ఇరుక్కా? అని ప్రశ్నిస్తారు. మాటలలోనే భిన్నత్వం కాని అర్థం మాత్రం ఒక్కటే. అయినా కొంచెం లోతుకి దిగి చూస్తే, తెలుగువారి పొలమూ తమిళుల పులమూ సమానార్థకాలుగా కనిపించవు.

నిలం, పులం అనే మాటల సమాహారమే నిలపులం. వరిపైరు పండే చేను నిలం అనీ, మెట్ట పంటలు పండే చేను పులం అనీ తమిళుల వ్యవహారం. వరి పంటకు నీళ్ళు అత్యవసరమన్న విషయం అందరూ ఎరిగినదే. కనుకనే నీర్‌నిలం అని కూడా వ్యవహరిస్తారు; నీళ్ళు నిలిచే చేనని అర్థం. పళ్ళం అని కూడా అంటారు నిలాన్ని. అనగా పల్లపునేల కలది అని అర్థం. పల్లపునేల నీళ్ళు నిలవడానికి అనువైన చోటు.

తెలుగువారి వ్యవహారంలో కూడా ఇలాంటి వాడుక కనిపిస్తోంది. కృషియోగ్యమైన భూమిని పొలమని మనం సాధారణంగా భావించినా, 'వరిపైరు పండించే నేల' అనే అర్థం పొలానికి ప్రయుక్తం. వరి పండే పొలాన్ని మాగాణి అని కూడా అంటారు. పల్లం, పల్లపునేల - మాటలు కూడా మాగాణి లేక పొలం అనే అర్థంలో వాడబడుతున్నాయి. నీటి ఆసరా కలిగింది కనుక పల్లపునేలగా ఉండడమే ప్రశస్తం.

నీటి ఆసరా (వర్షాధారం) లేక పండే చేనుని మెట్ట అనడం మన వ్యవహారం. పొలం అనే మాట చేనుకి సర్వసాధారణంగా వాడ బడుతున్నా, నీటి ఆసరా కలిగిన పొలం నిజానికి మెట్ట కాదు; మెట్టని తమిళులు పులం అని వ్యవహరిస్తారు. మేట్టుప్పులం (మెట్ట), కాట్టుప్పులం (పొదలు నిండినది), కరట్టుప్పులం (కొండప్రాంతపుది) అనీ మెట్టను వ్యవహరిస్తారు.

నిల పులములను నంజ పుంజ అనడం కూడా తమిళులకు పరిపాటి.

నంజను అరవ మాటగా గుర్తించి బహుజనపల్లి సీతారామాచార్యులవారు తమ శబ్దరత్నాకరంలో నంజకు మాగాణి అనే అర్థం ఇచ్చారు. కాని ఆయన ఏ కారణం వల్లనో పుంజను గుర్తించలేదు.

ఆంధ్రనామ సంగ్రహంలోని ఈ కింది పద్యం బట్టి నంజపుంజలు తెలుగులో కూడా ఉన్నట్టు పేర్కొనవచ్చు. ఈ వ్యవహారం నేటికీ మదరాసు తత్పరిసరాలలో నివసించే తెలుగు వారిలోనూ, చిత్తూరు జిల్లావారి వాడుక లోనూ కనిపిస్తున్నది.

*'నంజ యన మడి యనంగను*
*మంజుల కేదార భూ సమాఖ్యలు వెలయుం,*
*బుంజ యన జేను పొలమన*
*గంజన మరుభూమి పేళ్ళు (కాయజ మదనా)'*

నంజ, మడి - ఈ రెండూ మాగాణికి పేర్లు. పొలమును పుంజగా (మెట్టగా) గుర్తించాడు ఆంధ్రనామ సంగ్రహకర్త.

ఈ చర్చవల్ల తేలిందేమిటంటే, నీటి అవసరం కలిగిన నిలం, పొలములు (మాగాణి) సమానార్థకాలు. అలాగే నీటి అవసరం లేని పులం మెట్టలు సమానార్థకాలు. అయితే పులం, పొలం శబ్దాలలో ధ్వనిసామ్యం ఉంది. తమిళ శబ్దాలలోని ఉకారం తెలుగులో ఒకారంగా మారడం విజ్ఞులకు తెలిసిందే. పుగై - పొగ ; ఉలగం - లోకం; ఉరల్ - రోలు మొ||వి ఉదాహరణాలు.

ఇలాగే ధ్వనిసామ్యం అర్థభేదం గల మరొక తమిళ శబ్దం ఆడవర్. తమిళంలోని 'ఆడవర్' మాటకు తెలుగులో ఆడవారని కాదు అర్థం; మగవారని అర్థం.

## 3

# తెలుగు - సౌరాష్ట్ర సంబంధాలు

మధుర, తంజావూరు, తిరుపతి, కుంభకోణం మొదలైన ప్రాంతాలలో సౌరాష్ట్ర కుటుంబాలు ఎన్నో కనిపిస్తాయి. స్థానికులతో పాలలో నీళ్లలా కలిసిపోయే స్వభావం కలవారు కనుక, పురుషుల వేషధారణలో

ప్రత్యేకత అంటూ కనిపించకపోవచ్చు. కాని సౌరాష్ట్రస్త్రీలు, ముఖ్యంగా వృద్ధస్త్రీలు, గోచి పోసి చీర కట్టుకుని విలక్షణంగా కనిపిస్తారు. ఆ కట్టు చూడగానే వారిని సౌరాష్ట్ర మహిళలని సులభంగా గుర్తించవచ్చు. పురుషులైనా, స్త్రీ లైనా వారి భాషలో మాత్రం ప్రత్యేకత ప్రముఖంగా కానవస్తుంది. వారి మాతృభాషాభిమానం ప్రశంసార్హం.

ఈనాడు దక్షిణాపథంలో సౌరాష్ట్రులు పలువురు కనిపిస్తున్నా, ఒకప్పుడు వారు గుజరాతుకి చెందినవారని సౌరాష్ట్ర శబ్దం బట్టి స్పష్ట మవుతుంది. ఒక్క తమిళనాడులోనే సౌరాష్ట్రులు పదిలక్షల మంది నివసిస్తున్నట్లు భావించబడుతున్నది. మధురా నగరంలో అయితే వారి జనాభా సగానికి సగం ఉన్నదన్నా అతిశయోక్తి కాదు. తొలుత వారు గుజరాతులోని సోమనాథ్‌పూర్ ప్రాంతంలో నివసించేవారనీ, క్రీ. శ. 5వ శతాబ్దిలో అక్కడినుంచి యితర ప్రాంతాలకు వలస వెళ్లారనీ, మహమ్మదీయుల దండయాత్రల వల్ల వారు క్రమక్రమంగా దక్షిణాపథానికి తరలి వచ్చారనీ విజ్ఞుల అభిప్రాయం. కొన్ని తరాల పాటు మహారాష్ట్రలో నివసించిన సౌరాష్ట్రులు విజయ నగర సార్వభౌముల కాలంలో మధుర తంజావురాది వివిధ ప్రాంతాలలో స్థిరనివాసాలు ఏర్పరుచుకున్నారు. తదాదిగా వారు దాక్షిణాత్యులుగా వ్యవహృతు లవుతున్నారు.

దక్షిణాపథంలో స్థిరపడిన తొలినాళ్లలో సౌరాష్ట్రులు తమ వ్యవహారాలను తెలుగులో జరుపుకునే వారని పేర్కొనవచ్చు. మొన మొన్నటి దాకా మధుర తత్పరిసరాలలో నివసించే సౌరాష్ట్రులు తమ జాతక చక్రాలను తెలుగులిపిలోనే వ్రాసుకునేవారు; తెలుగుభాష అభ్యసించేవారు. సౌరాష్ట్ర కవులు తెలుగు భాషాభిజ్ఞులై ఉండేవారు. సౌరాష్ట్ర భాషలో సంతరించబడిన రామాయణం తెలుగులిపిలో ఉన్నదంటే, వారు తెలుగుని ఎంతగా అభిమానించారో అవగత మవుతుంది.

సౌరాష్ట్రులది ప్రధానంగా నేత వృత్తి. పట్టు చీరలు మొదలైనవి నేయడంలో సిద్ధహస్తులు. నేటికీ వారు నేసే సుంగుడి చీరలకు దేశం మొత్తం మీద మంచి గిరాకీ ఉంది. సున్నాలు వంటి చుక్కలు గల చీరలే సుంగుడి చీరలు. సుంగుడి అనే మాట తెలుగు సున్నలోంచి వచ్చినట్లు కొందరి అభిప్రాయం. ఒకప్పుడు రాజస్తాన్‌లోని జేత్‌పూర్లో కూడా

ఇవి తయారవుతూ వచ్చినా, ప్రస్తుతం సుంగుడి చీరలకు మధుర ప్రధానకేంద్ర మయింది. సౌరాష్ట్రుల్ని మధుర తత్పరిసరాలలో పట్టునూల్ కరణులు అని వ్యవహరిస్తారు. 'మధురా నగరపు ప్రస్తుత సౌభాగ్యానికి సౌరాష్ట్రులు ముఖ్యకారణం' అని జె. పి. యల్. షెనాయ్ అనే ఐ.సి.యస్. ఉద్యోగి 1937లో ప్రచురితమైన తన ఆంగ్ల గ్రంథంలో (మధుర ది టెంపుల్ సిటీ) పేర్కొన్నాడు. గమనించదగిన విషయమిది!

సౌరాష్ట్రుల ఆచార వ్యవహారాలు కొంతవరకు బ్రాహ్మణుల ఆచారాలను తలపిస్తాయి. మధుర నేలిన రాణి మంగమ్మగారి పరిపాలనా కాలంలో ఈ విషయం వివాదగ్రస్త మయింది. ఉపాకర్మాది వేదోక్త కర్మలు ఆచరించే అధికారం వారికి ఉన్నదా లేదా అనే విషయం చర్చించే నిమిత్తం ఆ రాణి ఒక పండిత పరిషత్తు ఏర్పాటు చేసింది. పట్టునూలు కరణుల పక్షమే తుదకు పరిషత్తు తీర్పు చెప్పింది.

అనంతరం పరిషత్తు వారి నిర్ణయాన్ని ఒక పత్రం మీద వ్రాయించి ఆ పత్రాన్ని మంగమ్మగారు పట్టు నూలు కరణులకు బహూకరించినట్లు తెలియవస్తున్నది.

ఇక తెలుగు - సౌరాష్ట్ర సంబంధాలను రేఖామాత్రంగా పరిశీలిద్దాము.

ఇంటిపేర్లు : తెలుగువారివలె సౌరాష్ట్రులకు కూడా ఇంటిపేర్లు (ఘెర్ నావ్) ఉన్నాయి. వాటిలో కొన్ని అయితే అచ్చంగా తెలుగువారి యింటిపేర్లే! కొండ, పొట్టి, నీలం, తూమాటి - యిందుకు మంచి ఉదాహరణాలు. పెద్ద, మల్లి, దొప్ప మొదలైనవి కూడా వారి యింటి పేర్లే. గృహనామం తమిళులకు లేదు.

వ్యక్తుల పేర్లు : సౌరాష్ట్రుల పేర్లలోనూ తెలుగుదనం కనిపిస్తుంది. వ్యక్తి నామాలలో 'లు' కారాంతాలు ఉండడం పేర్కొనదగిన అంశం. వెంకట్రాములు, గోవిందరాజులయ్య, సుబ్బయ్య, రాముడు మొదలైనవాటిని ఈ సందర్భంగా పేర్కొనవచ్చు.

తెలుగు మాటలు : సౌరాష్ట్రులు మాటలాడుతున్నప్పుడు శ్రద్ధగా

గమనిస్తే, ఆ మాటలలో కొన్ని తెలుగు మాటలు కూడా సహజంగా దొరలి పోతున్నట్లు తెలియవస్తుంది.

అపరంజి (బంగారం), అంగడి (కొట్టు, దుకాణం), గుడ్డె (గుడి) అర్థం, కోతి, ఉడుత, చదువు (విద్య), పిల్ల (శిశువు), బొట్టు (మాంగల్యం), సొమ్ము (నగలు), పోట్ (పొట్ట), ముంగిస్ (ముంగిస), ముగ్గు, జున్న (సున్న), ఇక్క (ఇంకా), చుట్టు మొదలైనవాటిని ఈ సందర్భంగా ఉదాహరించవచ్చు.

ఆచార వ్యవహారాలు : సౌరాష్ట్రులు కూడా తెలుగువారివలె చాంద్ర మానం పాటిస్తారు. కాగా తెలుగువారి ఉగాదియే వారికీ ఉగాది. మొనమొన్నటిదాక సౌరాష్ట్ర పురోహితులు తెలుగు లిపిలో జాతక చక్రాలు వ్రాసేవారు. తెలుగు లిపిలో ఉన్న జ్యోతిష శాస్త్రగ్రంధాలు ఎన్నో మధురలోని సౌరాష్ట్ర సభవారి అధీనంలో ఉన్నాయి. వారి వివాహాలలో నలుగు పెట్టడం, కాశీయాత్ర చేయడం, వధూవరుల మధ్య తెర కట్టడం మొదలైన తెలుగువారి ఆచారవ్యవహారాలు కానవస్తాయి. కట్నాలు చదివించే సమయంలో పురోహితుడు మధ్య మధ్య 'ఇంకా ఎవరయ్యా' అని స్పష్టంగా తెలుగులోనే అంటాడు. వారి మరణగీతాలలో (మొరణు గీతు) సగం తెలుగు సగం సౌరాష్ట్రం వినిపిస్తుంది.

మరణ సమయంలో కొందరు భగవద్గీత చదువుతారు. మరణానంతరం కొందరు గరుడ పురాణం చదువుతారు. ఏదో ఒక ఆధ్యాత్మిక గ్రంధం చదవడం నేటికీ కొన్ని ప్రాంతాలలో కొన్నికులాలలో వాడుకలో ఉంది. మధురలోని సౌరాష్ట్రులు ఒక వ్యక్తి మరణించినప్పటి నుంచీ అతనికి దహన సంస్కారం జరిగేంతవరకు మాధవుడు గీతు పాడతారు. ఈ గీతాన్ని ఇద్దరు పాడతారు; పక్క వాద్యా లేమీ ఉండవు. పాడేవారికి తెలుగు తెలియదు. ఆ గీతం వారికి కంఠతః వచ్చు. గీతంలో అక్కడక్కడ వచనభాగాలు కూడా ఉంటాయి. గీత మేమో తెలుగులోనూ వచనమేమో సౌరాష్ట్ర భాషలోనూ ఉంటుంది. సౌరాష్ట్రుల సౌకర్యం కోసం తరువాతి కాలంలో వచనభాగం వెలిసి వుండవచ్చు. మాధవుడు గీతం పెద్దదే. అందులోంచి కొన్ని పాదాలు.(గీతంలోని భాషాస్వరూపం చాలా మారిపోయింది. కొన్ని మాటలు సరిగా అర్థం కావడం లేదు.)

హరిహర రామానుజ యీా మద(ర) ములో
అద్భుత మేమయ్యా
స్థిరముగ విను శిష్యుడా సిద్ధాంతసా
స(ర)ము లేని(ను) దలివే (దెల్పే)నయ్యా
పర తత్త్వం విని మర్మం పొందిన మా
ధవరాజు చరిత్రము
స్థిరముగ విను దెల్పేను శ్రీ గురు చరణా
సేవా చేసియుండేను
మంత్ర యోగాభ్యాసము పొందిన మా
ధవరాజు చరిత్రము
ఎంత విచిత్రములు ఈ రహస్యము
అంత నిన్ను ద(దె)ల్పేను (అంత నీకు దెల్పేను.)
బ్రి(పృ)థ్వి యేలుచుండంగ మాధవరాజు
దుద్దెసె(దుర్దశ) పుట్టేనయ్యా
మది(తి) హీన లేవున్న మానిసమాం
శ(స)ము దెచ్చినారయ్యా

ఇంకా వివరాలకు సౌరాష్ట్రుల వరౌణికవాఙ్మయం అనే ఆంగ్ల గ్రంథం చూడవచ్చు.

సౌరాష్ట్ర వాగ్గేయకారులు : సౌరాష్ట్ర వాగ్గేయకారులూ కవులూ తెలుగు భాషాభిజ్ఞులు కావడం విస్మరించరాని విషయం.

త్యాగరాజస్వామి వారి ప్రథమశిష్యుడైన వేంకట రమణ భాగవతులు ప్రసిద్ధ వాగ్గేయకారుడు. త్యాగరాజు కృతుల్ని భద్ర పరచడమే కాక, ఆయన స్వయంగా తెలుగులో చక్కని కీర్తనలు కొన్ని వెలయించాడు. 1947 నుంచీ వేంకట రమణ భాగవతులు జన్మ స్థలమైన అయ్యంపేటలో (తంజావూరు జిల్లా) త్యాగరాజ జయంతినీ వేంకట రమణ భాగవతుల జయంతినీ కలిపి సౌరాష్ట్రులు ఒకే జయంతిగా ఫాల్గుణమాసంలో జరపడాన్ని ఈ సందర్భంలో పేర్కొనవచ్చు. త్యాగరాజు పట్ల వారికి గల ఆదరాభిమానములను ఈ విషయం వ్యక్తం చేస్తున్నది.

తాను జీవసమాధి చెందేముందు త్యాగరాజు తనవద్ద ఉన్న కృతులు,

తాళపత్ర గ్రంథాలు, పారాయణం చేసే పోతనామాత్యుని భాగవతపు ప్రతి మొదలైన వాటిని వేంకట రమణ భాగవతులకు ఇచ్చినట్లు ప్రతీతి. అవి నేడు మధుర సౌరాష్ట్ర సభాభవనంలో భద్రపరచబడివున్నాయి.

వేంకట రమణ భాగవతులు తన కృతులలో గురుస్తుతి యిలా కావించాడు.

'గురువరు మహిమల నేమని భువిలో
కొనియాడుదురా'
'తిరువైయారను పురమున వెలసిన
హరిభక్తాగ్రేసరులగు త్యాగరాజు'

ఆయన త్యాగరాజు మంగళాష్టకం కూడా వ్రాశాడు. నౌకాచరిత మును సంస్కృతంలోకి పరివర్తనం చేశాడు.

సౌరాష్ట్రకవులలో ప్రముఖుడు వెంకట సూరి. ఆయన వేంకట రమణ భాగవతుల ప్రియ శిష్యుడు. వాగ్గేయకారుడైన ఆయన తెలుగులో కొన్ని కృతులు వెలయించాడు. సౌరాష్ట్ర భాషలో రామాయణం రచించాడు. అయితే అది తెలుగులిపిలో ఉన్నది. అలాగే జయదేవుని గీతగోవిందానికి వెలసిన సౌరాష్ట్ర అనువాదం తెలుగులిపిలో ఉన్నది. ఈ విషయాదికం పరిశీలిస్తే, ఒకప్పుడు సౌరాష్ట్రులు తెలుగు భాషా సాహిత్యాలను అభ్యసించడమే కాక తెలుగులో రచనాశక్తి కూడా కలిగివుండేవారని విదిత మవుతుంది.

దక్షిణాపథంలో తెలుగు భాషా సాహిత్యాలు సాధించిన సాంస్కృతిక విజయాలను గ్రహించడానికి తెలుగు సౌరాష్ట్రభాషల తులనాత్మక పరిశీలనం ఎంతైనా తోడ్పడుతుంది. సౌరాష్ట్రుల ఆచార వ్యవహారాలను పర్యాప్తంగా కనుక పరిశీలిస్తే, ఆసక్తికరములైన యిలాంటి అంశాలు మరి కొన్ని బయల్పడగలవని నిస్సంశయంగా పేర్కొనవచ్చు.

(ఈ వ్యాస రచనలో తోడ్పడిన మిత్రులు ఆర్. వి. సౌలి, ఒ. యస్. సుబ్రమణియన్ గార్లకు కృతజ్ఞుణ్ణి.)

4

# దక్షిణాది భాషలలో విజ్ఞాన సర్వస్వం

స్వాతంత్ర్యానంతరం మనదేశంలో రాజకీయ సాంఘికాది వివిధ రంగాలలో ఘనవిజయా లెన్నో సాధించడం జరిగింది. ముఖ్యంగా, సాంస్కృతిక సాహిత్యరంగాలలో జరిగిన కృషిని అపూర్వ మనవచ్చు. విజ్ఞానశాస్త్రంలో వివిధశాఖలకు సంబంధించిన జాతీయ పరిశోధనాలయాలు, వివిధదేశభాషలలోను జరిగే సాహిత్య కార్యక్రమాలను సమన్వయపరిచి వాటిని ప్రోత్సహిస్తున్న కేంద్ర సాహిత్య అకాదెమీ, తక్కువ ధరలకు మంచి పుస్తకాలు లభ్యమయ్యేలా చూడడం పుస్తక ప్రదర్శనలు ఏర్పాటు చెయ్యడంలాంటి వాటిలో కృషి చేస్తున్న జాతీయ పుస్తక సంస్థ మొదలైనవి స్వాతంత్ర్యానంతరం వెలుగులోకి వచ్చిన విషయం సర్వ విదితం.

భాషా సాహిత్యాల ద్వారా దేశ సమైక్యాన్ని సాధించేందుకు ఈనాడు ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఒక భాషాప్రాంతం వారు మరొక భాషాప్రాంతంలోని సాహిత్యాన్ని తమదిగా చేసుకోవాలని అభిలషిస్తున్నారు. అందువల్ల అనువాద రచనల సంఖ్య నానాటికి పెరిగిపోతున్నది. మన దేశంలోని రాష్ట్ర కేంద్రప్రభుత్వాలు, యునెస్కోవంటి ప్రపంచ సంస్థ ఈ అనువాద కార్యక్రమాన్ని ప్రోత్సహిస్తున్నవి. ఒక విధంగా చూస్తే, యిది అనువాద యుగ మని చెప్పవచ్చు.

ఈ బహుముఖమైన కార్యకలాపాలనే కాక, వివిధ భాషలలోనూ విజ్ఞాన సర్వస్వరచనకు కూడా ఆయా రాష్ట్రప్రభుత్వాలు ప్రోత్సహించడం గమనించదగిన అంశం. బెంగాలీ, తెలుగు మొదలైన కొన్ని భాషలలో అయితే స్వాతంత్ర్యానికి పూర్వమే విజ్ఞాన సర్వస్వరచనకు ప్రయత్నాలు జరిగాయి; కొన్ని సంపుటాలు వెలుగు చూశాయి కూడా. ఈ సందర్భంలో, ఏడు లక్షల వ్యయంతో, ఇరవై యేడు సంవత్సరాల కృషికి ఫలితంగా, ఇరవై రెండు సంపుటాలలో బెంగాలీలో వెలువడిన విశ్వకోష్ విజ్ఞాన సర్వస్వం సంభావించదగింది.

ఇక దక్షిణాది భాషలలో విజ్ఞానసర్వస్వం వెలసిన వైనం రేఖా మాత్రంగా పరిశీలిద్దాము.

తెలుగు :

జ్ఞానచక్రం అనే అర్థం గల ఎన్‌సైక్లోపీడియా అన్న శబ్దానికి సమానార్థకంగా విజ్ఞాన సర్వస్వ మని మనం వాడుతున్నాము. తొలుత ఈ మాటను వాడుకలోకి తెచ్చినవారు కొమర్రాజు వెంకట లక్ష్మణరావు గారు(1876 - 1923). ఆయన బహూభాషా పండితుడు. తమ విజ్ఞాన సర్వస్వ కేంద్రానికి తెలుగు విశ్వవిద్యాలయం కొమర్రాజు వారి పేరు పెట్టడం ప్రశంసార్హం. తెలుగు విజ్ఞాన సర్వస్వ సంకలనానికి శ్రీకారం చుట్టిన చిరస్మరణీయు డాయన!

ఆధునిక విజ్ఞానాన్ని తెలుగువారికి తెలియజేయాలన్న మహోద్దేశంతో ఆయన 1906లో విజ్ఞాన చంద్రికా గ్రంధమండలిని స్థాపించారు. విశ్వ విజ్ఞానాన్ని అందించాలనే అభిలాషతో ఆ మహనీయుడు తన ముఖ్య సంపాదకత్వం కింద 1912లో 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము' ప్రకటన ప్రారంభించారు. ఒక్క అకారం మీదనే ఆయన మూడు సంపుటాలు (1912 - 23) ప్రచురించగలిగారు. దక్షిణాదిభాషలలో ఓంప్రథమంగా ప్రకటితమైన విజ్ఞాన సర్వస్వం అదొక్కటే! ఆంధ్ర పునరుజ్జీవనోద్యమంలో ప్రముఖ పాత్ర నిర్వహించిన కొమర్రాజువారు తమ 48వ ఏటనే కాలధర్మం చెందడం దురదృష్టం!

20వ శతాబ్ది పూర్వార్థంలో నివసించిన కందుకూరి బాలసూర్య ప్రసాదరావు జమీన్‌దారుగారు తమ ఆస్థానపండితుల సహాయంతో ఆంధ్ర విజ్ఞానం అనే పేరుతో ఏడు సంపుటాలు మాత్రమే ప్రచురించి మహోపకారం చేశారు.

ఆ తర్వాత ప్రసిద్ధ జాతీయవాది అయిన మాగంటి బాపినీడు గారు (1895 - 1969) ఆంధ్ర సర్వస్వం అనే సంగ్రహ విజ్ఞానకోశం తయారు చేసి 1942లో ప్రచురించారు. ఆయన రూపొందించిన తెలుగుతల్లి అనే బాలల విజ్ఞాన సర్వస్వం కూడా పేర్కొనదగిందే. ఇవి

ఏకవ్యక్తి పథకాలే అయినా, కొమర్రాజు కందుకూరి మాగంటి ప్రభృతులు తెలుగు విజ్ఞాన సర్వస్వ నిర్మాణానికి మార్గదర్శకు లనడం చర్విత చరణ్యం.

విజ్ఞానసర్వస్వ నిర్మాణోద్దేశంతో 1947లో మదరాసులో తెలుగుభాషా సమితి వెలుగులోకి వచ్చింది. 16 సంపుటాలలో విజ్ఞాన సర్వస్వం తీసుకురావాలని సమితి నిర్ణయించింది. గిడుగు వెంకట సీతాపతిగారు(1885 - 1969) ప్రధాన సంగ్రాహకునిగా ఆ మరు సంవత్సరం పని మొదలుపెట్టారు. తర్వాత వసంతరావు వెంకటరావు గారు (1909 - 92) చేరారు. తెలుగు సంస్కృతి సంపుటప్రకటనకుగాను మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు (1891 - 1963) సంగ్రాహకులుగా నియమితు లయ్యారు. విజ్ఞాన సర్వస్వం తొలి 3 సంపుటాలు 1954, 55, 59 సంవత్సరాలలో ప్రకటించబడ్డాయి. తెలుగు సంస్కృతి రెండు సంపుటాలలో అకారాద్యనుక్రమంగా వెలువడింది. కాలక్రమంగా కడమ సంపుటాలు ప్రకటితము లయినాయి.

తెలుగు విశ్వవిద్యాలయం నెలకొల్పబడిన తర్వాత, తెలుగు భాషా సమితి విశ్వవిద్యాలయంలో సంలీన మయింది. తత్ఫలితంగా సంపుటాల సంఖ్యను 36కి విస్తరించాలని నిర్ణయించబడింది. తెలుగు సంస్కృతికి సంబంధించి 3 సంపుటాలు ప్రకటించాలని సంకల్పించారు. వాటిలో రెండు సంపుటాలు వెలువడినవి కూడా. కొత్త విషయాలతోపాటు అదనపు సమాచారం కూడా చేర్చడం జరిగింది. ఒక్క తెలుగు సంస్కృతి రెండవ సంపుటంలోని రచయితల సంఖ్య 254, రచనల సంఖ్య 1190 - అంటే ఈ సంపుటం ఎంతగా విస్తృతి చెందిందో గ్రహించవచ్చు. న్యాయశాస్త్ర పరిపాలనములు, ఇంజనీరింగ్-టెక్నాలజీ, జీవశాస్త్రాలు, లలితకళలు - మొదలైన వాటికి సంబంధించిన సంపుటాలు కూడా వెలువడినవి.

ప్రాచీనమూ ఆధునికమూ అయినా విశ్వవిజ్ఞానాన్ని సమన్వయపరిచి సులభశైలిలో అందజేయాలన్న ఉద్దేశంతో హైదరాబాదులోని సంగ్రహాంధ్ర

విజ్ఞానకోశసమితివారు కృషి చేశారు. 1958 - 71 సంవత్సరాల మధ్య అకారాదిక్రమంలో సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశం అష్టదళపద్మంగా, 8 సంపుటాలలో, వెలువడింది.

సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశం అనగానే సుప్రసిద్ధ విద్వాంసులు ఖండవల్లి లక్ష్మీరంజనం గారి(1908 - 86) పేరు గుర్తుకి వస్తుంది. సంగ్రహ విజ్ఞానకోశం ఒకటి తయారు చెయ్యాలన్న సత్సంకల్పం ఆయనకి 1953లో కలిగింది. ఆచార్య మామిడిపూడి వేంకట రంగయ్యగారు (1889 - 1982) సంపాదకీయ వర్గానికి అధ్యక్షులు.

ఇటీవల- అంటే 1990లో - విజ్ఞాన సర్వస్వనిర్మాణంలో విశేషానుభవం గల బుడ్డిగ సుబ్బరాయన్ గారు తయారు చేసిన బాలల విజ్ఞాన సర్వస్వం సంస్కృతివిభాగం సర్వాంగ సుందరంగా వెలువడింది. ఆ మరుసంవత్సరమే దీని పునర్ముద్రణ వెలుగు చూడడం హర్షదాయకం. గతంలో బాలల విజ్ఞానసర్వస్వాన్ని ప్రకటించాలని కొందరు ప్రయత్నించినా, ఆ యశస్సు సుబ్బరాయన్ గారికి దక్కింది. ఇది ఏకవ్యక్తి పథకమే అయినా, ప్రశంసార్హ మైన ప్రయత్నం.

అకారాదిక్రమంలో సంతరించబడిన యీ విజ్ఞాన సర్వస్వం 358 పుటల గ్రంథం. వర్ణచిత్రాలు, దేశపటాలు, ప్రముఖుల ఛాయాచిత్రాలు, ప్రముఖ ఘట్టాల పట్టికలు మొదలైనవి ఈ ఆకరగ్రంథానికి అవసరమైనవి ఎన్నో చేర్చబడినది. ఇందువల్ల ఈ గ్రంథం విలువ ఎంతగానో పెరగడమే కాక, ఇది ఎవరికోసం ఉద్దేశింపబడిందో ఆ బాలబాలికలు దీన్ని శ్రద్ధాసక్తులతో సంప్రదిస్తారు. సరళసుందర మైన శైలిలో సంతరించబడడం వల్లను, చెప్పదలచిన విషయాన్ని ప్రామాణికంగా ఉండేలా వివరించడం వల్లను సంపాదకుల ప్రయత్నాన్ని అందరూ హర్షిస్తారు. ప్రకాశకులు కూడా తగినంత శ్రద్ధ వహించడం వల్ల, ఈ గ్రందం పిల్లల్ని ఆకర్షిస్తుంది.

**తమిళం :**

తమిళభాషా సారస్వతాలు ప్రాచినములె అయినా, విజ్ఞానసర్వస్వం

మాత్రం ఇటీవలి కాలంలోనే వెలువడినది. అయితే 1910లో విజ్ఞాన సర్వస్వం కాకపోయినా, తత్తుల్య మైన గ్రంధం ఒకటి వెలువడింది. దాని పేరు అబిదాన(అభిధాన) చింతామణి. సంకలనకర్త ఆ. సింగార వేలు ముదలియారు. ఆయన మదరాసులో పచ్చయప్ప కళాశాలలో తమిళ పండితులుగా పని చేశారు.

ఆధునిక విజ్ఞాన సర్వస్వంలో కానవచ్చే అన్ని విషయాలు చింతా మణిలో లేవు. దీనిని నిఘంటు వనడం సముచితం. అభిధాన మనే శబ్దానికి నిఘంటువనే అర్థం ఉన్నది. అయితే తమిళపండితులు కొందరు దీనినే తమ తొలి విజ్ఞాన సర్వస్వ మని భావిస్తున్నారు.

ప్రపంచంలో వివిధప్రాంతాలలో కానవచ్చే పేర్లు, ప్రచారంలో ఉన్న భిన్న భిన్న ఆచార వ్యవహారాలు, సాహిత్యంలో స్థానం సంపాదించిన గాథలు ప్రముఖ పాత్రలు మొదలైన వివరాలు, జ్యోతిషం మొదలైన శాస్త్రాలకు సంబంధించిన విషయాలు, ప్రాచీన కాలంలో వర్ధిల్లిన రాజులు, కవిపుంగవులు, వదాన్యశేఖరులు ప్రభృతుల్ని గురించిన పెక్కు విషయాలు అబిదాన చింతామణిలో ఉన్నాయి. అందువల్ల దీన్ని విజ్ఞాన సర్వస్వ మనడం జరిగింది.

మదరాసు, తమిళ్‌వళర్చిక్కళగం (తమిళభాషావర్ధక సమితి) వారు ప్రచురించిన కలైక్కళంజియమే తమిళంలో వెలసిన తొలి విజ్ఞాన సర్వస్వం. కళంజియం అనే మాటకు తెలుగులో ధాన్యాగారం, కొటారం, కోశం అని అర్థాలు చెప్పవచ్చు.

1947లో తెలుగు భాషా సమితితో పాటు తమిళ్‌వళర్చిక్కళగం స్థాపించబడింది. ఇందుకు కారణభూతులు అప్పటి విద్యాశాఖా మాత్యులూ భాషాభిమానులూ అయిన తి. స. అవినాశలింగం చెట్టిగారు. ద్రావిడ భాషలలో విజ్ఞాన మంజూష తయారు చేయించడం కోసం ఆయన ఒక ఉద్యమం ప్రారంభించారు. ఆయన కృషిని కొనియాడక తప్పదు.

కళంజియం రచన 1947లోనే మొదలయింది. ప్రారంభమైన ఏడేళ్లకు - అనగా 54లో - ప్రథమ సంపుటం వెలుగులోకి వచ్చింది.

ఇది 742 పుటల గ్రంధం. అ మొదలుకొని ఇండోనీషియా వరకు గల వివిధ విషయాలూ అకారాద్యక్షర క్రమంగా వివరించబడ్డాయి. ఈ సంపుటానికి పీఠిక వ్రాస్తూ అవినాశలింగం గారు తమిళ విజ్ఞానసర్వస్వ రచనను గురించి కొన్ని విషయాలు పేర్కొన్నారు. వాటిలోంచి కొన్ని భాగాలను యధాతధంగా ఉదాహరిస్తున్నాను.

'తమిళభాష అత్యంత ప్రాచీన మైనది..... సాటిలేని సంగకాలపు గ్రంధావళి, ప్రశస్త కావ్యములైన సిల పదికారం, పెరియపురాణం, కంబ రామాయణం వంటివి యిందులో ఉన్నాయి. తమిళ విజ్ఞాన సర్వస్వం ఒకటి వెలువడాలని పెద్ద లందరూ చాలా కాలంగా భావిస్తూ వచ్చారు. తమిళవళర్చిక్కళగం ఆధ్వర్యమున 1947, ఆగస్టు 14న విజ్ఞాన సర్వస్వ రచనకు సంబంధించిన ఒక ప్రకటనను నేను వెలువరించాను. మిత్రు లందరూ సహర్షంగా సహాయం చేయడానికి ముందుకు వచ్చారు. రెండు రోజుల్లోగా ఒక లక్షకు పైగా విరాళాలు లభించాయి. 1947 అక్టోబరులో విజయదశమినాడు కళంజియం రచనాకార్యక్రమం మదరాసు విశ్వవిద్యాలయ భవనంలో ప్రారంభించబడింది...... ఇలా తమిళుల కృషికి ఫలితంగా సంతరించబడిన యీ మొదటి సంపుటాన్ని తమిళ మాతృశ్రీపద సన్నిధిని సమర్పిస్తున్నాము.'

కనుక ఈ కలైక్కళంజియమే తొలి తమిళ విజ్ఞానసర్వస్వ మని నిస్సంశయంగా చెప్పవచ్చు. ప్రసిద్ధ కవి రచయిత అయిన మ. ప. పెరియసామి తూరన్ సంపాదకత్వాన ఇతర సంపుటాలు కూడా కాలక్రమాన వెలువడినవి. చివరిది తొమ్మిదవ సంపుటం 1963లో వెలువడింది. ఈ సంపుటాల వివరాలను ఈ దిగువ ఉదాహరించడ మైనది.

| సంపుటం సంఖ్య | విషయ వివరణ | పుటలు | వ్యాసకర్తలు | సంవత్సరం |
|---|---|---|---|---|
| 1. | అ - ఇండోనీషియా | 3 + 742 | 207 | 1954 |
| 2. | ఇబ్సెన్ - అహోదు | 16 + 760 | 210 | 1955 |
| 3. | క - కుడిప్పళ్లి | 14 + 756 | 223 | 1956 |
| 4. | కుడిమై - చినిమా | 14 + 778 | 219 | 1956 |

| | | | | |
|---|---|---|---|---|
| 5. | చి - తిరున్దు | 16 + 750 | 215 | 1958 |
| 6. | తిరుజ్ఞా - పరిట్ప్పై | 16 + 770 | 244 | 1959 |
| 7. | పరుకూర్ - బౌతికం | 14 + 754 | 231 | 1960 |
| 8. | మ - దౌలత్ | 16 + 788 | 209 | 1961 |
| 9. | ల - క్షేత్రజ్ఞర్ | 16 + 752 | 207 | 1963 |

ప్రసిద్ధ రచయితల వ్యాసాలు గల ఈ 6,850 పుటల కలైక్క ళంజియం తమిళభాషామతల్లికి అపూర్వాలంకారం అనడం నిర్వివాదం.

ఈ వివిధ సంపుటాలలోను చక్కని బొమ్మలు, ద్వివర్ణ, త్రివర్ణ చిత్రాలు, దేశపటాలు ఎన్నో అందాలు దిద్దుకున్నాయి. ప్రధాన సంపాద కులు తూరన్ పేర్కొన్నట్లుగా, 'విజ్ఞాన సర్వస్వ మనునది 9 సంపుటాలలో పూర్తి కాదు. కొత్త విషయా లెన్నో వెలుగు చూస్తున్నవి. సంపుటాల సంఖ్య పెరుగుతుంది. వివిధ విషయాలను గురించి సంతరించబడిన వ్యాసాలను భావి పరిశోధనల ఫలితంగా కనుగొనబడే సత్యాలను పురస్క రించుకుని మార్చవలసిన పరిస్థితి ఏర్పడవచ్చు. ఇలా విజ్ఞాన సర్వస్వం పెరుగుతూనే వుంటుంది.' ఈ మాటలు సత్యసన్నిహితాలు.

తూరన్ గారి సంపాదకత్వంలోనే బాలల విజ్ఞాన సర్వస్వం పది సంపుటాలలో (1965 - 75) వెలువడడం హర్షించదగిన అంశం. ఇది కూడా అకారాది పద్ధతిలోనే ఉన్నది.

తంజావూరులోని తమిళ విశ్వవిద్యాలయంవారు ఒక విజ్ఞాన సర్వస్వం (కళంజియం) తయారు చేస్తున్నారు. కొన్ని సంపుటాలు సిద్ధమైనట్లు తెలియవస్తున్నది.

కన్నడం :

కన్నడంలో విజ్ఞాన సర్వస్వ మనగానే కె. యస్. కారంత్ గారు ప్రచురించిన బాలప్రపంచ స్ఫురణకు వస్తుంది. ఆయన పూర్తిపేరు కోట శివరాము కారంత్.

కారంత్ ఫలానా రంగంలో కృషి చేశారని చెప్పడం కంటె, సంగీత

సాహిత్యాలలోని వివిధ శాఖలలోను ఆయన విస్తారంగా కృషి చేసి మంచి పంటలు పండించారనటం సముచితం. ఉత్తమ నవలలే కాక యక్షగాన బయలాట (యక్షగాన ప్రదర్శన) వంటి ప్రశస్త పరిశో ధన గ్రంధాలు కూడా ఆయన వ్రాశారు. జ్ఞానపీఠ పురస్కారం పొందిన ప్రముఖ రచయిత. గ్రంధరచనా వ్యాసంగంతో పాటు, కన్నడనాడులో చాలచోట్ల యక్షగానప్రదర్శన కార్యక్రమాలు నిర్వహించి కొనయూపిరితో ఉన్న యీ ప్రక్రియకు పునః ప్రాణప్రతిష్ఠ చేశారు. నాటకాలు వేశారు. నాట్యం అభ్యసించి నాట్యప్రదర్శన లిచ్చారు. చిత్రకళలో, ఛాయా చిత్ర కళలో, చలనచిత్ర నిర్మాణంలో - ఇలా ఒకటేమిటి - వివిధ రంగాలలో సమదికోత్సాహంతో కృషి చేశారు. బహుముఖీనమైన ప్రజ్ఞ కలవాడు కనుకనే, సంస్థలు నిర్వహించవలసిన కార్యక్రమాలను కూడా ఆయన ఒక్క చేతిమీద విజయవంతంగా నిర్వహించగలిగారని చెప్పడం అతిశయోక్తి కాదు.

కారంత్ 1930లో బాలప్రపంచ మొదటి సంపుటం ప్రచురిం చారు. కన్నడంలో వెలువడిన తొట్టతొలి విజ్ఞాన సర్వస్వం ఇదే. పేరుకి బాలప్రపంచమే కాని, వయోవృద్ధులకు కూడా ఇది ఉపకరి స్తున్నదని విజ్ఞులు భావిస్తున్నారు. మొదటి సంపుటం రాయల్ సైజులో 1800 పుటల బృహద్గ్రంధం. ఇందులో ప్రకృతి విజ్ఞానం, దేశాలు, సాహిత్యం, కళలు, క్రీడలు, భౌతిక విజ్ఞానం, ఇతిహాసాలు, యంత్రయుగం, జీవనచరిత్ర, సమాజ విజ్ఞానం మొదలైన అధ్యాయాలు ఉన్నాయి. ఈ ప్రధాన శీర్షికల కింద ఉపశీర్షిక లెన్నో ఉన్నాయి. వర్ణచిత్రాలు, చక్కని బొమ్మలు, మంచి కాగితం, ముద్దులు మూటగట్టే ముద్రణ మొదలైనవి యీ గ్రంధానికి అందచందాలు చేకూర్చినవి. ఆ తర్వాత మరి రెండు సంపుటాలు ఇదే విదంగా వెలువడినాయి. ఈ మూడు సంపుటాలలో కారంత్ తలపెట్టిన బాలప్రపంచ విజ్ఞాన సర్వస్వం పూర్తి అయింది.

బాల ప్రపంచతో తృప్తి పడి ఊరుకొలేదు శివరామ కారంత్. కేవలం విజ్ఞాన శాస్త్రమునకు సంబంధించిన విజ్ఞాన సర్వస్వం వెలువ రించాలని కృషి చేశారు. 1959 - 1964ల మధ్య 4సంపుటాలు

వెలుగులోకి రావడం, అవి ప్రముఖుల ప్రశంసకు పాత్రం కావడం జరిగాయి. ప్రతి సంపుటంలోనూ 500 పుటలు. ఈ జగత్తు అనే మొదటి సంపుటంలో ఖగోళశాస్త్రానికి సంబంధించిన వ్యాసాలు, జీవ జీవన సంపుటంలో జీవశాస్త్ర విషయాలు, వస్తు చైతన్య అనే 3వ సంపుటంలో భౌతిక శాస్త్ర విషయాలు చోటు చేసుకున్నాయి. చివ్వరి సంపుటంలో విజ్ఞాన సాధన గురించి చెప్పబడింది. ఒక్కచేతి మీదుగా విజ్ఞాన శాస్త్రానికి సంబంధించిన 4 సంపుటాలు వెలుగు చూడడ మన్నది అభినందించవలసిన విషయం. పైగా ఆయన విజ్ఞానశాస్త్రంలో పట్టభద్రుడు కూడా కాదు!

ప్రముఖ రచయిత నిరంజన సంపాదకత్వంలో జ్ఞానగంగోత్రి అనే 7సంపుటాల విజ్ఞాన సర్వస్వం వెలువడింది. బెంగుళూరులోని కర్ణాటక సహకార ప్రచురణాలయం వారు ప్రకాశకులు. 1970 - 74 సంవత్సరాల మధ్య మానవ జాతి కథ, జీవ జగత్తు, యంత్ర జగత్తు, క్రీడల మనోల్లాసం, భారత కథ మొదలైన సంపుటాలు వెలుగు చూశాయి. ప్రతి సంపుటంలోనూ దాదాపు 700 పుట లున్నాయి.

మైసూరు విశ్వ విద్యాలయంలోని కన్నడ అధ్యయన సంస్థవారు 14 సంపుటాలలో కన్నడ విశ్వకోశం వెలువరించారు. ఇది బృహత్ ప్రయత్న మనడం సముచితం. 1969లో పని ప్రారంభించారు. ప్రసిద్ధ విద్యాంసులు డి. జవరె గౌడ గారు సంపాదకులు.

**మలయాళం :**

మలయాళంలో ప్రప్రథమ విజ్ఞాన సర్వస్వమును ప్రచురించిన యశస్సు మాతృభాష్యాయం. కుళివేలి అనే విద్యాంసుడికి దక్కింది. 8 సంపుటాలలో వెలసిన దీనిపేరు 'విజ్ఞానం'. 1957 - 73 సంవత్సరాల మధ్య ఇవి వెలువడ్డాయి. ప్రతి సంపుటం డెమీ ఆక్టేవో సైజులో వెయ్యి పుటల గ్రంథం. సుమారు 1600 విషయాలు వివరించడం జరిగింది. చిత్రాలు కూడా 1600 దాకా ఉన్నాయి. ఇతర పండితుల సహాయం స్వీకరించినా, కుళివేలి గారే అధికసంఖ్యలో వ్యాసాలు

వ్రాశారు. ఈ సంపుటాలకు యల్. ఏ. రవివర్మగారు పర్యవేక్షకులు; సంపాదకులని కూడా చెప్పవచ్చు. విషయాల ఎన్నికలో గాని విషయ విశ్లేషణలో గాని ఈ విజ్ఞానం అంత ప్రశస్తంగా లేదని భావించబడినా, ఇది ప్రశంసార్హమైన ప్రయత్న మనడంలో సందేహం లేదు.

తొలి సంపుటం మున్నుడిలో కుళివేలి ఇలా అన్నారు. 'సమస్త విజ్ఞానమును గురించి చిన్న చిన్న వ్యాసాలలో సులభమైన భాషలో సామాన్యులకు సైతం అర్ధమయ్యేలా వ్రాయడానికి ప్రయత్నించబడుతుంది. కేరళీయుల అభిరుచులను అవసరాలను ప్రధానంగా దృష్టిలో ఉంచుకుని ఇది తయారు చేయబడుతుంది.' సమస్త విజ్ఞానాన్ని సంపాదకులు ప్రపంచం, భూమి, జీవితం, వృక్షసంపద, మృగములు, మానవుడు, సంఘజీవి అయిన మానవుడు, ప్రజ్ఞానిధి అయిన మానవుడు, ప్రాచీన నాగరకత, మహాపురుషులు, దేశములు, జనులు మొదలైన 14 భాగాలుగా విభజించారు.

1967లో కొట్టాయంలోని సాహిత్య ప్రవర్తక సహకార సంఘం వారు విశ్వవిజ్ఞానకోశం అనే బృహత్ విజ్ఞానకోశం తలపెట్టారు. పని మొదలు పెట్టిన అయిదేండ్లలో 10 సంపుటాలు తీసుకువచ్చారు. 12,000 విషయాలు, 8,000 చిత్రాలు, 10,000 లకు పైగా పుటలు గల ఈ విజ్ఞాన సర్వస్వానికి పి. టి. భాస్కర పణిక్కర్ గారు సంపాదకులు. తొలి ప్రయత్నం కంటె ఇది అతి ప్రశస్త మైనదని పండితులు భావిస్తున్నారు.

1962లో కేరళప్రభుత్వం విజ్ఞాన సర్వస్వ ప్రచురణ నిమిత్తం ఒక ప్రత్యేక శాఖను నెలకొల్పింది. ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా వంటి ఉద్గ్రంథాన్ని ప్రచురించాలని ఉద్దేశించారు. యన్. గోపాలపిళ్లై అనే ప్రసిద్ధ సంస్కృత-మలయాళ పండితుణ్లే ప్రధాన సంపాదకునిగా నియమించారు. ఆయన పర్యవేక్షణలో విజ్ఞాన సర్వస్వ రచన అనుకున్నంత వేగంగా జరగలేదు. 1969లో కె. యం. జార్జిగారు సంపాదకు లయ్యారు. ఆయన సంపాదకత్వంలో విజ్ఞాన సర్వస్వం ముందడుగు వేసింది. విజ్ఞాన సర్వస్వ

విషయాలను పునః వ్యవస్థీకరించి కొత్త మెరుగులు దిద్దారు. ఆయన హయాములో రెండు సంపుటాలు(1972 - 74) వెలువడి పండితుల ఆదరాభిమానాలు చూరగొన్నాయి. 1976లో విజ్ఞాన సర్వస్వ శాఖను స్వయంపాలక సంస్థగా చేసి, వెళ్లయాని అర్జునన్ అనే పండితుణ్ణి డైరెక్టరుగా నియమించారు. తర్వాత సి. జి. రామచంద్రన్ నాయర్ ఆ పదవిని స్వీకరించారు. ఎనిమిదవ సంపుటంలో ఒక్క కేరళను గురించే 400 పుటలలో చెప్పడం జరిగింది.

ఈ సంస్థ 35,000 విషయాలను గురించి 20 సంపుటాల విజ్ఞాన సర్వస్వాన్ని ప్రచురించాలని యత్నిస్తున్నది. ఆశించిన సంపుటాలన్నీ పూర్తి అయితే, ఇది కేరళీయులకు వరప్రసాదం కాగలదని భావించవచ్చు.

ఇలా దక్షిణాది భాషలలో విజ్ఞాన సర్వస్వ నిర్మాణం జరిగి పాఠకుల ప్రశంసకు పాత్ర మయింది. మున్ముందు కొత్త సంపుటాలు వెలువడగలవని ఆశించవచ్చు. విజ్ఞాన సర్వస్వ సంపుటాలు ప్రచుర ప్రచారంలోకి వచ్చేకొద్దీ 'భగవంతుని శాప మైన అజ్ఞానం' నశించవచ్చుననీ, జ్ఞాన విశిష్టుడైన మానవుడు జ్ఞానవృద్ధుడు కాగలడనీ నిస్సంశయంగా పేర్కొనవచ్చు.